# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

ARUNATARA

సంపుటి: 44 సంచిక: 3 హైదరాబాద్ 323 ఏప్రిల్, 2016 పేజీలు: 68 వెల: రు. 20



చావు పుట్టుకల మధ్య కాలమే జీవితం కదా
జీవితపు రెండో చివరే మాకు ముఖ్యం
అక్కడ
మేం దాటివచ్చిన అగడ్తల ముళ్ళకంచెల్ని
గుర్తు చేసే శాసనాలు నాటుతాం
చేరవలసిన గమ్యమెంత దూరమో
తెలిపే మైలురాళ్ళమవుతాం

15 మార్చి 2016న హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో వేముల రోహిత్ సంస్మరణలో విరసం సభ్యుల రచనల సంకలనం "వెలివాడే తొలిపొద్దై" పుస్తకావిష్కరణ సభ దృశ్యాలు


రాంకి


గీతాంజలి


వేల్పుల సుంకన్న


గజవెల్లి ఈశ్వర్


డా. శ్రీపతి రాముడు


డి. ఉదయ్ భాను


డా. సౌమ్య దేచమ్మ


వరవరరావు


సి. కాశీం



వేముల రోహిత్ సంస్మరణలో వచ్చిన విరసం సభ్యుల రచనల సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న రోహిత్ తల్లి వేముల రాధిక

KLVA10 1M186

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక



323

సంపాదక లేఖ..

సంపుటి : 44 ◇ సంచిక : 3 ◇ ఏప్రిల్, 2016 వెల : రు. 20/-

కొన్ని విశ్వవిద్యాలయాలు దేశద్రోహులకు నిలయాలైపోయాయి. అవి కేవలం పాఠాలు వల్లెవేయకుండా ఆలోచనలు పోతున్నాయి. ప్రశ్నలకు పురుడుపోస్తున్నాయి. రాజధర్మాన్ని ప్రశ్నిస్తున్నాయి. శాసనాల్ను ధిక్కరిస్తున్నాయి. మోడీ ప్రభుత్వం యూనివర్శిటీలను ప్రక్షాళన చేయాలనుకున్నది. ధర్మసంస్థాపన కోసం, పెట్టుబడుల కోసం మానవ వనరుల అభివృద్ధి నిరాటంకంగా జరగాలంటే 'శస్త్రచికిత్సకు దిగక తప్ప'దనుకున్నది. మునుపటి ప్రభుత్వం అనుకోలేదని కాదు. ఇప్పుడు బిజెపికి కలిసి వచ్చిన అంశాలున్నాయి. ముందూ, వెనకా ఆర్.ఎస్.ఎస్ మూకబలం, దానికి సరిపడా భావజాలం ఉన్నది. రోహిత్, కన్నయ్య, అనిర్బన్, ఉమర్ వేరు వేరు రూపాల్లో సంఘపరివార్‌కు టార్గెట్ అయ్యారు. నాస్తికుడు, కమ్యూనిస్టు అయినా కూడా పుట్టుక వల్ల ఉమర్ చాలా సులభంగా తీవ్రవాది కూడా అయ్యాడు. తాజాగా ఉదయ్ భాను తెలంగాణ పోలీసు రాజ్యానికి లక్ష్యం అయ్యాడు.

కామ్రేడ్ ఉదయ్ భాను హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ పరిశోధక విద్యార్థి. విరసం సభ్యుడు. హెచ్.సీ.యూలో న్యాయం అడుగుతున్న విద్యార్థుల నుండి నేరస్తులను రక్షించడానికి వందలాది పోలీసు బలగాలు విద్యార్థుల మీద దాడి చేసి, వారి వొంటిపై లాఠీలు విరిచి, పోలీస్ స్టేషన్‌కు తరలించి అక్రమకేసులు నమోదు చేసిన మరుసటి రోజు ఉదయ్ భానును లక్ష్యం చేసుకుని కొట్టారు పోలీసులు. పోలీసు హింస ప్రమాణాల ప్రకారం అది థర్డ్ డిగ్రీ హింస. రోహిత్ చావుకు కారకులను శిక్షించాలని చేసిన ఆందోళనకు పోలీసు మార్కు శిక్ష యూనివర్సిటీ ప్రాంగణంలోనే అమలు చేశారు. దాదాపు అరగంట పాటు ఆయనను గురిచేసిన చిత్రహింసల గురించి పూసగుచ్చినట్లు ఉదయ్ భాను రాశాడు. నిన్ను చంపేస్తాం అని వాళ్ళు చెవిలో చెప్పిన మాట కూడా రాశాడు. తనమీద జరిగిన దాడి గురించి చెప్తూ "ఏ తెలంగాణ కోసం నా అవగాహనను ఆచరణగా మార్చానో ఆ తెలంగాణ ఇప్పుడు పోలీసు తెలంగాణగా మారింది. పైన బిజెపి, కింద తెలంగాణ ప్రభుత్వం మధ్యలో తెలంగాణ ప్రజలు క్రష్ అవుతున్నరు" అని రాశాడు. ఈ అవగాహన వల్లే ఆయన రాజ్యానికి లక్ష్యం అయ్యాడు.

ఉదయ్ భాను తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో విద్యార్థి సంఘ కార్యకర్తగా, కవిగా, కళాకారుడిగా క్రియాశీలక భాగస్వామ్యం వహించాడు. తెలంగాణ ఆకాంక్ష కొరకే కాదు, సకల పీడిత ప్రజల విముక్తి కోసం తన అవగాహనను ఆచరణగా మార్చాడు. తెలంగాణ 'జంగ్', దండకారణ్య ప్రజాయుద్ధ 'పిల్లనగ్రోవి తుఫాను' రాగాలు ఆయన కవితా వస్తువులు. విద్యార్థుల క్రియాశీలక రాజకీయ జోక్యం సమాజంలో ఎలా ఉంటుందో అందరికన్నా తెలంగాణ పాలకవర్గాలకు బాగా తెలుసు. ఢిల్లీలో జె.ఎన్.యూ విద్యార్థులను జైలుకు పంపితే.. హెచ్.సీ.యూ అధికారగణం, తెలంగాణ పోలీసు రెండాకులు ఎక్కువ చదివినట్లుగా ఏకంగా సెంట్రల్ యూనివర్సిటీనే సెంట్రల్ జైలుగా మార్చారు. విద్యార్థులకు తిండి నీళ్ళు కూడా బందు చేశారు. విచక్షణారహితంగా కాదు, లక్ష్యం చేసుకునీ, కక్షపూరితంగా విద్యార్థులపై దాడి చేసి కొట్టారు. అమ్మాయిలను విపరీతంగా కొట్టడమే కాదు, రేప్ చేస్తామని బెదిరించారు. విద్యార్థుల పక్షం వహించిన ప్రొఫెసర్లనూ కొట్టారు. రోహిత్ ఆత్మహత్యకు దారితీసిన సంఘపరివార్ బ్రాహ్మణీయ నియతృత్వం మరింత తీవ్రరూపంలో పంతం పట్టి అమలు చేయిస్తున్నది బి.జె.పి, టి.ఆర్.ఎస్ ప్రభుత్వం కూడా. ఫాసిజానికి, ప్రజాస్వామిక భావాలకు మధ్య ఘర్షణ యూనివర్శిటీలను కుతకుత ఉడికిస్తున్నది.

దేశ మూలవాసుల జల్ జంగల్ జమీన్‌లను దురాక్రమించే దేశ విదేశీ పెట్టుబడిదారుల పక్షాన దండకారణ్యంలో నాలుగు లక్షల సైన్యంతో యుద్ధానికి దిగి, తెర మీద దేశభక్తి నాటకం ఆడుతున్నది ప్రభుత్వం. తెర వెనుకకు తోయబడిన బస్తర్ ముఖాన్ని జె.ఎన్.యూ విద్యార్థి ఉద్యమ వేదిక మీద సోనీ సోరీ వ్యక్తీకరించింది. బ్రాహ్మణీయ ఆధిపత్య రాజ్య స్వభావమూ, దాని రాజకీయార్థిక మూలాలను కూడా దండకారణ్య వర్గపోరాట రాజకీయాల నుండి కామ్రేడ్ ఉదయ్‌భాను సృజనాత్మకంగా వ్యక్తీకరిస్తున్నాడు. తన ఆచరణ కొనసాగుతుందని హామీ ఇస్తున్నాడు. ☆

ఎడిటర్
దువ్వూరి వెంకట రామక్రిష్ణారావు
12-15-963, మాణికేశ్వరినగర్,
ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్,
తార్నాకా, హైదరాబాద్-500007.

**రచనలు పంపించాల్సిన చిరునామ:**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి,
హైదరాబాద్ - 500 040.

*** కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail. com** కూ
పంపవచ్చు

సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

మేనేజర్
**వలేటి అరవింద్ కుమార్**
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.

విరసం కార్యదర్శి చిరునామా
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.

డి. టి. పి. అండ్ లే అవుట్
**ఆర్. భాగ్యలక్ష్మి, డి. వైజయంతి**
కవర్ డిజైన్ : పి. వరలక్ష్మి,
ఆర్. భాగ్యలక్ష్మి
కవర్ పేజి ఫొటోలు : క్రాంతి

Like Page://viplava rachayitala sangham arunatara
facebook ://viplava rachayitala sangham virasam
Virasam website : *www. virasam. in*
*www. virasam. org*

## సంచిక - 323



గమనిక : మిత్రులారా, కామ్రేడ్స్! అరుణతార డిటిపి, డిజైనింగ్, ప్రింటింగ్, పోస్టింగ్, రవాణా ఇలా అన్ని ఖర్చులు చాలా పెరిగిపోయాయి. అనివార్య పరిస్థితులలో విడి ప్రతి వెలను ఫిబ్రవరి 2016 సంచిక నుంచి రూ. 20 కు పెంచవలసి వచ్చింది. ఇది గమనించగలరు. ఎప్పటిలానే మీ ఆదరాభిమానాలను, సహకారాన్ని ఆశిస్తున్నాం. అలాగే ఫిబ్రవరి 2016 సంచిక నుంచి అరుణతార సంచికల క్రమాన్ని సంపుటి 44 గాను సంచిక 1 గాను సరిచేసాం. ఈ విషయాన్ని గమనించగలరు. - సం.


అరుణతార చదవండి! చదివించండి! చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి. డి. ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి. డి. లను డి. వి. **రామకృష్ణారావు, హైదరాబాద్** పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

# భక్తి అంటేనే మౌఢ్యం

సి.ఎస్.ఆర్. ప్రసాద్

భక్తి అంటేనే మౌఢ్యం. అది ఏ భక్తయినా కావచ్చు. పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, దైవ భక్తి, వీరుల భక్తి లాంటివి ఎలాంటివైనా మధ్య యుగాల కాలం నాటి చిహ్నాలే. భూస్వామ్య వ్యవస్థ భావజాలమే. భక్తి మనిషిలో ఉండే జిజ్ఞాసని ప్రశ్నించేతత్వాన్ని, శాస్త్రీయ ఆలోచనల్ని, విమర్శనాత్మక దృష్టిని, సమగ్ర విశ్లేషణాశక్తిని ధ్వంసం చేస్తుంది. ఇద్దరు వ్యక్తుల మధ్య భక్తి పరమైన సంబంధం ఉందంటే అది అంతిమంగా ఆధిపత్య సంబంధమే. ఆ సంబంధంలో ఒకడు నిరంకుశ ప్రభువు, రెండవాడు సేవకుడు. భక్తి భావం ప్రభువుకి సకల ఆధిపత్యాలను కలిగిస్తుంది. వాడి మాట 'వేద' వాక్కవుతుంది. భృత్యుడికి తన శరీరం మీద, తన హృదయం మీద తన మెదడు మీద తనకు ఎలాంటి అధికారం ఉండదు. వాడు ఏమి ఆలోచించాలో, ఏమి మాట్లాడాలో ఏమి తినాలో, ఏమి తినకూడదో అన్నీ ప్రభువే నిర్ణయిస్తాడు. భృత్యుడిది బానిస జీవితం. ప్రభువు కోసమే తాను పుట్టానని, ప్రభువు భక్తిలోనే తాను తరిస్తానని; బానిస అయిన భృత్యుడు అనుకొనేలా వాడి చుట్టూ భక్తి ఒక మార్మిక వలయాన్ని సృష్టిస్తుంది. అదే ప్రభువుకు రక్షణ కవచం. అదే ప్రభువు అధికార పీఠానికి పునాది అదే బానిసపాలిట శాపం.

ఈ స్థితి నుండి బానిస విముక్తి పొందటానికి వందల వేల సంవత్సరాల సామాజిక సంఘర్షణ అవసరమయిరెంది. స్వామి భక్తి అనబడే బంగారు పంజరం నుండి బయటపడి మనిషి మనిషిగా బతకటానికి జరిగిన పోరాటంలో వందల వేల మంది త్యాగాలు అవసరమయ్యాయి. అప్పటికి గాని మనిషి తాను స్వంతత్రుడనని. తనకీ ఆలోచనలుంటాయనీ, ఆలోచనల్ని సాకారం చేసుకొనే దిశగా ప్రయాణించే స్వేచ్ఛతనుకున్నదని, ఆ క్రమంలోనే తాను చైతన్యవంతుడనవుతానని గ్రహించగలిగాడు. ఆ చైతన్యంలోని భాగంగానే మేధో వికాసం ప్రారంభమయింది. ప్రశ్నించేతత్వం కదలబారింది. మనిషికీ మనిషికీ మధ్య ప్రేమపూరితమైన మానవ సంబంధాలుండాలే గాని, ఆధిపత్య సంబంధాలుండకూడదని అప్పుడే మానవ సమాజం స్నేహం ఆధారంగా ప్రజాస్వామిక మవుతుందని ప్రజలు తెలుసుకున్నారు. ఈ ఆలోచనల కొనసాగింపు ఫలితంగానే మనిషి, మనిషితో పాటు సమాజం ప్రజాస్వామికమయ్యాయి. వ్యవస్థలు మారాయి.

అయినా పాలకవర్గాలు, ఆధిపత్యవర్గాలు మనిషిని భక్తి భావంతో కొట్టిపడేయటానికి ఎప్పటికప్పుడు శతవిధాల ప్రయత్నిస్తూనే ఉన్నాయి. ఆ ప్రయత్నాల క్రమంలోనే ఫాసిజం, నాజీయిజం - అనే దుర్మార్గపు మౌఢ్య సిద్ధాంతాలు తలెత్తాయి. ఒకే ఒక్క నాయకుడు, ఒకే ఒక్క జాతి, ఒకే ఒక్క మతం, ఒకే ఒక్క భాష - వీటి ఆధారంగా ఏకశిలవంటి సమాజాలను 'నిర్మించే ప్రయత్నాలు సాగాయి. ప్రభుభక్తి దేశభక్తికి పర్యాయపదమైంది. ప్రభువు తప్పు చేయడు. అతడు దైవ సమానుడు" అనే భావనను పాలక వర్గాలు వాడుకున్నాయి. అనాగరికుల్ని నాగరికుల్ని చేయటానికి సంస్కృతి హీనులకు, సంస్కృతి నేర్పటానికి - భగవంతుడు ఒక వ్యక్తినో, ఒక జాతినో, ఒక మతాన్నో సృష్టిస్తాడని భక్తితో దానికి లోబడి ఉండటమే మనుషుల కర్తవ్యాలని ప్రవచించిన సిద్ధాంతాలు చాలాకాలం రాజ్యమేలాయి.

ఇప్పుడు మన దేశంలో ఇలాంటి ఫాసిస్టుతత్వాన్ని ప్రజల్లో కలిగించటానికి జరుగుతున్న కుటిల యత్నమే "భారత మాతాకీ జై" నినాదం. దేశం ఒక భౌగోళిక స్వరూపం మాత్రమే. దానికొక మానవ రూపాన్నిచ్చి, ఆ రూపానికి దైవత్వాన్ని ఆపాదించి దాన్నందరూ భక్తి భావంతో కీర్తించాలనుకోవడం బ్రహ్మాణీయ కుట్ర.

నిజానికి దేశభక్తికి కొలమానాలంటూ ఏమీ ఉండవు. ఉంటే అది హృదయ సంబంధమైనది మాత్రమే. దేశభక్తి ప్రదర్శనీయమైంది కాదు. భారతమాతాకీ జై అనడం, క్రికెట్ స్టేడియంలో మొహానికి మూడు రంగులు పులుముకొని విలాసంగా జెండాలూపటం, ఒకళ్ళతో ఒకరు పోటీలు పడి వందల అడుగుల జెండాలు తయారు చేసి రికార్డు పుస్తకాలకెక్కడం దేశభక్తి కాదు. సాటి మనిషిని ప్రేమించడమే దేశాన్ని ప్రేమించడం. దేశాన్ని ప్రేమించేవాడు ప్రజలదైన దేశ సంపదను విదేశాలకు తాకట్టు పెట్టడు. దేశాన్ని అమ్మకపు సరుకుగా మార్చడు. నాదేశం దోపిడీ చేయబడటానికి సిద్ధంగా ఉంది, రాండి, రండని దేశ దేశాల పెట్టుబడిదారులను ఆహ్వానించడు.

భక్తి స్థానంలో ప్రేమ, స్నేహం వంటివి ప్రవేశిస్తే మానవ సంబంధాలు ప్రజాస్వామిక సంబంధాలుగా మారతాయి. భక్తి భావన తొలగిపోతే ఆధిపత్య భావనలు కూడా తొలగి వైవిధ్యంతో కూడిన ప్రజా సమూహాలు స్వేచ్ఛగా తమ భవితవ్యాన్ని తామే నిర్ణయించుకొని నూతన ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుంది. సకల రంగాలలోనూ మానవ ప్రమేయం పరిపూర్ణమవ్వాలి. అలా జరిగినప్పుడే "విధాతలు" లేని ప్రజా సమాజం రూపొందుతుంది.

మనసులో నుండి భక్తి భావాన్ని తొలగించుకున్న నాడే మనిషి నిటారుగా నిలబడగలుగుతాడు. అప్పుడే వాడి శక్తియుక్తుల పరిపూర్ణ వికాసం జరుగుతుంది. మానవ సమాజం మధ్య స్వేచ్ఛా పూరితమైన ఆదాన ప్రదానాలుంటాయి.

ఇలాంటి నూతన సమాజ ఆవిష్కరాన్ని కోరుకునే వాళ్ళం ఎలాంటి భక్తి భావనైనా తుదకంటా వ్యతిరేకించాలి. అది మనందరి ప్రజాస్వామిక కర్తవ్యం. దేశాన్ని, మనుషుల్ని ప్రేమిద్దాం, అర్థం చేసుకుందాం. విమర్శనాత్మకంగా వ్యవహరిద్దాం. సమిష్టి ఆచరణలో భాగమవుదాం. కొత్త సమాజాన్ని నిర్మిద్దాం.



# భారత మాతా? హిందూ మాతా?

**పాణి**

దేశభక్తి గురించిన చర్చను ఎంఐఎం నాయకుడు ఓవైసీ మరో మలుపు తిప్పాడు. 'ఈ దేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే..' అనే సంఘపరివార్ తాఖీదు ఏమీ అనిపించని వాళ్లకు 'భారత్ మాతాకీ జై' అనను అని ఓవైసీ అనగానే మంటపుట్టడం సహజం. వెంకయ్యానాయుడు అన్నట్లు ఓవైసీ.. ఖాసింరజ్వీ వారసుడైతే సంఘపరివార్ వాళ్లంతా నాథూరాంగాడ్సే వారసులని రెండో తరగతి పిల్లలు కూడా తరగతి పుస్తకాల జ్ఞానంతో అనగలరు. ఆదలా ఉంచితే ఎంఐఎం ఇస్లామిక్ సంఘపరివార్ అనే అభిప్రాయం కూడా ఉంది. ఆ పార్టీని చాలా మంది అంతకంటే భిన్నంగా చూడరు. జేఎన్‌యూ నేపథ్యంలో దేశభక్తి గురించి హిందుత్వవాదులకు- లౌకిక ప్రజాస్వామిక, విప్లవ శక్తుల మధ్య జరుగుతున్న చర్చ ఓవైసీ మాటలతో పార్లమెంటరీ శక్తుల మధ్య కూడా మొదలైంది. పార్లమెంటరీ రాజకీయాల్లో ఇలాంటి భిన్నాభిప్రాయం చెప్పగల పార్టీలు ఎంఐఎంలాంటివే కావచ్చు. ఎందుకంటే దేశభక్తి విషయంలో హిందూ బేస్డ్ పార్టీలన్నీ సంఘపరివార్‌లాగే ఆలోచిస్తాయి. ఎంఐఎం నాయకుడు భారత్ మాతకు జై కొట్టనని అనడం వెనుక ముస్లిం అస్తిత్వం పని చేసిందని ఒప్పుకున్నా.. ఎక్కువగా ఇస్లామిక్ ఫండమెంటలిస్టు ఆలోచనలే ఓవైసీని నడిపిస్తాయనడంలో సందేహం ఏమీ లేదు.

దేశభక్తి గురించిన చర్చ భారత మాత దగ్గరికి వెళ్లడం ఒక రకంగా మంచిదే. చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. అయితే అవతలి దిక్కు ఓవైసీ ఉన్నందు వల్ల సంఘపరివార్ మూకుమ్మడిగా ప్రజల్లో దేశభక్తి ఉద్వేగాన్ని రెచ్చగొట్టడం తేలికైంది. ఆ రకంగా ఓవైసీ పరోక్షంగా సంఘపరివార్ వాదనలకు ఊతమిచ్చాడు. ఏనాడూ పక్క మనిషి గురించి ఆలోచించని వాళ్లు కూడా ఓవైసీ భారతమాతను అవమానించాడని ఊగిపోతున్నారు. ఇలాంటి మాట ఓ ముస్లిం కాకుండా మరెవరో అంటే ఎలా ఉంటుంది? ఊహించుకోవచ్చు. గాడ్సేను వీరుడిగా గుర్తించడం, గాంధీకి జైకొట్టడం, ఇద్దరినీ కలుపుతూ భారతమాతకు జేజేలు పలకడం.. మొదలైన వికృత విన్యాసాలన్నీ చేయగల సామాజిక, సాంస్కృతిక అనుకూలత సంఘపరివార్‌కు ఉన్నది.

ఇంతకూ ఇప్పుడు భారతమాత అనే భావనకు ప్రాసంగికత ఉన్నదా? అనేది అసలు ప్రశ్న. దేశం, లేదా ప్రజలు అనే అర్థమే భారత మాత అనే భావనలో లేదు. వలస వ్యతిరేక పోరాటంలో చాలా రకాల భావజాలాల వాళ్లు భారత మాత అనే భావనను స్వీకరించారు. అప్పట్లో మతంపట్ల చాలా విమర్శనాత్మకంగా ఉన్న వాళ్లలో కూడా ఈ భావన కనిపించేది: కనీసం మాతృభూమి అనే భావన అందరిలో ఉండేది. బంకించంద్ర ఛటర్జీ చేతిలో మాతృభూమి అనే భావన దుర్గాదేవి రూపంలోని దేశమాతగా మారిపోయే నాటికల్లా అది చాలా ఆమోదం పొందింది. 'మాత', 'వందేమాతరం' మొదలైన భావనల వెనుక సారాంశంలో హిందూ ఆలోచనలు ఉన్నాయి. అవి వలస వ్యతిరేకత నుంచి వచ్చాయి. అయితే 'మన పని బ్రిటీష్‌వాళ్లను వ్యతిరేకించడం కాదు, ముస్లింలను వ్యతిరేకించడం..' అని స్పష్టంగా చెప్పుకొని 'జాతీయోద్యమానికి' దూరంగా ఉండిపోయిన ఆర్ఎస్ఎస్ కూటమి చరిత్ర గతిలో భారతమాత ముద్దుబిడ్డగా మారిపోయింది. వలసవాద వ్యతిరేక ఆకాంక్షల్లోంచి భారతమాతాకీ జై అనే నినాదం ముందుకు వచ్చినా అన్ని రకాల శక్తులకు వలసవాదంపట్ల ఒకే వైఖరి లేదు. భారతమాత అనే మాట అందరి నోట ఒకే అర్థం పలకలేదు. అప్పుడూ ఇప్పుడూ సంఘపరివార్ నోటి వెంట ఇది దేశాన్ని, ప్రజలను ఉద్దేశించిన నినాదంగాకాక హిందూ జాతీయవాద భావనగా వస్తున్నది.

ఈ హిందూ జాతీయవాదాన్ని, దానికి సంబంధించిన భారతమాత అనే భావనను, దాని మూర్తిమత్వాన్ని దేశ ప్రజలందరూ అంగీకరించాల్సిన పని లేదు. అందరూ భారత మాత అనే భావనను అంగీకరించాలని ఒత్తిడి తేవడం ఫాసిజం అవుతుందేగాని దేశభక్తికాదు. కాబట్టి భారత మాతాకీ జై అనే నినాదాన్ని ఎవరి కారణాలతో వాళ్లు వ్యతిరేకించవచ్చు. ఆ స్వేచ్ఛ సంపూర్ణంగా అందరికీ ఉంది. ఓవైసీకి తన కారణం తనకు ఉంది. అదే సమయంలో దేశభక్తి, భారతమాత అనే వాటిపట్ల ఇలాంటి విమర్శనాత్మక వైఖరులను ఇతరులందరూ అంగీకరించాల్సిన పని కూడా లేదు. చట్టం ఒప్పుకొని రాజముద్ర వేయాల్సిన అవసరం లేదు. అసలు రాజముద్రలకు ఆమోదయోగ్యమైన మాటలే మాట్లాడాలని నియమం పెడితే ఇక నోటి మాటగానైనా ప్రజాస్వామ్యం అనుకోడానికి ఏముంటుంది?

తెలిసిగాని, తెలియకగాని భారతమాత పట్ల మమకారం పెంచుకున్న వాళ్లు ఒక విషయం స్పష్టం చేసుకోవాలి. వలస రోజుల్లో భారత మాత అనే భావనలో ఉండిన ఒకటీ అరా ఆదర్శాలు కూడా భారతమాత భావనలో ఇప్పుడు ఉన్నాయా? వలస వ్యతిరేకతలోని విలువలన్నీ రాజకీయార్థిక రంగాల్లో మట్టిగొట్టుకొని పోయాక భారతమాత అనే 'పవిత్ర భావన'లో ఏముందని? ఆరోజుల్లోనే భారత మాతను దుర్గాదేవిగా కొలిచి ఉన్నందు వల్ల భారత మాత పూర్తి స్థాయిలో హిందూమాతగా మారిపోయింది. అందులో దేశమూ లేదు, దేశ ప్రజలూ లేరు. యాభై ఏళ్లకిందే చెరబండరాజు భారతమాతనుద్దేశించి 'అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టు పెట్టిన అందంనీది, ఊసినా, దుమ్మెత్తిపోసినా చలనంలేని మైకం నీది..' అని ఎద్దేవా చేశాడు. ఒకనాటి చారిత్రక, మత, భౌగోళిక, సాంస్కృతిక ఆవరణలోంచి వలస వ్యతిరేక భావనగా ముందుకు వచ్చిన భారతమాత భావనను భారత పాలకవర్గం అన్ని రకాలుగా

(మిగతా 16వ పేజీలో.. )

# శూన్యం నుండి వెలుగు దాకా

## రమేష్ గోండ్యాల

శూన్యంలో వెలుగును వెదజల్లుతున్న నక్షత్రాలను చూసి
మనస్సులో ప్రళయంలా ఏదో ఎగసి పడిందేమో..

నింగిని తాకినట్లున్న కొండల్ని సాహసంతో ఛేదించగలనన్న
నమ్మకం ఏదో తట్టి లేపి నిలబెట్టిందేమో..

ప్రకృతి వైవిధ్యంలో
దాగిన సత్యాన్ని ఒడబోస్తుంటే సమానత్వం అనే స్వప్నం పరిమళించిందేమో..

అరణ్యాలలో వినిపిస్తున్న రోదనలకు జాలిపడిన మేఘాలు
ఎండిన గుండెల దాహం తీర్చుతుంటే హృదయం పాటై పల్లవించిందేమో..

తరుముకొస్తున్న కెరటాలు
తీరాన్ని తాకి
విజయ సంకేతాలు ఇస్తుంటే
చీకటిని పారదోయాలనే భావం సంకల్పించిందేమో..

ఆశయాల కోసం బతకడంకై
ఎన్ని సుడిగాలులను సునామిలను తట్టుకొని నిలబడ్డారు?

అందుకేనేమో బతికిన బతుకంతా కష్టాల కన్నీళ్ళతో కడదాకా ప్రయాణించారు..

శూన్యం నుండి వెలుగు దాకా
కాలం పెట్టే కొత్త షరతులను
దాటడానికి ఇంక ఎన్నెన్ని పువ్వులు నేల రాలి
వెలుగు కాంతులు కావాలో

# కొత్తపాట

## ఎం. రాఘవాచారి

ఎట్లా ఉంటుంది
పాట పగిలిపోతే ఎట్లా ఉంటుంది?

పాటా పాటా నా తల్లీ
నీ గుండె తడారిపోతే ఎట్లా ఉంటుంది?

ఎట్లా తట్టుకునేది
ఎవరితో మొరపెట్టుకునేది
తట్టి తట్టి లేపేదీ ఎవర్ని

చిన్ననాడు
మాట తోడు తెల్వని నాడు
ఊపిరి ఉగ్గపట్టి
ఆపని ఏడ్పును
పాటే కదా ఓదార్చింది

అమ్మపాట లయలో ఒదిగి
అందమైన కలలలో తేలినపుడు
అమ్మకళ్ళలో
ఏయే కలలు పూశాయో
ఏయే స్వప్నాలు పండాయో
అమ్మ పాటల్లో
అలలు అలలుగా ప్రవహించినపుడు
ఎంత హాయి పొంది ఉంటాము
ఆ ఊహే కదలనీయటం లేదు

రోహిత్ నా తండ్రీ
ఉరితాడు నీ గొంతుకు
చుట్టుకున్నపుడు
అమ్మపాట గుర్తొచ్చి ఉంటే
ఎంత బాగుండేది.. ?

నవ్వులు చిలికి
చంద్రిమకు పంచే నీ మోము చూసి
పాటై నువ్వే
అమ్మను ఓదార్చి ఉంటావనుకున్నా
ఎంత దుఃఖిత ఆమె
వైరుధ్యాలు
భగ్గున మండుతున్న సమాజం
ఓదార్పుకోరని తెగించిన జీవితం
వైవిధ్యం నిండిన ఊహల పంట

ఎంత విషాదంగా
ఎంత భీభత్సంగా
ఎంత తృణప్రాయంగా
ఎట్లా ఆగిపోయిందనుకున్నపుడు
గుండెలవిసిపోతున్నవి
ఎట్లా పంచుకోను

నా తండ్రీ రోహిత్
అమ్మలకు అమ్మై
పాట నేర్పింది ప్రకృతి

నువ్వు ప్రకృతిని ప్రేమించావు
నీకు దేశమంటే గొప్ప ప్రకృతి
నీకు దేశమంటే
ప్రకృతిని పండించే ప్రజ
పంపకం దక్కని ప్రజ

ప్రకృతికి వెలకట్టి
మనిషికి వెలకట్టి
అణువణువూ సరుకు చేసిన దళారీకి
ఈ దేశం ఓ వాల్ మార్ట్
వాడికి ప్రేమేం తెలుసు

నువ్వు ప్రేమను ప్రేమించావు
నువ్వు బతుకు ప్రేమించావు
నీ ప్రేమకు
అక్షరాలు కట్టలేకపోతున్నా.

వాడు నిన్ను బతకనిచ్చేవాడు
నువ్వు సరుకై ఉంటే
వాడు నిన్ను కౌగిలించుకునేవాడు
దేశమంటే సరుకే అని ఉంటే
వివక్షలేని దేశం
విశ్వహిందూ దేశం అని ఉంటే..

కలలనూ వ్యాపారం చేసేవాడితోనువ్వు
దేశమంటే ప్రేమ అన్నావు
దేశమంటే శ్రమ అన్నావు
నీ వలపు
నీ తలపు
నీ గెలుపు
దోపిడికి చుక్కెదురు
వాడు నిన్ను బలి తీసుకున్నాడు

రోహిత్ నా కనుపాపా!
నీ చితి మంటల
చలి కాచుకునేవాడి
ఆయువు పట్టు మీద పిడికిళ్ళెత్తి
ఇవాళ ఈ దేశం
నా పాటందుకున్నది

పగిలిన పాట
ప్రాణప్రదమైన పాట
జైళ్ళలో బైళ్ళలో
కొత్త స్వరంలో
ఊపిరి పోసుకుంటున్నది.

# గొంతు విప్పడం నేర్చుకో

## సిద్దెంకి యాదగిరి

మాయల పేరడి
మాటల గారడి
రెండు నాల్కల ధోరణిపై
పురివిప్పిన గొంతుతో రగుల్కొని
అంతం తేలిపోతది

ఆరోపణలై మెరుస్తూ
అలజడి జడివాన అగ్గికురుస్తూ
పరువును కరువుగా మార్చబోతున్నప్పుడు
అధారాలు ఆయుధాలుగా
గొంతుక సెలయేరై పారనివ్వడం నేర్చుకో
నిరూపణల్లేనివన్నీ నీరుగారిపోతయి

తలపై అలోచనల అలలపై
వెంటాడే అనివార్య యుద్ధం
నిన్ను ఓడిస్తూ, పీడిస్తూ
పీల్చి పిప్పిచేసి వెంటాడుతున్నపుడు
గొంతు గాండీవం ఎక్కు పెట్టడం నేర్చుకో
మాటల బాణం రణాన్ని మరచి
కారణాన్ని కనుగొంటది

అస్థిరత సునామి
సుడిగుండమై చుట్టుకొని
ఆపదల వరదలు నీ మీద పొర్లుతున్నపుడు
ఎగసే కెరటంలా
గొంతు ఎగజిమ్మడం నేర్చుకో
ఆత్మ విశ్వాసం పొంగి
సుస్థిరత నింగిని ముద్దాడుతది

ఖంగున మోగిన అవమానం
జ్ఞాపకాల విషాద వలయాలుగా
కృంగిన సమయంలో ఒంటరితనం
నీ బతుకు శ్వాసను బంధించబోతున్నపుడూ
నిందని బద్దలు కొట్టడానికి
ఆశతో ఆత్మగౌరవ తూటా పేల్చడానికి
నిర్భయంగా గొంతు విప్పడం నేర్చుకో
బతుకు భరోస చిగురిస్తది

అక్రమం ఉన్నచోట
విలువలు లేని చోట
గాలిగింగుర్లు తిరిగి ప్రతిధ్వనించినట్లు
నిశ్శబ్దాన్ని చేధించటానికి
శబ్దభేరిలా గొంతును ప్రయోగించడం నేర్చుకో

విలువ నిలువెత్తి గొడుగు పట్టి తోడుంటది

మనసుపై
మారణ గాయాలు మరిగిస్తూ
భరించకుండా బాధిస్తుంటే
భుకంప తీవ్రతని
గొంతులో పలికించటం నేర్చుకో
గాయాలు విజయ గేయాలై వినిపిస్తుంటయి

అస్థిత్వంపై దాడి
నాగరికంపై అనాగరిక దాడి
సంస్కృతిపై అసహనపు దాడి
సమ్మతిపై సంప్రదాయ మూఢత్వపు దాడి
సమాజంపై బూజు పట్టి సాధిస్తున్నపుడు
హద్దులు మీరి అందరి కోసం
బుద్ధిగా గొంతు విప్పడం నేర్చుకో
సుందర ఉదయం
సుమధురంగా ఆవిష్కారమవుతుంది

గొంతువిప్పడం నేర్చుకుంటే
అన్యాయం అంతం
వ్యక్తిత్వం శక్తివంతం
వ్యవస్థ సమర్థవంతం

## జీవకళ

### వేముగంటి మురళీకృష్ణ

నేరమే నిజం
నడకలు నేర్చిన కార్లు, కాళ్ళు
ఎంత తొవ్వతప్పి ఫుట్ పాత్ ఎక్కితే అంత నటన
మరణధ్వనులు చెవులకెక్కించుకొని బిగ్ బాస్ ల లైవ్ 'షో'పుటప్
ల ముంగట గుంపు ముచ్చట
పావురాలను లవ్ ముద్దుగ ఎగరేసి
పక్షులలెక్క ముడుచుకొని పండుకున్న
ప్రాణులమీదికి పయ్యల్ని ఎక్కించడం
మైనే ప్యార్ కియా
మేరాభారత్ మహాన్

నడకలు తెల్వని లోక దార్శనికుడు
వీల్ చేర్ యాత్రికుడు
నేరస్తుడే అని అన్నది
వీల్ కప్పుకున్న ఝండా
కాళ్ళల్లో బలంలేని మనిషిని
అంతర్గత ముప్పన్నది
అందరికంటె ముందు అరెస్టు చేయించింది
న్యాయం జిందాబాద్
నేరం ముర్దాబాద్

నేరమే కుర్చీకి బలం
ఊచలకూ ఓ లెక్కుంది
ఓటుకూ జైలుకు మధ్య విశ్రాంతి ఒప్పందాలు పంచవర్ష
ఎన్నికల ప్రణాళికలు
అమ్మ ఎన్ని నోట్లకట్టలు దాచిపెట్టినా
ఇడ్లి సాంబార్ తిని మర్చిపోవడం పెద్ద నేరమే కాదు
తంబీ న్యాయం
తన్నీర్లో కలిసిపోయింది
కండ్లు తుడుచుకో నిరందిగ

నటులూ ముబ్బారక్
ఇక్కడ నిజాలు చెప్పడం ఎడిటింగ్ చేయబడ్డవి
అబద్దాలూ లాంగ్ లివ్

## రాధిక

### అరసవిల్లి క్రిష్ణ

సాయంకాలం ఆకలవుతుంధి
ఏమనిపిలవను, తల్లీ
నది లా మారిన నిన్ను
దాహం తీర్చమని ఎలా అడగను-
లేత ఆకుల వంటి కనురెప్పలపై
ఏ దీపాన్ని వెలిగించను
ఎవరు తల్లీ

నీకులమేది
నీ బిడ్డ కాలిన బూడిద వర్ణమేది
నీపాదాల చెంత వాలిన పావురం
పీక పిసికి చంపేసాను
పిచ్చుక గూళ్ళను చిదిమేసాను-

ఇక నయినా చెప్పు
నీకులమేది
పూల వనాన్ని చూచి
ఉరి తాడుని చూచి
మంచి నీళ్ళ బావిని చూచి
నీ పేగు బంధం ఆఖరి చిరునవ్వు విని
సత్యమే పలుకు-
దేశం గొంతులో నినాదం
నేలపైకి రాలనంటుంది
పిల్లల ఆర్తనాదాలకు కదిలివస్తున్నావు
నీబిడ్డ శరీరంపై వెలుగు కణాన్ని మొలిపించావు
మళ్ళీ అదే ప్రశ్న
నీ కులమేది

నేను మనువును
మగవాడ్ని
కాషాయ రంగు ముఖం వాణ్ని-

వెతుకు
వెలివాడలలో,
చింపిరి చీర కట్టుకున్నవాడ తల్లుల శోకంలో
తెగిన తలల చివరి జీవంలో
సాయంకాలం రాత్రయింది

ఆకలి తీరలేదు
కులం రంగు కనబడదు
ఎలా భరించావు తల్లీ

పొత్తిళ్ళలో బిడ్డడ్ని పెట్టుకొని
కులం వర్ణం చూపడానికి-

చూడండిరా
భారతమాత
సగం మరణాన్ని సగం జననాన్ని
వెతకండిరా

మన తల్లుల గర్భశోకాల్ని

## సెంట్రీ

### కె. నాగేశ్వరాచారి

వ్యవస్థ పతనావస్థలోని
ప్రేలాపనలవి
మరణావస్థలోని ప్రేలాపనలవి,
ఒక ప్రశ్న రాలిపోయినంత మాత్రాన
మాకు జడుపూ లేదు
ధృతి చెదరనూ లేదు
చెరపనూ లేరు
కోటానుకోట్ల ప్రశ్నల నక్షత్రాలు
మిలమిలలాడునే వుంటాయి
మాపై నిందలు
ప్రచార పటాటోపాలే!
తెగిన బల్లితోకలే!
మరణం
మాకు ముగింపు కాదు
పోరాటంలో సేద తీర్చుకుని
వారసత్వాన్ని నింపుకునే ఫూలింగ్ స్టేషన్
చావు పుట్టుకల మధ్య కాలమే జీవితం కదా!
జీవితపు రెండో చివరే మాకు ముఖ్యం
అక్కడ
మేం దాటివచ్చిన అగడ్తల్ని ముళ్ళకంచెల్ని
గుర్తు చేసే శాసనాలు నాటుతాం
చేరవలసిన గమ్యమెంత దూరమో
తెలిపే మైలురాళ్ళమవుతాం
చరిత్రలో భాగమవుతూ
మా చరిత్ర ఇప్పుడు మేమే రాసుకుంటాం
కనురెప్ప నీడలో సేదతీర్చుకుంటూ
ఆహోరాత్రులు
కాలానికి సెంట్రీ కాస్తాం!
(రోహిత్ మరణంపై)

## రహస్యం!

### రాంకి

ఈ క్షణానికే అలా ఉందని తెలుసు
ఎల్ల కాలానికీ కాదని తెలుసు
మార్పు తప్ప
మరేదీ శాశ్వతం కాదనీ తెలుసు
కొన్ని క్షణాలు అంతే
ఆ క్షణాలు గడిచి ముందుకు నడిచామా
విశాల ప్రపంచంలోకి అడుగులు విస్తరిస్తాయి
పోనిలే ఇలా కాదులే
అనుకుంటే కొత్త దారులు
తెరచుకుంటాయి

* * *

మనకోసం మనం రద్దైనపుడు
మనం నిలుచున్న చోటో
నడుస్తున్న పద్ధతో నచ్చనపుడు
ఒకే ఒక్క అడుగు అవతల
ఇంకో ప్రపంచం
ఉందని మరచిపోవద్దు
వేయి ఆలోచనలు చేయడానికి వెనకాడ వద్దు
మనిషికి
చావు ఉంటుందనే
ఒక చిన్న సత్యం అర్థమయ్యాకే
కదా సిద్ధార్థుడు బుద్ధుడయ్యింది
ప్రతి సత్యం మనల్ని
మరో ప్రపంచంలోకి నడిపించాలి

* * *

బొట్లు బొట్లుగానైనా
ప్రవహించడమే
చలనానికి సంకేతం
పూర్తిగా వదిలేయడం కాదు
కొద్ది కొద్దిగా
కలుపుకు నడవడమే జీవితం

* * *

తొలగించాల్సినవీ
పెకలించాల్సినవీ
ఖండించాల్సినవీ
నరకాల్సినవీ
అన్నీ అలానే వేళ్ళూనుకునే ఉన్నాయి
సమాజ శస్త్ర చికిత్సకు
నీ వంతుగా అందించాల్సిన
సూదో బల్లెమో
తాడో నిచ్చెనో
కత్తో గండ్రగొడ్డలో
ఇవ్వకుండా వెళ్ళిపోవడం భావ్యమేనా?

* * *

నీవు వెళ్ళిపోయినప్పుడల్లా
మనం ఉమ్మడిగా స్వప్నించిన
ఆ స్వప్నం మరింత ఆలస్యమవుతుంది
చేరాల్సిన గమ్యం
ఇంకొన్ని అడుగుల దూరంలో మిగిలిపోతోంది

* * *

మరచిపోవద్దు
మనమే సకల సంపదల సృష్టికర్తలం
మనమే భవిష్యత్తులోకి వికసించిన
వికసించాల్సిన
వికసిస్తున్న నూతన మానవులం
మనమే చరిత్ర నిర్మాతలం

* * *

నీకన్నీ తెలుసు కదా
నీకు నేను చెప్పడం ఏమిటీ అని అనుకుని
ఇవ్వాళ నేను ఆగిపోదలచుకోలేదు
ఈ క్షణాన నిన్ను పసిపాపలా
గుండెలకు ఒడిసిపట్టుకుని
ఆవలి గట్టుకు చేర్చడానికే
నిశ్చయించుకున్నాను

* * *

నువ్వు
నా ప్రియమైన రైతువో
కార్మికునివో
అక్కవో అన్నవో
చెల్లివో తమ్మునివో
స్నేహితుడివో
కామ్రేడ్‌వో
సహచరివో
పాపాయివో
నా తల్లివో
తండ్రివో
ఎవరైతేనేం
నీవు నన్ను వదిలిన క్షణమే
నాకు అత్యంత దుర్భరం
ఇన్నీ యాతనల మధ్య
ఇప్పుడు ఎటువంటి
శషభిషలు లేకుండా
ప్రకటిస్తున్నాను
నీవు
లేకుండా
నే
ను
ఊ
పి
రి
తీయలేనని..
నీ చిరునవ్వుల ఆశ్వాసనే
నా జీవన రహస్యమని

* * *

నీవు లేకుండా
నా ప్రయాణాన్ని
ఒక్కసారి ఊహించుకో..
ఒంటరితనం ఎంత యాతనో కదా ..
ప్రయాణం ఎంత కఠినమో కదా

# లాల్‌గుడ్డ గూడు..

## సు. దే. చె.

దండకారణ్య పొత్తిళ్ళలో
దండు నక్షత్ర వెలుగుల
తోవలో ముందుకు సాగుతుంది
అరణ్యాన వెన్నెలోదయం
వృథా కాదు
వేగుచుక్కల అమరత్వం
మరో పూర్ణోదయానికి శ్రీకారం
కానమ్మ కడుపులో
వెన్నెలమ్మ నీడలో
ప్రసూతి వేదన
పచ్చని చెట్ల నడుమ
పచ్చిబొడ్డు తాడు
వేలాడుతుంది
నిశ్శబ్దం చచ్చి..
శబ్దం పురుడోసుకుంది
అడవి పున్నమి
వ్యర్థం కాదు
నవమాసాల పేగు బంధం తెగి
కెవ్వుమన్న పోరగాడు
లాల్‌గుడ్డ గూడులో
హాయిగా నిదరోయాడు
అరణ్యంలో వెన్నెలోదయం
వృథా కాదు



# వెలుతురు నది

## అల్లం రాజయ్య

తెలంగాణ ఫాస్టు ప్యాసింజరు రైలు జనగామ స్టేషన్ దాటి కాజీపేట వైపు దూసుకపోతున్నది. ఎండాకాలం, పెండ్లిల్ల సీజన్ కావడంతో యమరద్దీగా ఉంది. సీట్ల మధ్య, దారిలో చాలా మంది నిలబడి ఉన్నారు. ఊపిరి సలుపని అంత రద్దీలో కూడా సమోసాలు, పండ్లు అమ్మేవాళ్ళు బోగీల్లో తిరుగుతున్నారు.

కొత్తగా తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడటం వలన, పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలు రావడం తోటి- రైలు పెట్టెలో మొగవాళ్ళు చాలామంది ఎన్నికల గురించి, రాజకీయ పార్టీల గురించి గరం గరంగా వాదించుకుంటున్నారు. షటిల్ రైలు గనుక బస్సులో లాగా సీట్లు ఇరుకిరుగా ఉన్నాయి. ఎవరెవరు, ఎవరెవరితో, ఏం మాట్లాడుతున్నారో తెలియకున్నది? ఆ రొదలోనే పళ్ళు అమ్మేవాళ్ళ అరుపులు- మొత్తంగా బోగీలో విచిత్రమైన స్వర సమ్మేళనం.

కిటికీ పక్కన కూర్చున్న యువతి ఒళ్లో నోటుబుక్కు, పుస్తకం మీద చేతులుంచుకొని వెనక్కి పరుగెత్తుతున్న బోడికొండలను, బీడుపొలాలను, సుదూరంగా కనిపించే ఆకాశాన్ని చూస్తున్నది.

ఆమె పక్క ఒదిగి మధ్యలో కూర్చున్న యువకుడు ఆమెతో మాట కలపాలని ఎప్పటినుండో అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. ఆ అబ్బాయికి మరోపక్క కూర్చున్న ఒక నడీడు షావుకారి అంతులేని నిద్రలో జోగుతున్నాడు.

"ఏం చదువుతున్నారు?" యువకుడు.

'జవాబు చెప్పాల్నా వద్దా' నిర్ణయించుకునేందుకు యువతి, యువకుని కేసి చూసింది. తీక్షణమైన మెరిసే కళ్ళు, మెరిసే శుభ్రమైన బట్టలు, 'పర్లేదు మాట్లాడచ్చు' నని మనసులో అనుకొని "బి. యే." అన్నది.

మాటలు పొడిగించడానికి అవకాశం దొరికినందుకు అతని ముఖంలో చిన్న వెలుగు.

"అందరు ఇంజనీరింగు, డాక్టర్ కోర్సులు చదివితే- మీరు బి. యే?"

"అందరి తీర్గనే నాకుంటదమ్మా- కాని కష్టపడి చదువొద్దు? చదివినా అది మన తలకెక్కద్దా! అసలే నాది మట్టిబుర్ర- అందులో బోలెడు చెత్త చెదారం"

"అసలు మీరు ఏం చదువాలనుకున్నరు?"

"నాకేడ గంత గనం తెలుసుగని? అయినా మా కులాలల్ల ఆడపిల్లలకు ఏ చదువు కావాలో ఎవరాలోచిస్తరు? పాపం మా డాడీకి నేను డాక్టరు కావాలని ఉండె"

"మరి. ."

"ఇంటర్‌లో బైపీసీ తీసుకున్నమనుకో మటాష్ గద"

"అదే! ఎందుకు?"

"నాలాంటి ఎక్స్‌ట్రాలకు అటు డాక్టరుకు సీటు రాదు, పోనీ పార్మసీ చేద్దామనుకున్న మళ్ళీ రూటుకు పోరాదు"

"సో ఆఖరుకు బి. యే. సెలక్టు చేసుకున్నారన్నమాట"

"అట్లయ్యింది- మా నాన్న నర్వస్. మా అమ్మ ఫుల్ ఖుష్"

"మీ అమ్మెందుకు కుష్?"

"మా నాన్న మా అమ్మకు తెలివి లేదంటడు. పాపం తనొక్కతే తెలివిలేనిదయితదని నేను జత కల్సిన"

"అట్లెందుకనుకుంటరు? బి. యే. అన్నిటికి రూటు. పైగా సొసైటి గురించి తెలుస్తుంది"

"అదే బోర్. నాకు రాజకీయాలంటే బోర్"

"ఔనా! ఎందుకంటరు?"

"ప్చ్! తెలియదు. ఎప్పుడు సీరియస్‌గ ఆలోచించలేదు. ఔను మీ బాయ్స్‌కు రాజకీయాలంటే ఇష్టమా?"

"ఇష్టమే! అయితే మీరు ఓటు ఏ పార్టీకి వేస్తరు?"

"ఓటంటే.. చూడాలి. మీరు?"

"ఎలక్షన్ల పోటీ చేస్తున్న అన్ని రాజకీయ పార్టీలు దొరలవే. పూటకోమాట. తెలంగాణ ప్రజలు కొట్లాడ్తరు. పానాలు దీసుకుంటరు. ప్రతిసారి ఫలితం దొరలనుభవిస్తరు. అందుకే నేను ఓటు వెయ్యను"

"మీరు సీరియస్సున్నట్టున్నది గదా?"

"సీరియస్సా పాడా! పోనీ మీరు దేని గురించి ఆలోచిస్తరు?"

"అమ్మాయిలకు లక్ష సమస్యలుంటయమ్మా?"

"మీకు బోర్ కొట్టిస్తున్ననా?"

"పర్వలేదు మాట్లాడు"

"సరే! తెలంగాణ కోసం విద్యార్థులు ఉద్యమాలు చేసిండ్లు- కాలేజీలు బందయినయ్. చాలామంది తెలంగాణ కోసం చనిపోయిండ్లు గదా!"

"ఔను పాపం ఆత్మహత్యలు చేసుకున్నరు. మన తెలంగాణ మనకు గావాలె. వచ్చింది ఇష్టమే"

"టాపిక్ మారుద్దాం. బి. యే. తరువాత?"

"ఎంబియే చేద్దామనుకుంటున్న"

"ఎందుకు?"

"ఎందుకంటే మేనేజుమెంటు స్కిల్స్ వస్తయి. దేన్నయినా ఎదుర్కోవచ్చు- అంటే టోటల్‌గా ఒక లైను ఏర్పడుతది"

"మంచి ఆలోచనే- కాని అట్ల చెయ్యాలంటే సమాజం గురించి తెలువాలె"

"ఔను సమాజమే. సమాజంలో ఎట్లనైతె తెలంగాణల మనమున్నమో. మనకో కులమున్నది. ఆ కులాన్ని బట్టే సమాజంలో మన స్థానం నిర్ణయమైంది"

"ఔనా! ఇదంత ఎంబియేలో ఉంటుందా?"

"నాకేడ తెలుస్తది. బి. యే. ల ఏమన్న ఉన్నదా?"

"లేదు"

"అయితే ఈ పుస్తకం చదవండి." అత్యుత్సాహంతో ఆ యువకుడు తన బ్యాగులో నుండి 'సామాజిక కోణం' అనే పుస్తకం తీసి ఇచ్చిండు.

యువతి మొహమాటానికి పుస్తకం తీసుకొని పేజీలు తిరుగేసింది. ఇంతలోనే కాజీపేట స్టేషన్ వచ్చింది. యువకుడు రైలు కిందికి దిగిండు. మరింతమంది రైలు పెట్టెలోకి తోసుకు వచ్చారు. ఆ గడబిడలో యువకుడు రైలెక్కేసరికి అతని స్థలంలో మరో యువతి కూర్చున్నది.

మొదటి యువతి ఏదో చెప్పగ్గా- రెండో యువతి సీట్లో నుండి లేవడానికి సిద్ధపడ్డది.

"పర్వాలేదు కూర్చోండ్లి- నేను నిలబడతాను" యువకుడు సీటుపక్క దారిలో నిలుచున్నాడు.

రెండో యువతి కొంచెం ఇబ్బంది పడుతూనే కూర్చున్నది. రైలు కదిలింది. రైలు పెట్టెలో మళ్ళీ రొద మొదలయ్యింది. రకరకాల మనుషులు మాటలన్నీ ఇప్పుడే గుర్తొచ్చినట్టు అనేక స్వరాలలో మాట్లాడుతున్నారు. నేపథ్య సంగీతంలాగా రైలు పట్టాల చప్పుడు. మధ్య మధ్య చాయ్, పండ్లు, సమోసాలు అమ్మేవాళ్ళ కేకలు. ఎవరిగోల వాళ్ళదే.

"ఏదో పుస్తకం చదువుతున్నవ్?" రెండో యువతి.

"సామాజిక కోణం" మొదటి అమ్మాయి.

"ఔనా! నాకు సోషలంటే బోర్"

"నాకు అంతే! నీకు సీటిచ్చిన అబ్బాయి నాకు ఈ బుక్ ఇచ్చిండు. పాపం మంచోని తీరున్నడు"

"ఔనా!"

ఇంతలోనే మొదటి యువతి మిత్రుడు వెతుక్కుంటూ ఆ బోగీలోకి వచ్చిండు.

"నేనెంత వర్రి అయిననో తెలుసా! ట్రేన్ ఫుల్ ప్యాక్. నిలబడేందుకే చోటు లేదు. నువ్వు లక్కీ!"

"అంతే మరి. అమ్మాయిలు ఆల్వేజ్ లక్కీ- అబ్బాయిలు నిలబడి సీటిస్తరు తెలుసా?"

"అందరు బకరలుండరమ్మ- అబ్బో అదేం బుక్కు"

"సామాజిక కోణం"

"అంటే?"

"నాకేం తెలుసు అబ్బాయిలకు తెలువాలె"

"పాపం నీకు పుస్తకమిచ్చిన అబ్బాయి ముకం చూడవే!"

"కొందరంతే పవన్ కళ్యాణ్ తీర్గ ఏదో మార్చాలని ఆరాటం!"

"పవన్ నటుడు. ఇతను అట్ల లేడు"

"ఔను అది నిజమే"

ఇంతలోనే జమ్మికుంట స్టేషన్ వచ్చింది. తోపులాట మధ్య మొదటి అమ్మాయి దిగిపోయింది. పోతూ పోతూ 'సామాజికకోణం' రెండవ అమ్మాయికి ఇచ్చి పోయింది. ఆమె ఫ్రెండు ఆమెతో పాటె దిగిపోయాడు. రెండవ అమ్మాయి తనకు సీటిచ్చి నిలబడిన యువకున్ని పిలిచింది. అతను వచ్చి మధ్యలో అమ్మాయి పక్క కూర్చున్నాడు. రెండవ అమ్మాయి కిటికీ పక్క సీట్లోకి జరిగింది.

"నాకోసం ఇంతసేపు నిలబడ్డరు"

"ఇట్స్ ఓకే. పైగా మీరు కొంచెం నీర్సంగా కూడా కన్పించారు"

"కాదు అమ్మాయినని ఫేవరు చేసిండ్లు కదూ!"

"అట్లా అడుగుతే చెప్పడం కొంచెం కష్టమే!"

"నిజం కదా!"

"ఆ పిల్ల ఇచ్చిందీ పుస్తకం. నీకు సోషల్ అంటె ఇష్టమా?"

"మీకు"

"అస్సలు ఇష్టముండదు"

"ఔనా మీరేం చేస్తుంటరు?"

"మీరు కాదు నేను, నేను కాకతీయ యూనివర్సిటీలో పి. జి. చేస్తున్న"

"ఔనా! ప్రాపరెక్కడ? సెలవులకు ఇంటికి వస్తున్నవా?"

"మందమర్రి మార్కెట్ ఏరియా- రోజు అప్ అండ్ డౌను చేస్తున్న"

"అబ్బో! కష్టం కదా!"

"మా పిన్ని హన్మకొండలుంటది. అప్పుడప్పుడు పోత. అయినా రోజు ఇంటికి రావాలన్పిస్తది"

"అమ్మ కూచీనా.."

"కాదు- అదంతె గని ఫ్రీగా కూర్చో- నువ్వే చేస్తున్నవ్?"

"ఉస్మానియాలో పి. హెచ్. డి. చేస్తున్న"

"అబ్బో! పి. హెచ్. డి. అంటే- డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ కదా. నీకు మనుషుల గురించి బాగా తెలుసు. ఏది మాట్లాడుతె అవతలి వాళ్ళకు బాధ కలుగుతదని కూడా తెలుసు"

"ఏమో తెలవదిగని కంచె ఐలయ్య పుస్తకాలు చదువుత"

"ఆయనెవలు?"

"మా యూనివర్సిటీలో ప్రొఫెసర్. రిటరయ్యిండు. దళితులు, బహుజనులు ఈ సమాజాన్ని నిర్మించిన ఇంజెనీర్లు. అట్లాంటి దాన్ని ఆక్రమించుకున్న వాళ్ళు అగ్ర కులాలు అంటాడు"

"ఔనా! నిజం చెప్పాలంటే నాకు అర్థం కాలేదు"

"మీదే కులం?"

"ఔను గుర్తొచ్చింది. ఇందాక నాకు పుస్తకమిచ్చి దిగిపోయిన అమ్మాయి కులమడిగిన- మాదిగ"

"ఔనా! నాకన్న మీరే పాస్టున్నరు గద"

"నా పేరు స్రవంతి. మాది యాదవ కులం. మీ పేరు?"

"అంటే! నా పేరు రాజు. పద్మశాలి"

"స్రవంతి అంటే ప్రవాహం"

"పేరు చాలా బాగున్నది. ఒక్కొక్క సారి పేరు తీర్గనే ఉంటరు మనుషులు"

"లడ లడ వాగుతున్ననా? మరి కంచె అయిలయ్యంటె?"

"అబ్బో! నీతో మాట్లాడటం కష్టమే!"

"తను అదే అంటడు"

"మీకు పెళ్ళైందా?"

"ఆఁ- నాలుగు నెల్లయ్యింది. తను బెంగళూరులో ఎలక్ట్రికల్

ఇంజనీరు. నేను ఎక్కువ మాట్లాడ్తనంటడు. తనేమో అతి తక్కువ మాట్లాడ్తడు. మీ తీర్గనే రాజకీయాలంటే చచ్చేంత ఇష్టం. అంత దూరం నుండి అంత కష్టపడి వస్తడా? ప్చ్. ఎంతసేపు టీవీ ముందు కూసుండి వార్తలు చూస్తడు"

"నువ్వు వార్తలు సూడవా!"

"అయిదు నిమిషాలు వార్తలు చూస్తే పిచ్చుక్కుతది. టోటల్‌గ అబద్దాలు. మా డాడికి వార్తలు గావాలె. ఇంతకాలం తెలంగాణ-తెలంగాణ మారుమోగిపోయింది. మా మమ్మికి సీరియల్స్ గావాలె-తమ్మునికి కొత్త సాంగ్సు కావాలె- టీవీని చూస్తే భూతం గుర్తొస్తుంది. టీవీలు లేని కాడికి పారిపోతే బావుండు. ఇంతకూ- ఎక్కువ మాట్లాడటం మంచిదా? కాదా?"

"చిల్లర పైసలకు అల్లరి ఎక్కువంటరు"

"అంటే నేను చిల్లర అని కదా? మీరేమన్నా అనుకోండి! నోట్లె నాలిక ఎందుకున్నది? మాట్లాడేటందుకే గదా? మాట్లాడితేనే గదా ఏదైనా తెలిసేది"

"పుస్తకాలు చదివితే తెలుస్తది"

"పుస్తకాలు చదువుతే ఏం తెలుస్తది?ఎందుకు చదువాలె?"

"మనం మన కులం గురించి తెలుసుకోవాలె. సమాజం గురించి తెలుసుకోవాలి"

"పుస్తకాలు చదివితేనే మన కులం తెలుస్తదా? లేకపోతే తెలువదా?"

"తెలుస్తదనుకో విద్య ద్వారా వికాసం- వికాసం ద్వారా సంపద-సంపద ద్వారా సామజిక హోదా!"

"నాకు సోషల్ అర్థం కాదు"

"నువ్వు ఇప్పటిదాకా మాట్లాడినదంతా సోషలే కదా?"

"కొట్టిండ్లు దెబ్బ. ఇంతకూ బాగా మాట్లాడమే మంచిది అంట. నువ్వు ఒప్పుకుంటవ"

"మౌనం కూడా ఒక భాషేనేమొ?"

"తను అదే అంటడు. అయినా మాట్లాడటం నా కలవాటు. నేనొప్పుకోను"

"ఇంతకూ మీ మ్యారేజి అరేంజుడా, లవ్వా"

"సగం లవ్వు, సగం అరేంజుడు"

"అదెట్ల?"

"మా చుట్టాలే. ఎప్పుడో నన్ను చూసిండట. వన్నియరు నుండి లవ్వు చేస్తున్నడట. మధ్యవర్తుల ద్వారా తనే ప్రపోజు చేసిండు. నేను సరెనన్న. పెళ్ళికి ముందు చెప్పిండు. వన్‌సైడు లవ్వు"

"నీకు లవ్వంటే ఇష్టంలేదా?"

"చెప్పలేను. నాకు కరక్టుగ తెలువదు. అబ్బాయిలు లవ్ చేస్తున్నమని ఉత్తగ అంటరు. అమ్మాయిలకు అబద్దాలు చెప్పుతరు. నేను నిజమే చెప్పడానికి ఇష్టపడుత. అది సరే నీకు పెళ్ళైందా?"

"లే. మా చెల్లె కయినంక చేసుకుంట"

"అదే మంచిది. నీది నువ్వు చూసుకునే రకం కాదు. పట్టింపు ఉన్నోనివే. మీ చెల్లెకు ఎంత వయస్సు"

"ఇరువై అయిదు"

"ఆగకుండ చెయ్యాలె. ఏడనన్న పిలగాన్ని ఎదుకుతండ్లా?"

"మా మేనమామే ఉన్నడు"

"మామ వరుస చేసుకుంటర? ఏం చేస్తండు?"

"పైనాన్సు పెట్టుకున్నడు"

"పార్టనర్సా! పార్టనర్స్ అయితే గోవిందా"

"అట్లేం కాదు. పార్టనర్ డీడ్ ఉంటది. పర్వాలేదు బాగ నడుస్తున్నది"

"పైసల మనిషె. కట్నమెంత?"

"మేము ముగ్గురన్నదమ్ములం. ఒక్కతే చెల్లె. నాకు అయిడియా లేదు కాని ఇరువై లక్షలిస్తరేమొ"

"మీరు కట్నం తీసుకుంటరా?"

"లేదు"

"నీకు రాబోయే పిల్ల అదృష్టవంతురాలు. ఒక్కొక్కసారి పెళ్ళికి ముందు మొగోళ్ళు అట్ల కూడా డామినేషన్ చేస్తరు. పెళ్ళైనంక మల్ల కట్నం తీసుకుంటరు"

"నువ్వు సూటిగ మాట్లాడి మొత్తానికి నన్నెప్పుడో పడేసినవ్"

"లేదు, లేదు- నువ్వు మొగోల్లల్ల మంచోనివి"

"ఎట్ల తెలుస్తది?"

"పుస్తకాలు చదువుతె"

"నాకే కొట్టిండ్లు దెబ్బ. చదువనన్నరు గాద"

"పోనియ్యి. నాకు ముఖాలు చదివే అలవాటున్నది"

"ఉత్త గ్యాస్. అగో, అక్కడ డోరు దగ్గర కూచున్న భార్యాభర్తల గురించి చెప్పు"

"చెప్పుమంటవ. ఆమె అట్టకట్ట ఉన్నది గాని నా తీర్గనే బోలా బాలా! కుటుంబం కోసం గొడ్డులాగా కష్టపడుతది. ఆమె మొగుడు ఆమె పక్కన లేకపోతే రూపాయికి గొరగాడు. డైరక్షనంత ఆమెదే. అయినా అది ఒప్పుకోడు. ఆమెను గెలవడానికి తాగుతడు.. మన పక్కన కూచుని లేచిపోయిన షావుకారికి డబ్బు తప్ప మిగతా అంత ఫాల్తు. ఇప్పుడు నీ పక్క కూచున్న పిలగానికి ఫోను, పాటల పిచ్చి. అదో తాగుడులా నశా! అంతకు ముందే లావటామె భర్త పక్క సీటతనితో కొట్లాడిండు.

ఆ గొడువకు ముక్తాయింపుగా అతని భార్య "ఫాల్తు మనిషి-మాది వికారాబాదు దగ్గర, సానా దినాల కింద పొట్ట గడువక మరాతా దేశం పోయినం. పని చేసుకు బతుకుతం. ఆడ గిదే ఉల్సెకొక్కు సాప తీర్గ ఎగ్సుడు. మా తమ్ముడు మంచి ఇకుమతున్న మనిషి. మా తీర్గ దేశాలు బట్టుక తిరుగక, వికారబాదులనే మంచిగ బతుకుతండు"

"మీ తమ్ముని జోలి తీత్తె తంత"

"ఏహె సప్పుడు సెయ్యకు" గద్దించింది.

మొగనికి ఆ క్లిష్ట పరిస్థితిలో- అంతమంది ముందు పెండ్లాన్ని ఉరుకుతున్న రైల్లో ఏం చేయాలో తెలియలేదు. పండ్లు కొరుకుతూ ఎవరి ముఖం చూడకుండ కూర్చున్నాడు.

ఆమె సమోసాలు కొని నములుతోంది. దేన్నయినా ఎదుర్కొనే ధీమా ఆమె ముకంలో, రాటుదేలిన శరీరంలో.

"అదే సామాజిక దృష్టి కోణం అంటే" రాజు.

"ఔనా! ఈ పుస్తకంలో ఇవన్నీ ఉంటయా?"

'ఉంటాయని' గట్టిగా చెప్పలేకపోయాడు.

"ఇంతకన్నా ఎక్కువే రాసుంటరులే. పి. హెచ్. డి. చేసే వాళ్లకు ఇట్లాంటివి బోలెడన్ని తెలుస్తయిగదా!" ఈసారి ప్రవంతి మనస్ఫూర్తిగా అంది.

అతనేం మాట్లాడలేదు. ఆదరువు లేని, దారి దరువులేని చదువులు గుర్తొచ్చాయి. పెద్దపల్లి స్టేషన్ వచ్చింది. పెద్ద పెద్ద గ్రానైటు రాళ్ళు లోడింగు యార్డులో పడి ఉన్నాయి. ఖాళీ వ్యాగన్లు లోడింగుకు సిద్ధంగా ఉన్నాయి. ఎక్కేవాళ్ళు, దిగేవాళ్ళు మాటల రొద. మళ్ళీ సర్దుకొని రైలు వేగం అందుకున్నది. అందరిలో ఏదో కదులుతోంది.

"మీకు ఇరువైఏడేళ్ళ వయస్సుంటదా? అటెన్క పిల్ల దొర్కది. జెప్పన పెండ్లి చేస్కోండ్లి. ఇరువైఅయిదు సంవత్సరాల ఆడపిల్లలు పెండ్లి లేకుంట చాలా తక్కువుంటరు. నాకు ఇరువై అయిదు, ఆయనకు ఇరువైఏడు. నిన్ను చేసుకునే పిల్ల అదృష్టవంతురాలు"

"అర్థం కాలేదు"

"అర్థం కాకపోవడానికేమున్నది? నేను మనస్ఫూర్తిగనే అన్న"

"మాటలకు సప్త స్వరాలుంటాయని, అవి ఆకాశమంత మార్మికంగా ఉంటాయని.. పోనీయ్. నీ గురించి చెప్పు.. పెండ్లయినంక ఈ చదువు .. బెంగుళూర్లో తను. . అత్తగారింటికి పోతవా?"

"నువ్వు కవివా? ఇంకా పోలే. బెంగళూరుకు పోతే, నేను మందిల నడువలేక మందితో నడువలేక పడిపోయిన. ప్రతి ఓటమిని కడుపుల పెట్టుకున్న. నా పుట్టిన ఊరు మందమర్రిని- అమ్మ, నాన్నను ఒదిలిపెట్టి పోవాలంటే ఒక్కసారిగా ఆ ట్రాన్స్‌లోకి పోలేకపోతున్న. పెద్దయినందుకు దిగులు. పెండ్లెందుకు చేసుకున్ననే దిగులు. అండర్ గ్రౌండ్ బొగ్గు బాయిలు పోయి, ఓపెన్‌కాస్టు లయినందుకు దిగులు. వాగు, వంక, చెట్టు-పుట్ట, ఊళ్ళు సర్వం మింగుతున్న ఓపెన్‌కాస్టులు ఎందుకాపరో దిగులు. ఆ లావటామె- ఆమె భర్తల మధ్య కిరికిరికి దిగులు. నా దిగుల్లు వింటే బట్టలు చింపుకుంటవ్"

"అట్లంటవేంది? ఎప్పటికైనా భర్త దగ్గరికి పోవాలెగద?"

"కదా! అదే నా సమస్య. భార్య మాత్రమే భర్త ఇంటికి ఎందుకు పోవాలె? భర్తే భార్య దగ్గరికి రావచ్చు గదా! మొగవాళ్ళకు ఈ రంధి ఎప్పటికీ సత్తె తెలువది"

"నిజమే! ఆలోచించలేదు. మీ దిగుల్లు నాకెందుకు లేవు. నేను ఔట్‌సైడర్‌నా".

"నువ్వేం చేస్తవు? ఒకటి భూమి, రెండు ఆకాశం, ఎక్కడ కలుస్తయి. ఆడమగ అంటే రెండు వేరువేరు లోకాలు. నా ఆరోగ్యం బావుంటలేదు. నీర్సం. ఏ పని చెయ్యబుద్ధి కాదు. పిచ్చి పిచ్చి ఆలోచనలు. ఈ చదువు, ఈ రైలు ప్రయాణం, లేపోతే పిచ్చిదాన్నైపోదును. క్లియరుగ చెప్తొస్తలేదు. మాకు తెలిసిన డాక్టరున్నడు. వారానికి మూడుసార్లు నాకు సెలైన్ పెడుతడు. రక్తం తక్కువున్నదంటడు. పదకొండు పర్సంటేజు పైన ఉండాలట. ఏడున్నదట"

"ఔనా! మంచి ఆహారం తీసుకోవాలె. ఆచరణ లేని ఆలోచనలు మనిషిని పిల్చి పిప్పి చేస్తాయంటాడు మా గురువుగారు"

"ఇన్ని రంధులున్న మాకు సమాజం గురించి ఎట్ల, ఎప్పుడు తెలుస్తది? నా మెదడు చీకటిగది. విద్య వచ్చింది గాని వికాసం గాలేదు. హోదా అంటారా? ఎంతపెద్ద పదవిలో ఉన్నా ప్రపంచంలో ఆడదానికి హోదా ఎప్పుడు రావాలె? ఆడవాళ్ళకు ఆచరణ లేకపోతే, ఈ ప్రపంచం కుప్ప కూలదా? మొగాళ్ళు తాగుబోతులై, పిల్లలు బిచ్చమెత్తుకోరా?"

"నువ్విట్ల ఇంకాసేపు మాట్లాడితే, నా పి.హెచ్.డి టాపిక్ దండుగనిపిస్తంది. చూస్తే నేనే ఇంకా చీకట్లో ఉన్నాననిపిస్తోంది"

వాళ్ళిద్దరి పక్కన కూర్చున్న పిల్లగాడు ఒక నిమిషం ఇయర్‌బడ్స్ చెవుల్లో నుండి తీసి "ఈ చీకటేందో?" అర్థంగాక మళ్ళీ చెవుల్లో పెట్టుకున్నాడు.

"అట్లనకు. పి. హెచ్. డి, పి. హెచ్. డి. యే. మీరు మనుషుల గురించి సమాజం గురించి పరిశోధిస్తరు. కారణాలు తెలుసుకుంటరు. మాదేమో మాయిగాని సవాలక్ష భీతిగొలిపే వెంటాడే పనులు. అడుగడుగున మమ్ముల్ని మేము దాచుకోలేక, దాక్కోను చోటులేక, ఇంతగా పెరిగిపోయిన ప్రపంచంలో మాకంటూ ఏదీ లేక, వద్దు రాజా.."

"దళితులు, బహుజనుల స్థితిగతులు, చరిత్ర గురించి పూలే, అంబేద్కర్ ఎంతో కొంత చెప్పిండ్లు. కాని మహిళల చరిత్ర ఉందా? లేదా? ఉందేమో తనకు తెలియదేమో" రాజు లోలోపల చీకటి వెలుగులు. ఈత చెట్ల మీదుగా ఎటో చూసిండు. రైలు పెద్దంపేటలో ఒక నిముషం ఆగింది. ఎవరూ దిగలేదు. మరెవరూ ఎక్కని స్టేషన్‌లో దిగాలుగా లైట్లు వెలుగుతున్నాయి.

"నువ్వు మంచిర్యాలలో ధిగిపోతవా?"

"ఔను"

"నీకో విషయం చెప్పాలి. నాకు నెల తప్పింది".

"ఔనా! నువ్వు చెప్పేదాక నీకు పెళ్ళైనట్లే తెలువలే"

"అదేగదా! సిన్మాలల్లో, టీవీలల్ల ఆడవాళ్ళు ధగధగ మెరిసిపోతూ కన్పిస్తరు. ఎవరో కవి చెప్పినట్టు పిల్లంగొయ్యకు నిలువెల్ల గాయాలే. నెత్తురు కారే శరీరం మాది. ఎప్పటికీ ఆడది మొగోనికి తెలువది"

"నాకు ఇప్పటికే దిగిపోయింది. నా పరిశోధన కకావికలైంది. మెదడు ఖరాబయ్యింది. మా అమ్మ గురించి, మా చెల్లె గురించి నాకేమీ తెలువదని అర్థమయ్యింది. పోనీ! ఈ సంగతి మీ ఆయనకు చెప్పినవా?"

"చెప్పను"

"అదే ఎందుకు?"

"నాకు, మీ అమ్మకు, నీకు తప్ప మరెవ్వరికి తెలువదు"

"నాకెందుకు చెప్పినవు తల్లీ"

"అదేగదా! లోపల కిక్కిరిసి పోయిన దిగుల్లు జాగా సరిపోక అట్ల బయటపడుతయి. ఇంకో అయిదు నిముషాల్లో నువ్వు దిగిపోతవు. ఇంత ఓపెన్‌గ ఫ్రెండ్లీగ భర్తతో మాట్లాడగలమా? మాట్లాడనిస్తరా? నువ్వంటే 'బకరా' తీర్గ అన్నీ విని వాస్తవాల్ని ఒప్పుకున్నవ్. వాస్తవాల్ని భర్తలు ఒప్పుకోరు. అందుకే భార్యలు భర్తలకు అజ్ఞాతంగా బతుకుతరు"

రైలు గోదావరి బ్రిడ్జి మీద ధనధన లాడుతూ పరుగెత్తుతోంది. మూడో వంతెన నిర్మాణ పనులు నదిలో లైట్ల వెలుతురులో ముమ్మరంగా నడుస్తున్నాయి. రైలు బ్రిడ్జి దాటింది.

"మాట్లాడు రాజు"

"ఈ గోదావరి సముద్రంల ఎక్కడ కలుస్తదా అని ఆలోచిస్తున్న"

"ఈ ప్రవంతికి ఎక్కడి కక్కడ కట్టలు కడుతండ్లు గద. పోలవరంల మూడు లక్షల ఆదివాసుల ఊళ్ళు మునిగిపోతయని వెల్లగొడతరట గద, ఆగమైతరట గద. ఇదేంది తల్లి నుంచి పిల్లను వేరు చేయడం గద?" పక్కాయన న్యూజు పేపరు చదువుతంటె విన్న ఈ మాట నా చీకటి గదిలో కలిసిపోయింది. నా దుంపతెంచే కలలు. సరెగని, ఔను గోదావరి సముద్రంలనే ఎందుకు కలువాలె. సముద్రమే గోదావరిని వెతుక్కుంట రాకూడదా?"

"తల్లి వస్తే ప్రళయం. మొత్తం మునిగి ముతమాయమైపోతది. నాకింక పెండ్లి కాలె. బహుశా బతికుంటె బలుసాకు తిన్నట్లు, ఈ షాక్‌లు పనిచెయ్యకపోతే పెండ్లి, లేపోతే ఏమైపోతనో తెలువది. అయిలయ్య తీర్గ సుక్కల్ సూపిచ్చినవ్. పుసుక్కున 'చిల్లర' అన్న ఒక్కమాట.. నా దిమ్మ తిరిగేటట్లు"

"కోతలు కొయ్యకు రాజా. నీకు మనుషులతో కల్మషం లేకుంట కలువాలని ఉంది. ఈ రైలు డబ్బాలో నాతో సహా ఎవరి సోది వాళ్ళు చెప్పుకున్నరు. నువ్వొక్కడివే నా సోది విన్నవ్. సరే! ఈ నెలలో నాదగ్గరికి వత్తె తనకు చెప్పుత. తనెప్పుడు సర్‌ప్రైజు గిప్టని ఎలక్ట్రానిక్ వస్తువులు తెస్తడు. అతను నీలాగా మంచోడె. కాని ఆ వస్తువులు తెచ్చినపుడు అతని ముఖంలో ఆ ఫీలింగు.. ఇతను అంత దూరం బెంగుళూరు నుండి నాకోసం వచ్చిండా? లేదా ఆ ప్రాణంలేని పిచ్చి వస్తువులు ఇచ్చి నా మీద డామినేషన్ చేయడానికి వచ్చిండా? అన్పిస్తుంది. నాకు సోషల్ అర్థం కాదు"

"ఇంకేం సోషల్ నా బొంద సోషల్. ప్రేమమ్మా ప్రేమ.."

"నేను ఈ భూ ప్రపంచంలో ఎవరు ఎవరికివ్వని అద్భుతమైన ఒక ఆత్మీయమైన సర్‌ప్రైజు గిప్టు అతనికి ఇస్తున్నానని చెప్పుతాను. రాజా! నువ్వే చెప్పు ఆడవాళ్ళు ఈ ప్రపంచంలో ఎవరు ఇవ్వజాలని అపురూప కానుకలు- కానుకలు కాదేమో. ఊపిరి.. ఓహ్- భాష కూడా లేదు. తమ సమస్తం మీకు, ఈ ప్రపంచానికి ఇస్తున్నరా లేదా? మొగవాళ్ళెప్పుడు తెలుసుకుంటరో?"

"ప్రవంతీ నాకు అబద్ధం చెప్పాలని లేదు. నిన్నిప్పుడు ముద్దు పెట్టుకోవాలన్పిస్తోంది" రాజు కళ్ళనిండ నీళ్ళు నిండగా.

"మా కండ్లల్లో నీళ్ళింకిపోయినయ్. నా ఫీలింగు అర్థం చేసుకున్నందుకు థాంక్యూ రాజా! కాని రాజా అదే గదా! శరీరంతో తప్ప మగవాళ్ళకు చెప్పరాదు. అది కూడా ఉత్త శరీరపు మొరటు భాష. ఈ రెండు గంటల కాలంలో నా అదృష్టమో, దుస్థితో నువ్వు, నేను అంతకన్నా ఎక్కువగా సన్నిహితులయ్యాము కదా! నాకు నువ్వు జీవితకాలం గుర్తుంటావు. అంతకన్నా ముద్దు గొప్పదా? చాలా చాలా ఎమోషనల్ ఫీలింగే నీది కాదనను. కాని దాన్ని తీసుకొని అనుభవించే స్థితి కాదు నాది" ప్రవంతి కంఠస్వరంలా రైలు నెమ్మదిగా మంచిర్యాల స్టేషన్లో ఆగింది.

మాటలన్నీ ఘనీభవించి, రాజు లేచి నిలబడి నెమ్మదిగా డోరు కేసి నడిచాడు. ప్రవంతి ఇబ్బంది పడగలదని రాజు కేసి చూడలేదు. నిజాలు మాట్లాడటం, వినడం ఎంత కష్టమో, నొప్పో మొదటిసారిగా ప్రవంతికి, రాజుకు అనుభవంలోకి వచ్చింది.

ప్రవంతిని చూసే ధైర్యం లేక రైలు దిగి, తలవంచుకొని రాజు మందిలో క్రీనీడలో కలిసిపోయాడు.

ప్రవంతి కూడా రాజు కోసం వెతకలేదు. యుగయుగాలుగా పేరుకుపోయిన గట్టిపడిన గుండె దిటవది. అయినా ఆమె కళ్ళల్లో అనుకోకుండా నీళ్ళూరినయ్. ఆ కన్నీటి ఉద్విగ్న మౌన భాష సృష్టి ప్రతిసృష్టిలో రాటుదేలిన మహిళలకు మాత్రమే తెలుసు. ఒక్క దేహం మాత్రమే పంచుకోవడానికి అలవాటుపడిన పురుషుడికి ఈ భాష ఎన్నటికీ అర్థం కాదు. తన కడుపులో రూపు దిద్దుకుంటున్న శిశువులాగా.

వెలుతురులో నుండి రైలు చీకట్లోకి దూసుకుపోతోంది. విచిత్రంగా, వేగంగా వెనక్కిపోయే ఎత్తైన నాగరిక హైటెక్ సిటీ భవనాలు, దుమ్ము చిమ్మే సిమెంటు ఫ్యాక్టరీ గొట్టాలు, ధ్వనించేక మాటలు, శబ్దాలు, ఆమె ఒళ్ళో రాజు ఇచ్చిన పుస్తకం "సామాజిక కోణం".



(6వ పేజీ తరువాత.. )

చెరబట్టి భ్రష్టుపట్టించింది. పాత రోజుల్లో దేశమాతను దుర్గాదేవిగా కొలిచిన వాళ్లలో వలస పాలన వల్ల దేశంపట్ల అలౌకిక భక్తి ఉండేది. అందులో స్వేచ్ఛ పట్ల అనురక్తి ఉండేది. భక్తి అనేది ఎంత మౌఢ్యమైనా ఇలాంటి ఆలోచనలు జాతీయోద్యమాన్ని నడిపించిన వాళ్లలో ఉండేవి. కానీ జాతీయోద్యమానికి దూరంగా ఉండిపోయిన సంఘపరివార్ తన హిందుత్వ ఎజెండాకు ఉద్వేగపూరిత భావనగా, చిత్రంగా భారత మాతను మార్చేసుకున్నది. ఇవాళ కాశ్మీర్ ప్రజల స్వాతంత్ర్యాన్ని కాలరాయడానికి, ముస్లింలనగా టెర్రరిస్టులని ప్రచారం చేయడానికి, వాళ్ల నుంచి దేశాన్ని కాపాడుకోవాలనే సాకుతో హిందూ జాతీయవాదాన్ని ఫాసిజంగా రెచ్చగొట్టడానికి తప్ప భారతమాత భావన ఇంకెందుకూ పనికి రావడం లేదు. ఈ మాటలన్నీ హిందుత్వ శక్తులుగా ముద్ర వేయించుకోని వాళ్లు కూడా చొక్కాలు చించుకొని రోడ్ల మీదికి రావడంలోనే సంఘపరివార్ బలం ఉంది.

అందువల్ల భారతమాతకు జైకొట్టాలని రాజ్యాంగంలో ఉన్నదా లేదా? అనేది శుష్క చర్చగా మారిపోతుంది. ఆ స్థాయిలో ఈ చర్చ తేలేది కాదు. భారత దేశం, ప్రజలు, వాళ్ల సార్వభౌమాధికారం, సెక్యులరిజం అనే ఆదర్శాలు అయితే రాజ్యాంగంలో ఉన్నాయి కదా. వాటిని నాశనం చేస్తున్న పాలకవర్గాలు భారతమాత అని ఊరేగడం అసంబద్ధంగా, అసహ్యంగా ఉంటుంది. ఈ చారిత్రక, రాజకీయార్థిక విషయాలు తెలియక, లేదా తెలిసీ.. సాధారణ ప్రజల్లో ఎవరైనా భారత మాత అనే మాటను సెంటిమెంట్‌గా, ఉద్వేగంగా గౌరవిస్తుంటే వాళ్లను గాయపరచనవసరం లేదు. అయితే సమస్య సెంటిమెంట్ మాత్రమే కాదు. (ఒకప్పటి వలస పాలన అనే చారిత్రక వాస్తవం వల్ల ఇప్పటికీ అదీ ఉండొచ్చు) రాజకీయార్థిక విషయాలతో సంబంధం లేకుండా చర్చించుకుంటే వల్ల దేశమంటే ప్రజలు అనే వాస్తవం విస్మరించి 'మాత' అని గాల్లో మాట్లాడుకున్నట్లవుతుంది.



# విప్లవ రహదారిలో..

**ఉదయ్‌కిరణ్**

అవి శీతాకాలం రోజులు. సాయంత్రం చలి వణుకుకు మంటలు పెట్టుకొని చలి కాగుతున్నారు కొంత మంది. కూలి పనులకు పోయినోల్లు అపుడే కూర బువ్వలు వండుకుంటున్నారు. గొడ్లు, బర్లు చలికి శరీరాన్ని ఒక దగ్గరికి తెచ్చుకొని చలి తెలువనట్టుగా నెమరువేసుకుంటున్నాయి.

అడవికి రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్న కుగ్రామం "లక్ష్మిబండ". ఈ ఊరికి ఉత్తరం దిశలో పచ్చని పంట పొలాలు. ఈ పొలాలను అనుకొనే రెండు వాగులు తూరుపు దిశలో ఒక కుంట. సూర్యుడు ఉదయించే సమయంలో ఆ చెరువులోని నీళ్ళు బంగారు వర్ణంలా మెరుస్తూ ఆహ్లాదంగా కనిపిస్తాయి. దక్షిణ దిశలో రెండు కిలోమీటర్ల దూరంలో దట్టమైన పచ్చని అడవి. పశ్చిమాన తేనెలాంటి నీటితో ప్రవహించే సెలయేరు. ఇన్ని రకాల ప్రకృతి వనరులతో ఆహ్లాదకర వాతావరణంలో ఉన్నది ఈ గ్రామం.

సాయంత్రం అయిందంటే ఎవ్వరి వాడలో వాల్లు ఒక దగ్గర కూర్చొని ముచ్చట్లు పెట్టుకోవడం, కష్టసుఖాలు పంచుకోవడం, మళ్ళీ తెల్లారి ఎవ్వరి పనుల్లో వాళ్ళు నిమగ్నమవడం. . ఇది నిత్యం జరిగే గ్రామ చావడి కార్యక్రమాలు.

అది 1989వ సంవత్సరం ఒక రోజు లక్ష్మిబండ గ్రామంలో తూర్పు దిశగా ఉన్న వాడ అది. రాత్రి 9 గంటలు అవుతుంది. సురేష్ అనే విద్యార్థి ఇంటిలో లైటు కింద కూర్చొని హోమ్‌వర్క్ చేసుకుంటున్నాడు. అంతలోనే వరుసకు బావ అయిన ఇంటి ముందరి భానయ్య వచ్చాడు.

"ఏందిరో బామ్మర్దీ, బాగానే సదువుతానవ్! నౌకరి చేత్తవారా?" అని అడిగాడు సురేష్‌ను.

ముసి ముసి నవ్వుతూ "లెక్కలు చేసుకుంటున్న బావా! లెక్కలు చేయకపోతే రేపు మాస్టారు కొడ్తడు" అని సమాధాన మిచ్చాడు సురేష్.

"ఏం సదువులురా! బామ్మర్దీ, అయితే గా రామన్న లెక్క ఎకె-47 తుపాకి పట్టి కమాండర్ అయి పెద్ద పేరు తెచ్చుకోవాలె. ఏమిటికి పనికిరాని సదువులు ఎందుకురా?". అని ఉపోద్ఘాత వ్యాఖ్యానం చేశాడు.

అపుడు ఆ ఊరు విప్లవ వాతావరణంలో ఉంది. ప్రతి ఒక్కరు అవే పాటలు. అవే మాటలు. అను నిత్యం అన్నల ముచ్చట్లే. అప్పటికి సురేష్ 6వ తరగతి చదువుతున్నాడు. ఈ బానయ్య బావ అన్నమాటలు సురేష్‌కు ముద్రపడి పోయాయి.

నాలుగు సంవత్సరాలు గడిచింది. సురేష్ సంఘంలో పని చేసి అనుభవం పెంచుకున్నాడు. సురేష్‌కు వరుసకు బామ్మర్ది అయ్యే నరేష్ కూడా తోడయ్యాడు. ఈ ఇద్దరు గ్రామంలో పార్టీ పని తీవ్రంగా చేసి పార్టీ దగ్గర మంచి గుర్తింపు పొందారు. ఆ సమయంలో ఆ ఏరియాలో రామన్న దళం పనిచేస్తోంది.

లక్ష్మిబండ గ్రామం విప్లవ వాతావరణంలో ఉన్నప్పటికి గుడుంబ సారాయి మాత్రం సాయంత్రం కాగానే గుప్పు మంటుంది. ప్రతి రోజు ఏదో ఒక కుటుంబంలో గొడువ జరుగుతూనే ఉంటుంది. ఆ సమయంలోనే పార్టీ నాయకత్వంలో సారా వ్యతిరేక పోరాటం ఊపందుకుంది. ఈ ఏరియాలో కూడా సారా వ్యతిరేక పోరాటానికి దళం పిలిపిచ్చింది. ఈ పిలుపులో భాగంగా లక్ష్మిబండ గ్రామంలో కూడా సంఘ నాయకత్వంలో సారా వ్యతిరేక పోరాటం ప్రారంభమయింది..

ఒక రోజు గ్రామ యువజన సంఘం సమావేశమయింది. సంఘ బాధ్యులుగా సురేష్, నరేష్‌లు వ్యవహరిస్తున్నారు. ఆ రోజు చర్చంతా "సారాను ఎట్ల బంద్ చేయించాలి?".

ఒక సభ్యుడు మాట్లాడుతూ "గుడుంబ బట్టీలను పగుల గొట్టాలి" అన్నాడు.

మరో సభ్యుడు మాట్లాడుతూ "గుడుంబ తయారు చేసే వాళ్ళను కొట్టాలి, కొడ్తనే బుద్ధత్తది" అన్నాడు. కొంత వయస్సు మీద పడ్డ సభ్యుడు మాట్లాడుతూ "మన పార్టీ వాళ్ళ పద్ధతులకు అనుగుణంగా మన కార్యక్రమాలుండాలి" అన్నాడు.

వెంటనే నరేష్ కల్పజేసుకొని "మనం ప్రజల కొరకు పని చేస్తున్నం, మొదటిసారి ప్రజలతోని ఒక సమావేశం పెట్టి సారా కష్ట నష్టాలను వివరించి ప్రజల అభిప్రాయం మేరకే ఎలా బంద్ చేయిద్దాం అనేది నిర్ణయిద్దాం" అన్నాడు.

సురేష్ వెంటనే "మన నరేష్ అభిప్రాయమే సరైంది. అట్లనే చేద్దాం" అని ఒక సమిష్టి నిర్ణయానికి వచ్చారు.

ఒక రోజు ప్రజలతోని సమావేశం ఏర్పాటు చేసి ర్యాలీగా గ్రామమంతా కలియ తిరిగారు. మరుసటి రోజు నుండి గుడుంబా బట్టీలను పగులగొట్టడం సంఘ కార్యకర్తలు మొదలు పెట్టారు. అక్కడక్కడ గుడుంబా తయారీ దార్లను కొట్టడం కూడా చేశారు. అప్పటికే నెల రోజులయింది. దళం గ్రామానికి వచ్చింది. సాయంత్రం గ్రామ పొలిమేరల్లో సంఘంతో పాటు కొంత మంది పార్టీ అభిమానులకు కూడా పిల్చింది. దళం బాధ్యుడు రామన్న సారా పోరాటం గుర్చి చర్చ మొదలు పెట్టాడు.

సంఘ బాధ్యులు సురేష్, నరేష్‌లు కూడా సారా పోరాటం గురించి వివరించారు.

అందులో ఒక పార్టీ అభిమాని మాట్లాడుతూ "మీరు ప్రజలను కొట్టాలని చెప్పిండ్రానే" అని సంఘ బాధ్యుల మీద రిపోర్టు చేశాడు. వెంటనే రామన్న స్పందిస్తూ "మేము ఎందుకు కొట్టమని చెప్పినం? అలా చెప్పలేదు" అని సమాధానమిచ్చాడు.

సురేష్, నరేష్ మిగితా సభ్యుల ముఖాలు బిత్తరపోయాయి.

ఆ కారు చీకట్లో వీరి ముఖాలు బిత్తరపోయి బాధపడేది రామన్నకు అర్థం కాలేదు.

పూర్తి వివరాలు తెలుసుకోకుండా రామన్న గిట్ల ఎందుకన్నడు? ఇప్పుడు వాళ్ళు మమ్మల్ని చులకనగా చూడరా? అని వారికి వారే మదనపడ్తున్నారు. రిపోర్టు చేసిన వ్యక్తి పార్టీ అభిమాని అయినప్పటికీ గుడుంబా తయారీదార్లలో ఒకడు. ఇతడే గ్రామ రాజకీయ నాయకులకు అండగా ఉంటడు. ఈ విషయాలు పార్టీకి తెలియవు అని పక్కకు పోయి సురేష్, నరేష్ గొనుక్కున్నారు. సమావేశం పూర్తి అయింది. ఎటోల్లు అటు వెళ్ళిపోయారు. చివరకు సురేష్, నరేష్‌లు ఆ దళంతోనే ఆగిపోయారు. రామన్న వీరిద్దరిని పక్కకు తీసుకపోయి రేపు మీరు సామన్‌పల్లి దగ్గరకు రమ్మని చెప్పి ఎపిటి పెడ్తూ పార్టీ పనిని అప్పగించారు. అసంతృప్తితోనే సరే అంటూ సురేష్, నరేష్‌లు దళానికి చేతులు కల్పి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి ఇద్దరు ఒకే దగ్గర పడుకున్నారు. "బావా, మనం ఇంత పెద్ద కార్యక్రమం చేస్తుంటే రామన్న గిట్లనేంది? అని సురేష్‌తో చర్చ మొదలు పెట్టాడు.

"రామన్న ఎందుకు అట్లన్నడో నాకు కూడా అర్థం కాలేదు సురేష్" ఏమైనా విషయాలుంటే ప్రత్యేకంగా మన సంఘ సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడుకుంటే బాగుండు. వాళ్ళందరి ముందర అనే సరికి మనం ఏదో తప్పు చేసినట్టుగా వచ్చినోల్లందరు భావించిండ్రు. కార్యక్రమం చేయమని చెప్పింది పార్టే. మళ్ళీ గట్లెందుకు చేయమన్నం అని అందరి ముందు అనడం నాకు కూడా చాలా బాధ అనిపించింది". అని మాట్లాడుత్తూ తన బాధను పంచుకున్నాడు సురేష్.

తెల్లారింది. పార్టీ చెప్పిన పని పూర్తి చేసుకొని సాయంత్రం పార్టీ ఎపిటికి వెళ్ళారు. దళ సభ్యుడు మంగన్న సెంట్రీ చేస్తున్నాడు. ఇద్దరు కలిసి సెంట్రీ దగ్గరికి పోయి ఈ మందులు రామన్నకు ఇయ్యి అని చెప్పి మేము ఇటు నుంచే ఇంటికి పోతం అని అలిగినట్టుగా మాట్లాడాడు. "వీల్లు గిట్లెందుకు మాట్లాడుతున్నరని అర్థం గాక మంగన్న తికమక పడ్డడు".

"ఏంది తమ్ములూ! ఎన్నడు చాలా సంతోషంగా ఉండేవాళ్ళు ఈ రోజు గిట్ల మాట్లాడుతున్నరు" ఇద్దరిని హత్తుకొని అడిగాడు.

ఆ ఆప్యాయతకు ఇద్దరు బాధను ఆపుకోలేక వెంటనే రాత్రి రామన్న అన్న మాటను చెప్పేశారు. వెంటనే మంగన్న ఇంకా దగ్గరకు హత్తుకొని మీరు రండి. దళం దగ్గరకు పోదాం అని దళం డెన్ను దగ్గరికి తీసుకెళ్ళాడు.

దళమంతా ఏదో జనరల్ చర్చలో ఉన్నారు. మంగన్నతోని వీళ్లద్దరిని చూడడంతో "లాల్‌సలాం కామ్రేడ్స్" అంటూ కరచాలనం చేశారు.

కాని వీరి నుండి అంత స్పందన కనబడలేదు. మంగన్న, రామన్నను పక్కకు తీసుకపోయి ఏదో గుసు గుస చెప్పాడు. వీరిద్దరి చర్చ దళమంతా అర్థం అయింది. రామన్న సురేష్‌ను - నరేష్‌ను దగ్గరకు హత్తుకొని మాట్లాడుకుందాం అని కూర్చోబెట్టారు. రామన్న చర్చ మొదలు పెట్టాడు. "తమ్ముళ్లూ మీరు బాధపడ్డ విషయం మంగన్న చెప్పాడు. దానికి ఇంత సున్నితంగా బాధపడవద్దు. ఆ మీటింగ్‌లోనే అతని గూర్చి చెప్పాల్సి ఉండే. అదే విధంగా నేను ఆ మందిలో అలా అనడం సరియైంది కాదు. అలాంటి విషయాలను మనం ప్రత్యేక సమావేశంలో మాట్లాడుకోవాల్సి ఉండే అని ఆత్మ విమర్శ చేసుకున్నాడు. అప్పుడు గాని ఆ ఇద్దరు ఆ బాధలో నుండి బయట పడ్డారు.

దళం సమావేశంలో కూర్చొంది. లక్ష్మిబండ గ్రామం చర్చకు వచ్చింది. మంగన్న మాట్లాడుతూ "ఆ ఇద్దరు తమ్ముల్లూ సురేష్, నరేష్‌లు పూర్తి కాలం కార్యకర్తలుగా వస్తామని పట్టుబడుతుండ్లు" అని తన అభిప్రాయం వెలిబుచ్చాడు. మంగన్న అభిప్రాయంతో మిగితా వారు కూడా ఏకీభవించి జిల్లా కమిటీకి రిపోర్టు చేసి త్వరలోనే రిక్రూట్ చేసుకుందాం అని నిర్ణయానికి వచ్చారు.

మూడు నెలలు గడిచింది. అప్పటికే జిల్లా కమిటీ నిర్ణయం మేరకు సురేష్ పట్టణ పని విధానంలోకి కేటాయించబడ్డాడు. నరేష్ మాత్రం స్థానిక దళంలోనే దళ సభ్యునిగా నిర్ణయించబడ్డాడు. సురేష్‌ను జిల్లా కార్యదర్శి ప్రసాదన్న డీల్ చేస్తున్నాడు. ఎక్కువ కాలం ప్రసాదన్న కంట్రోల్‌లో ఉండడం మూలంగా సురేష్‌కు విప్లవోద్యమ అవగాహన పెరిగింది. ఎందుకంటే సుదీర్ఘ కాలం ఆచరణలో ఉన్న ప్రసాదన్న ఉద్యమ ఎత్తుగడలను రూపొందించడంలో నేర్పరి. రాజకీయంగా తత్వశాస్త్రంలో దిట్ట. ఎలాంటి సమస్యలనైనా తత్వశాస్త్ర కోణంలో సులభంగా పరిష్కరిస్తాడు. అనునిత్యం అతనిలో విప్లవోద్యమ ఆలోచనలే తొణికిసలాడేవి. ఎదుటి వ్యక్తిపై విమర్శను అతనిలో మార్పును తీసుకొచ్చే విధంగా ఉండేది. అతని ఆత్మ విమర్శ కూడా అతనిలో మార్పును తీసుకొచ్చే విధంగా ఉండేది.

జిల్లా కమిటీ నిర్ణయం మేరకు అటవీ ప్రాంతం అయిన లక్ష్మిబండ గ్రామ సమీపంలోనే అంబుష్ చేయాలని తీర్మానించారు. తీర్మానానికి అనుగుణంగా అంబుష్ పార్టీ ఏంగేజ్ అయింది. అందులో ఒక బ్యాచికి ప్రసాదన్న బాధ్యుడు. ప్రసాదన్నకు గార్డుగా నరేష్ నియమించబడ్డాడు. రెక్కీ పూర్తి చేసుకొని శత్రువు రాకకోసం ఎదురు చూస్తున్నారు. అంతలోనే శత్రువాహనం (ట్రాక్టర్) చప్పుడు వినబడ్డది. అందరు అలర్ట్ అయ్యారు. సెంట్రీ నుండి కాషన్ రానే వచ్చింది. అంతలోనే మైన్స్ పేలుడు దాటికి ట్రాక్టర్ ముక్కలు ముక్కలు అయింది. శత్రువువైపు నుండి అరుపులు, బొబ్బలు. ఇద్దరు లేదా ముగ్గురు స్పాట్‌లోనే చనిపోయారు. కొంత మంది అరుపులతో పరుగెత్తుతున్నారు. అంబుష్ పార్టీ నుండి దాడి మొదలు పెట్టారు. బతికున్న కొంతమంది శత్రుమూకలు ప్రతిఘటిస్తున్నారు. హోరాహోరీ యుద్ధం ఆ యుద్ధ సంతోషంలో నరేష్ శత్రువును ఒరే, ఒరే లొంగిపోండి అని హెచ్చరికలు చేస్తున్నాడు. కాని ఆ సంతోషం ఎంతో సమయం ఆగలేదు. ఒకవైపు తుపాకుల మోతలు, మరోవైపు అరుపులు హెచ్చరికలు అంతలోనే పచ్చని అడవంతా నిశ్శబ్దం ఆవరించింది. ఒక్కసారిగా లేత పచ్చని ఆకులపైన రక్తం చిమ్మింది. అంతా నిశ్శబ్దం కామ్రేడ్ మన నరేష్ అమరుడయ్యాడు. గద్గద స్వరంతో మహిళా కామ్రేడ్ స్వరూపక్క గొంతు నుండి వినబడ్డది.

కామ్రేడ్స్ దాడి ఆపండి. మరో గొంతు. డిఫెన్స్ టీం సభ్యులు నరేష్ దేహం దగ్గరికి పోయారు. నరేష్ నుదుటిలో తగిలిన తూటా మెదడును చీల్చి బయటపడేసింది. ఎలాంటి అరుపు లేకుండానే

(మిగతా 21వ పేజీలో.. )

# అభివృద్ధి

ఎ. వి. రెడ్డి శాస్త్రి

మాసిఁవ్వాసెలంగాడు - నేడా - ఆడికి అబివుద్ది (అభివృద్ధి) అన్నమాట ఇనపడితే సాలు - ఒల్లెరగడు. అబివుద్ది అన్న మాట సెవల పడీతప్పటికి - వొచ్చి వాలిపోతాడు రాబందునాగ. పోనీ - తొల్నుండి ఆడి బోగట్టాలన్నీ ఏలిగాని - మావూరునేదా? ఎనాగుండీదేటి మునపటి రోజుల్ల? ఊరిసుట్టు అడివినాగ పెరిగిన సెట్లు సేఁవా - పెహరీ గోడనాగుండీ వనుకో! ఆ తోపులు మద్దిన ఊరు- ఎవుడి కంటా పడకంట. దానికి తోడు - ఊరి కోపక్క లోక సముద్రం సెరువూ - మరోపక్క నందిగాడి సెరువూ - సిలక సముద్రాల్లాగుండీవనుకో - సమ్మత్సరం మూడొందలరవయ్ రోజులూ - నీటితో తపతప కొట్టుకుంటూ. పేణం యిసిగి ఎప్పుడేన సెర్లపడి సచ్చిపోవాలంటే - ఆ సెరువులుకి మించిన సెరువులే వుండీవికావు. అయితే - ఆ రోజుల్ల - ఆటిలో పడి ఎవురేనా సచ్చినారేటి - ఈ రోజుల్లో నాగ? ఇప్పుడంటె పేపర్లంట - ఏ రోజు సూపినా - అక్కడా రైతు ఆత్మఅత్య సేసుకున్నాడంటే - ఇక్కడీ రైతు పురుగుల మందు తాగి సచ్చిపోనాడని వోర్తలేకదా!

సీ! - ఇనాటి సావులే లేవు మునపటి రోజుల్ల. ఉన్నోడూ బతికీవోడు, లేనోడూ బతికివోడు. ఆడు పరవాన్నం తిని బతికితే - ఈడు గెంజి నీల్లు తాగి బతికీవోడు. కాని - నానీ బతుకు బతకనేకపోతన్నానని యిసిగి పోయి పేణాలు తీసుకున్నోళ్లేరీ ఆ రోజుల్ల? ఊరుసుట్టు సెట్లు పుట్టలూ - పతి ఇంటి ముంగలా - నింపాదిగ గడ్డికర్రల్నవుల్తూ పసుపులూ - వొర్షాకాలంల పరిగెడుతూ రాఁవిగెడ్డ - మరి సూస్కోరా అలాటప్పుడు వూరిని - ఇదేటి - ఇదేదో సొరగంలా అవుపిస్తంది - అని అనకోకంట ఉండగలిగీ వోడేటి సూసినోడెవుడేన?

మావూరు ఇస్కూల్ల ఓమేస్ట్రుం డీవోడులే - ఉత్తి పిచ్చి నా కొడుకనుకో. ఎప్పుడు సూసినా గుంటలకేదో బోదపరస్తుండడం - కతలు నీతులు సెపుతుండడం - ఇలా బతకాల, అలా బతకాల అని బోదపరసడం - ఇలాటివే సేపీవోడు గాని - ఈ కాలం మేష్టర్లలాగ గవుర్మెంటునుంచి - గుంటల కోసం వొచ్చిన డబ్బుని నొక్కీమ్డం - సిన్నప్పటి నుండేనక్క జిత్తులు నేర్పడం - ఇలాటి పన్లు సేపీవోడేటి? సీ! అలాటి మాటే వుండీది కాదు. ఆ రోజుల్లోనే - వొక పాట కూడా రాసినాడు - ఆమేష్టు - మావూరు మీద -

సెట్టూ సెట్టూ సుట్టూ సిక్కాని సిలక రంగు-
పైరూ పైరూ కాడ పచ్చాని కోక-
సెరువూ సెరువూ నిండా మత్స్యావతారాలూ-
వూరూ వూరల్లాను సరదాగా సిందులు.

అంటూ - ఇంకేటో కూడా రాసినాడు. ఎందుకనో - ఆ పాట అనాగ వుండిపోనాదిరా నా మనసులో, ఆ పిచ్చి పంతులు మాటంటె ఎంత గురనుకున్నావ్ గుంటసజ్జకి! అతగాడు రాసిన పాటల్ని పాడుకుంటూ - గెంతుకుంటూ - గేమఁవంత సిందు ల్తొక్కుతుండీ వోరనుకో!

అదిగలాటి దేవుడ్లాటి పంతుల్ని మావూర్నుండి టేన్స్ పర్ సేయించీసినాడు - ఈ అబివుద్దిగాడు. ఆడి పేరు సిఁవాసెలం గాడని మావంత మర్చిపోనాం. ఎక్కడ సూసిన అబివుద్ది సేస్తుండీవోడు కదా - అందికని ఆడికి అబివుద్ది నాయుడనే పేరే కనఫరమయిపోనాది.

అదుగో - ఆడే మావూర్నుండి పంతుల్ని టేన్స్ పర్ సేయంచీసినాడు. ఏటిరా ఇలా సేసినావూ అని అడిగితే - ఆడి జవాబేటో యెరికా? 'ఈ పిచ్చి నా కొడుకు వూర్ల వున్నంతకీ - మనకి అబివుద్ది జరగనివ్వడు. గడ్డికుప్ప కాడ కుక్కనాటి ఇలాటి మనుషుల్ని మనమద్దిన వుండనివ్వకూడదు. సీరాఁవుడ్నాటి కతలు సెప్పి, సీకుష్టుడినాటి కతల్సెప్పి - మన గుంటలు ముందుకెల్లకంట సేసెస్తన్నాడు. ఈడున్నంతకీ గుంటలు ఇయాల పెపంచికానికి కావాలసిన సులువులూ, బతక నేర్సిన తనం నేర్సుకోరు. ఈల్లకి పెపంచికం తెలివి తేటలు వొంటబట్టవు.' అని సెప్పి - టౌనంట ఎవుడెవుడి కాడికో ఎల్లి, ఆల్లకాల్లూ సేతులూ పట్టుకొని - పంతుల్ని ఊర్నుంచి టేన్స్ పర్ సేయించి - తగి లీసినాడు. ఆ తరవాతే - వూర్ల కసింత కసింత లెక్క అబివుద్ది సెయ్యిడం ఆరంబించినాడు.

ఆడికి వూరవతల - వల్లకాళ్లకాడ - మూడెకరాల బూఁవండీది. అదుత్తి మెరకదెప్పి. దానికి యెనాటి జలాదారఁవునేదు. కానయితే - అది టౌనుకి కసింత దగ్గిరిగ - ఓ రెండమైల్లదూరంల వుండీది. దానికి సూపు దూరంలె - కలకత్తా కెల్లీ రోడ్డుండీది. ఈ అబివుద్దిగాడు అన్ని దుక్కులూ తిరగతుండీవోడు కదా - మరెక్కడ సూసినాడో ఏటో - లేఅవుటట - అంటే - బూవిని సిన్న సిన్న ముక్కల కింది ఇడగొట్టేసి, - ఇల్లజాగాలకింద మారిసీసి- ఆజాగాల్ని అమ్మకానికెట్టడవట! ఈయాపారంలో - బోలిడు లాబాలట. అనాగొచ్చిందిరా - ఆడిబుర్రలోకి - ఈ లేఅవుట్ల ఆలోశన.

దాంతోటి - ఏటిసేసినాడెరికా - ఓనాడు పెందిల నెగిసిపోయి - ఓ పది మంది కూలోల్లనిపెట్టి - ఆడి మూడెకరాల బూవినీ సదును సేయించినాడు. అనాగ - ఓ పదిపదేను రోజులు రాత్రనక పగలనక కష్టపడి - లేఅవుటు - తయారు సేపించినాడు. ఇక సూడంఁడ్రా - దాంతో ఆడి పొలం రూపేమారిపోనాది. దాన్నంతట్నీ సిన్న సిన్న ముక్కల కింద ఇడగొట్టేసి - - సరివీ రాళ్లు పాతించినాడు. కంకరా మన్ను పెరిగించి రోడ్లట - తయారు సేయించినాడు. ఆ తరవాత నాలుగు దుక్కులా జెండాలు పాతించినాడు. ఈ సోద్దెం సూడ్డానికి వూరువూరల్ల - తిరగబడిపోనాదనుకో. ఆ లేఅవుటు ముంగల - ఓ బోరుడు రాయించి పెట్టినాడు - 'తొలి అబివుద్ది నగర్' అని.

ఇదంత అయిన వారం రోజులు తరవాత కావాల - పట్నం

నుండి జనాలు - తిపారం పట్టినోల్లలాగ - ఎలిపొచ్చీవోరు - ఈజాగాలు సూన్నానికి, అక్కడ్నుండి అమ్మకాలు ఆరంబ వయినాయి. ఆర్నెల్లు తిరక్కంట - అన్ని ముక్కల్నీ అమ్మీసినాడు. ఆరులచ్చులు లాబం వొచ్చిందని - ఆడికాడ ఈడికాడ సెప్పడం సేరంబించినాడు మా అబివృద్ధిగాడు. అదిగో - అది జరిగింతరవాతే - జనం ఆడ్ని 'సిట్వా సెలం' అని పిలడం మానీసి - అబివృద్ధి నాయిడని పిల్డం మొదలెట్టినారు. ఆడి మెరకపొలానికి - పదివేలిచ్చి కొన్నానికి కూడా ఎవుడూ దయిర్యం సెయ్యలేకపోనాడు.. అనాటిది - ఇప్పుడేకంగ - ఆరులచ్చులు లాబం వొచ్చిందని తెలీగానే - ఊరి జనవల్ల ముక్కుమీద ఏలేసుకున్నారు.

అనా పుట్టిందర - జనాల్ల డబ్బాశ.

'ఏటీ - ఏడాదల్ల మన్ను పిసికీ, గత్తాలుతోలీ, బురదలసచ్చీ - పండిస్తె - పాతికి బస్తాల గింజలయాతప్పటికి - కటకట లాడతుండీది.. సరకూ కల్లంల తయారయా తప్పటికి - అందాకా సుక్కల్లోవున్న గింజదర - అమాంతం కిందికి తొక్కీసీ నోరు సావుకోర్లు. కల్లా లంట గింజలు ఉంచకోనేకా, నిలవా సేసునానికి జాగాల్లేకా - ఎంతకో కొంతకని - దలార్నా కొడుకులు సెప్పిన దరకే గింజల్ని అమ్మేస్తె - ఆ ఒచ్చిండబ్బు - మదుపులుకే సాలకంటయిపోయాది. అనాటప్పుడు రైతన్నోడు - ఏటి తినాల, ఏటి కరుసు పెట్టుకోవాల?' ఇలాటి .ఆలోశనల్తో సతంవతంవై పోతుండీవోరు సిన్నరైతులందత.

అదిగో - అనాటి టైముల అబివృద్ధిగాడి లాబాల బోగట్టా రైతుల సెవిన బడింది. మనసుల్లో కొత్తరకం ఆశిలు పుట్టుకొచ్చి - బెమ్మసెవుడు డొంకల్లా పెరగతన్నాయి. అయితే - ముందుకి రానానికి - ఎవుడికీ దయిర్యం సాలకంటుంది. బంగారం నాటి బూంవుల్ని ఇళ్ల జాగాల కోసం పాడు పెట్టిడంవా అని ఆలోశన కొరికెస్తన్నాది. సివరికి దయిర్యం సేసి - బోలిడు అప్పుల్ల కూరుకుపోయిన గవిరినాయుడు - ఒకనాడు పెందిల నెగిసి - ఎవుడికంట పడకంట - సడీ సప్పుడూ కాకంట - అబివృద్ధిగాడి ఇంటికెల్లినాడు. ఎల్లి

'ఒరే అల్లుడూ - నా పొలం కూడా లేఅవుటు సెయ్యానికి కవుతాదేటిరా?' అనడిగినాడు - బోలిడు సిగ్గు పడిపోతూ.

ఆడిమాటలినగానే - అబివృద్ధిగాడు కురిసీలెల్లి నెగిసిపోయి - గుండార్నెగ్గట్టీసి -

జరదా కిల్లీని మరోపాలి గట్టిగనొక్కి - గవిరి నాయుడి దగ్గిరికి పొరొచ్చి - ఆడి బుజం మీద సేతులేసి - 'ఒరే దద్దా - నీ పొలం కాకపోతె, ఇంకెవుడి పొలంరా లేఅవుటుకి సదుపాయంగ వుండీ పొలం! నివ్వు ఊం అను - నాను రేపు తెల్లార్తీతప్పటికి - జాగాలు కొనీవోల్లని - నీయింటి సుట్టూ తిరిగేటట్టు సేస్తాను. నీ పొలంకి - ఎంత సచ్చినా - పది లచ్చులకి తక్కువ కాకంట సూసీ పూచీనాది' అన్నాడు - బోలిడు సరదా పడిపోతూ.

ఆ ముక్క ఆడినోటంట యినీసినాక - ఇంటికొచ్చీసినాడు - గవిరినాయుడు. అక్కడ్నుండి - ఆడికీ-ఆడిపెల్లానికీ, పిల్లలకీ మద్దిన జట్టీలు నెగిసిపోనాయి..

'తాతల్నాటి నుండొస్తన్న మాన్నిం - ఈబూంవిమాలచ్మి. దీన్నమ్మీసి - దిక్కులేనోల్లలాగ - వూరొగ్గీసి ఎలిపోవాలా?' అని బావురుమంది - గవిరినాయుడి బారియ.

'ఊరెలొగ్గీయాలే - ఇక్కడే మేడకట్టుకొని వుంతాం' అన్నడు పెద్దకొడుకు.

'పొలం పోయినాక - నాకేంలా ఈవూరు? అప్పుడు నాకీవూరు వొల్లకాటి కింద నెక్క, బూదేవతని అమ్మీసి మీరు మేడలు కత్తుకుంతారో - మిద్దిలు కత్తుకుంతారో - కట్టుకోండి. నానుమాత్రం వుండనీవూర్ల.'

'ఉండకెక్కడెకిలిపోతావే అమ్మా?' అని ఎకసెక్కెంగ అడిగినాడు సిన్న కొడుకు.

'ఏక్కడి కెల్తాన? నాబూదేవతని - గంగి గోవుని కబేలాకి తోలీసినట్టు - ముక్కముక్కలు కింద కొట్టేసి అమ్మీసుకున్నప్పుడు - ఆ తల్లి బూదేవతే - నన్ను వొలల్లోకి తీసుకోదా - సీతమ్మ తల్లిని తీసుకున్న లెక్క.'

ఆ రకంగా ఆయింటి దాయి పెట్టిన గోల - ఊరందర్నీ కుదిపీసిందనుకో. గవిరిగాడి బారియ పూర్ల వున్న పెతి రైతు ముంగలా నిలబడి - "ఏటయ్య - వందలు వందలు ఏల్ల కాడ్నుండీ ఈ పెపంచకంల మనుసు లందరికీ తిండి పెడతన్న బూదేవతని పాడుపెట్టేసి - మేడలూ మిద్దెలూ కట్టీసి - మనుసులు తిన్నానికి తిండి లేకంట సేసేస్తారేంట్రయ్యా' అని నిలవ దీస్తన్నట్ట పించి మొకాలు దించుకున్నారు.

అయితె - దాని ఏడుపే మిగిల్నాది గాని - కొసకేటయింది? మొగుడూ, కొడుకులూ - అబివృద్ధిగాడు తెచ్చిన మనుసులుకి - బూంవిని రిజిస్ట్రీ సేసీసినారు.

తన మాట నిలబెట్టుకుంది - తల్లి ఇల్లాలు. బూంవి రిజిస్ట్రీ అయిపోయిన మన్నాడో మూడోనాడో కావాల - తానంసేసొచ్చి, దీపం ఎలిగించి - రాంవులోరి పటంముందు కూకొని - మరక్కడ నుండి నెగనేదు. పేణం గాల్ల కలిసిపోనాది. ఇది జరిగినాక - గవిరినాయిడి కుటవం - ఊర్లమొకాలు సూపించనేక - శానా రోజులు ఇంటిపట్టునే ఉండిపోనారు.

ఏంట్రా? - తరవాతేటయిందని - అడగతన్నావా? అయితే ఇనండ్రా - సెప్తాను. ఏసంగిలో తాటికొంపలకి అగ్గంటుకొని - గేమం గేమం యావత్తు బుగ్గయిపోతుంటాది సూడూ - అనాగయి పోనాది మావూరుకూడా. అబివృద్ధి గాల్ల సేతుల్లోకి ఏలిపోనాది గేమవల్ల. సెట్లు, తోపులు, తాళ్లు, కంచెలూ, పెండెలూ - అన్నీ - ఒకటేటి - నరికిపారేసినారు. సిలక సముద్రాల్లాటి సెరువుల్ని కప్పెట్టేసినారు. నల్లగ, నిగనిగలాడుతూ - ఎదరగా దేవుళ్లు నిలబడినట్టు అవుపిస్తుండీ కొండలన్నిట్నీ - మందుపెట్టి పేల్చీసి - బండల్ని లారీల్ల లోడు సేసి - పలకలకింద సదును సెయ్యానికి ఎక్కడెక్కడికో ఒట్టికెలిపోనారు. పేలిసీగ మిగిలిపోయిన రాళ్ల దిబ్బలు ఎనా అవుపిస్తన్నాయో సూసేరా? బూంవి ఒంటిమీద నెగిసిన ఏనుగ్గజ్జి కురుపుల్లా లేవా? తరవాత గెడ్డల్లో నీళ్లు రాకంట ఆపీసి - గరిటెడు ఇసకేన మిగలకంట ఊడ్చి ఎత్తికెలిపోనారు. ఎన్ని ఏలుఏలు సమ్మత్సరాల ఇసక! ఏర్లంట, గెడ్డలంట ఇసకుండబట్టే కద ఎండాకాలంల ఇసకల రెండుడుగుల లోతు తవ్వీతప్పటికి - కొబ్బరినీర్లాటి నీళ్లు దొరికివి - దప్పికతీరనానికి. ఏర్లంటా, గెడ్డలంటా ఇసకే నేదు. అలాటప్పుడు మరి నీరెక్కడ్నుండొస్తాది? ఇయాల - ఈసుట్టుపట్ల పూర్లంట ఎక్కడ

సూడూ - ఎక్కడా నీరన్న మాటనేదు.. ఇయాల మావూర్ల అందరూ డబ్బున్నోళ్లే. ఎక్కడా - గుడిసిలన్న మాటే నేదు. అన్నీ డాబా ఇళ్లే. వూర్ల కుర్రజట్టల్ల - మోటారు సైకిల్ల మీదే తిరగతన్నారు. బాగా డబ్బున్నోలయితే కార్లు కొనీసినారు.

అయితే - నీటికే కటకటొచ్చి పడిపోనాది. ఒకప్పుడు సిలక సముద్రం నాగుండీవా - వూర్ల సెరువులు - ఇయాళ ఎక్కడా ఒక సుక్క నీర్లేదు. అబివుద్దా మరోటా? - వూర్నిండా బోర్లు ఏసినారు. కాని - యేట్నాబం? ఆట్నిండొచ్చిన నీరు - కంపూ - తాగనానికి పనికేరాదు. ఎగవున ఎక్కడో పురుగుల మందుల పేక్టరీ ఎట్టినారట. దాన్లెల్లి ఇరవయి నాలుగ్గంటలూ ఇషం నీరు బయిటకొచ్చీసి - దరిదాపుల్ల వున్న వూళ్లన్నిట్లోనీ - మంచినీరన్నది దొరక్కంట సేసీసింది. ఇయాల - ఊరు ఊరల్ల - తాగనానికి నీల్లు కొనుక్కోడవే కదా!

ఊరుకున్నోడు వూరుకోకంట - నాను సెపుతున్న కతని ఆలకిస్తన్న పాపారావుగోడు - 'మరయితే తాతొరే - మనమడకలంట ఎక్కడా పంటల్లేనే లేకంటయి పోనాది కదా - మరి ఈ పురుగుల మందుల పేక్టరీలేలరా?' అనడిగ్గినాడు. ఆడన్నదీ నిజవే - కాని ఆడు అడిగిందానికి నేనేటని సమాదానం సెప్పగల్ను?

ఇంతల ఎవుడో పింజారీ నా కొడుకు - ఎకసెక్కెంగ నవ్వుతూ - 'ఓసి వూరుకోరా - ఏటీతెల్నట్టు - మరి మనం ఆత్మ అత్యలు సేస్కోవాలంటే - మన కక్కర్లేదేట్ర పురుగుల మందులు?' అన్నాడు.

కథని ఇంతన్న జనవల్ల గొల్లున నవ్వినారు.

అయితె - నాకు కసింత సెవుడూ, దుష్టిమద్దిం వొచ్చీసినాయి కదా - అందికని - ఆడిమాటలకి జనం నవ్వినారో - ఏడ్సినారో పోల్సలేక పోనాను. ఆడన్న ముక్కా నిజివే అయుండాల. ఎందుకంటే - ఈమద్దినీమద్దిన - ఇద్దరు రైతులు - మనకాడో - పైవూల్లంటో - పురుగులు మందులు తాగి సచ్చిపోనారట - పేపర్లంట సదివినాను. అయితె - ఆలసచ్చిపోనానికి ముందు రోజుల ఏటి సెప్పినారో సదువుతుంటే - బయింపుట్టుకొస్తన్నాది. ఆల్లు అన్నారట - 'ఈనడిమంత్రపు సిరి వొచ్చి పడిపోడం కాదుగాని - పతివోడి సేతుల్లోనా లచ్చులు లచ్చులు ఆడతన్నాయి. అంత డబ్బుని ఏటిసెయ్యాలో తెలక - అందరూ తాగుడు నేరస్తన్నారు. ఇలా సెడిపోతున్న కొడుకుల్ని, మనవల్నీ సూసి - మాం వూల్లంట మొకాలు ఎత్తుకు తిరగనేకపోతన్నాం' అని గోల పెట్టి - మరో దారి కనపడక - పురుగుల మందు తాగీసినారట.

సివరిగ ఒక మాట సెప్పీసి - ఇంటికెల్లి తొంగుంతాను - నడుంసాలొస్తంది. ఈ చావుల కబుర్లు పెపర్లంట సదివిన వోరంకో రెండోరాలకో - వూర్ల గుప్పుమంది - అబివుద్దిగాడు వూరుమద్దిన - 'బారు' తెరస్తన్నాడని. దాంతో - వూర్లోని ముదరోల్లంతా జతపడి - ఆడికాడికెల్లి - 'ఏట్రా ఈ పని - ఇప్పటికే గుంటలల్ల సాయింత్రం అయితప్పటికి - మోటారు బల్లెక్కి - పట్నానికెల్లి - పూటుగ తాగొచ్చి - తంధనాలాడతన్నారు. అనాటిది నువ్వు ఏకంగా వూర్లోనే సారా కొట్టు ఎడితే మరీ తాగుడికి అడ్డూ ఆపూ వుంటాదిరా?' అనడిగినారు.

---

(18వ పేజీ తరువాత.. )

శ్వాస ఆపేశాడు. ముఖం ఎప్పటిలాగే చిరునవ్వుతో ఉంది. డిఫెన్స్ టీం సభ్యుడు కామ్రేడ్ రాజన్న దుఃఖాన్ని ఆపుకోలేక కండ్ల ధారలు చెంపల మీది నుండి వల వల పడసాగాయి. నాలుగు గజాల దూరంలో శత్రువులు ఎల్ఎంజితో మూలుగుతూ కంటపడ్డారు. కామ్రేడ్ రాజన్న కోపం కట్టలు తెంచుకొని ఒక్కసారిగా శత్రువుపై తూటాల వర్షం కురిపించాడు. మూలిగిన శత్రువులు ప్రాణం వదిలారు.

కామ్రేడ్ రాజన్న శత్రువుల దగ్గరి ఎల్ఎంజిలను తీసుకొచ్చాడు. అందుబాటులో శత్రువులు లేరని నిర్ధారించి కామ్రేడ్ నరేష్ ముఖం వైపు చూస్తూ ఒక్కసారిగా బోరున విలపించాడు. సంతోష్ మాత్రం దుఃఖాన్ని దిగమింగుతూ మృతదేహాన్ని తీసుకోకపోయే ప్రయత్నంలో ఉన్నాడు.

"కామ్రేడ్ ఏడ్వడానికి ఇది సమయం కాదు" అని సంతోష్ అనగానే..

ఎల్ఎంజిని ఒక భుజానికి తన ఆయుధాన్ని మరో భుజానికి తగిలించుకొని నరేష్ తలవైపు ఎత్తి పట్టాడు రాజన్న.

సంతోష్ కాళ్ళవైపు పట్టుకొని దేహాన్ని ఇద్దరు కొంత దూరం మోసుకెళ్ళారు.

అప్పటికే మిగతా సభ్యులు రెండు పార్టీలుగా విడిపోయి ఒక పార్టీ వీరిరాక కోసం ఎదురు చూస్తుంది. మరో పార్టీ ప్రయాణం ప్రారంభించింది. శత్రువు కూంబింగ్ ప్రారంభించే లోపే నరేష్ దేహాన్ని అక్కడనే ఇసుకలో పాతిపెట్టి రెండు నిమిషాలు మౌనం పాటించి దుఃఖాన్ని దిగమింగుకుంటూ ప్రయాణం ప్రారంభించారు. ఆ రోజంతా నడిచి అనుకున్న ప్రాంతానికి చేరుకొని డెన్ను వేసుకున్నారు.

దళం అంతా ఒక్క దగ్గర కూర్చొన్నారు. అందరి ముఖాల్లో కంటి ధారలే. ఒక్క ప్రసాదన్న, రామన్న మాత్రం ఆలోచనలతో నేలవైపు చూస్తూ కూర్చున్నారు.

కామ్రేడ్ నరేష్ అత్యుత్సాహం మూలంగానే అమరుడయ్యాడు. చిన్నబోయిన స్వరంతో ప్రసాదన్న మాట్లాడాడు. "నరేష్ తలపైకి లేపకు అని నేను కూడా మొత్తుకున్నాను" స్వరూపక్క గద్గద స్వరంతో కలిపింది.

వెంటనే రామన్న కల్పించుకుని కామ్రేడ్స్ ఈ రోజు మన సహచర కామ్రేడ్ అమరుడయ్యాడు. ఇది మనకు తీరని లోటు అయినప్పటికి విప్లవోద్యమంలో త్యాగాలు అనివార్యమేనంటూ ప్రసాదన్న సందేశమివ్వాలని కోరాడు.

కామ్రేడ్ ప్రసాదన్న పాలిపోయిన ముఖంతో కన్నీటి ధారలను కర్చీఫ్‌తో తుడ్చుకుంటూ ఎక్-47ను భుజానికి తగిలించి నిలబడి మాట్లాడడం మొదలుపెట్టాడు.

"కామ్రేడ్స్ - కామ్రేడ్ నరేష్ లాంటి ఉత్సాహం యుద్ధంలో అవసరమే. మనం ఎంతో కొంత రక్తం ధారపోయకుండా శత్రువును దెబ్బ తీయలేం. విప్లవోద్యమంలో అమరులు అజరామరులే. ఎపుడు అజేయులే. ఈ రోజు అమరుల త్యాగమే రేపు సాకారం కాబోయే నూతన ప్రజాస్వామిక విప్లవానికి నాంది. అమరత్వం లేకుండా ఏ దేశంలో విప్లవం విజయవంతం కాలేదు కాబట్టి కామ్రేడ్ నరేష్ త్యాగం వెలకట్టలేనిది. ఆయన కలలుగన్న రాజ్యం కోసం రెట్టింపైన ఉత్సాహంతో ముందుకెళ్ళడమే మనం అతనికి అర్పించే నివాళులు" అంటూ ముగించాడు.

# తెలంగాణ విప్లవ కథ 'పయిలం'

## మాతంగి

కొన్ని సందర్భాల్లో కొన్నిటిని విమర్శించేందుకు కొంత మంది భయపడతారు. కొంతమందే ఏం? చాలా మంది. బతుకమ్మ గురించి వ్యవస్థీకృత ఆలోచనలకు భిన్నంగా ఎవరైనా మాట్లాడితే బతికి బట్టకట్టే రోజులేనా ఇవి. అటూ ఇటూ అందరూ పీక్కుతినరూ? వ్యవస్థీకృత బతుకమ్మ మీద సామాజిక కోణంలో బలమైన విమర్శ పెట్టిన కథకుడు పి. చిన్నయ్య. ఈ బతుకమ్మ పైకులాలకు చెందినదని దళిత కోణంలో రాసిన అంటరాని బతుకమ్మ కథ అత్యద్భుతమైనది. ఈ పని ప్రత్యామ్నాయ ఆలోచనాధారలో ఉన్న వాళ్లే చేయగలరు. ఆ రోజుల్లో దొరల గడీల దగ్గర సాగే బతుకమ్మ ఆటను విప్లవకారులు వాడలోకి తీసుకరావడంలోనే ఈ ప్రత్యామ్నాయ సామాజిక కోణం ఉన్నది.



పయిలం
పి. చిన్నయ్య
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 50/-

ఇప్పుడు ఈ కథ గురించి కాదు.. ఇంత విస్పష్ట విప్లవ కంఠస్వరం పలికే చిన్నయ్య కథా సంకలనం 'పయిలం' గురించి. ఇందులో ఆయన తొలి దశ కథలు ఉన్నాయి. ఆయన రూపొందిన తీరు మనకు కనిపిస్తుంది. ఒక కార్యకర్త తనంతకు తానుగా కథకుడిగా మారాలనుకొని రాయడం మొదలు పెడితే ఎలా ఉంటుందో కూడా ఇందులో మనకు తెలుస్తుంది. ఈ ప్రక్రియను సొంతం ఈ కథల్లో చూడవచ్చు. ఇందులోని 'బండపగిలింది' అనే కథ చదవండి. పైన చెప్పిన 'బతుకమ్మ కథ' చదవండి. . చిన్నయ్య పరిణామం తెలుస్తుంది. ఎకాఎకిన ఏదో అవార్డు కొట్టేసి, నాలుగు సన్మానాలు పొంది మేటి కథకుల వరుసలోకి జొరబడుతున్న ఈ రోజుల్లో చాలా నిశ్శబ్దంగా ఉంటూ, కథలు రాస్తూ, ఒక కథ నుంచి మరో కథకు నేర్చుకుంటూ, పనీ, కథా మేలు కలయికగా సాగే చిన్నయ్య వికాసం 2005లో విడుదలైన ఈ సంపుటిలో చూడొచ్చు. నాలుగు కథలు రాయగానే అంతులేని ప్రశంసల జల్లులు కురిసే చోట ఏ ప్రశంసా ఆశించకుండా కథ రాయడమొక విప్లవాచరణగా సాగుతున్న వాళ్లలో చిన్నయ్య పేరు తప్పక చెప్పుకోవాలి.

బండ పగిలింది, చక్రవర్తి కూర, పీర్లపండగ.. మొదలైన వాటిలోని సామాజిక ఇతివృత్తాలు చిన్నయ్య విప్లవ కంఠస్వరంలో వినిపిస్తాయి. సాంఘిక అస్తిత్వ సంబంధమైన ఇతివృత్తాలు తీసుకొని కూడా దృక్పథం విషయంలో పొరబాటునైనా తొట్రుపాటుకు గురి కాని విప్లవ రచయిత చిన్నయ్య. ప్రజల రోజువారీ జీవితంలో, ఉద్యమ జీవితంలో ఎదురయ్యే సమస్యలను మానవ సంబంధాల వైపు నుంచి చూసి చిత్రించిన కథలివి. అంటే. . వైరుధ్యాలు, వాటి స్వభావం, వాటికి ప్రజాస్వామిక పరిష్కారం, ఈ క్రమంలో ప్రజల చైతన్య స్థాయి పెరగడం. . అనే తార్కిక క్రమాన్ని పాత్రల చిత్రణ ద్వారా చూపించడంలో రచయిత మెలకువ ఈ కథల్లో క్రమంగా పెరగుతూ రావడం గమనిస్తాం.

2005 తర్వాత చిన్నయ్య కథలు రాసే వేగం తగ్గి కథల్లో లోతు, విస్తృతి పెరిగింది. ఇది రెండో దశ అనవచ్చు. తెలంగాణ అస్తిత్వ రచయితలందరూ తెలంగాణ వర్సెస్ ఆంధ్ర(లేదా సీమాంధ్ర) అనే చట్రంలో అలవోకగా రాసేస్తోంటే చిన్నయ్య మెట్టభూమోడు అనే కథ రాశాడు. మొత్తంగా తెలంగాణకు అన్యాయం జరిగిన మాట వాస్తవమే. . అయితే నీటిపారుదల, వ్యవసాయ రంగాల్లో తెలంగాణ అంతర్గతంగా కూడా చాలా తేడాలు ఉన్నాయని, వాటి వల్ల తీవ్రమైన వెనుకబాటుతనం, అధిక్యత, చిన్నచూపు ఉన్నాయని ఈ కథ చెప్తుంది. నల్గొండ జిల్లాలోనే ఈ అసమానత మానవ సంబంధాల్లో ఎలా ఉన్నదో ఈ కథలో చిత్రించాడు. ఒకే ప్రాంతం లోపల అనేక వాస్తవాలు ఉంటాయని, అనేక అంతరాలు ఉంటాయని, వాటిని కేవల ప్రాంతీయ దృష్టితో చూసి సమగ్రంగా పట్టుకోలేమని, అంతకంటే లోతైన రాజకీయార్థిక దృష్టి ఉండాలని హెచ్చరించే కథ ఇది. మామూలుగా ప్రాంతీయవాదులకు ఇలాంటి ఇతివృత్తం కనిపిస్తుందా? ఈ దృక్పథంతో రాయగలరా? ఏమో. మానవ సంబంధాలన్నిటా ఏ రూపంలోనూ అసమానత ఉండరాదనే ఆదర్శం, దాన్ని నికరంగా తేల్చుకోగల రాజకీయార్థిక, తాత్విక దృష్టి ఉన్న రచయితలకే ఇలా రాయడం సాధ్యం.

'పయిలం' కథల్లో ఇతివృత్తాలు చాల సరళంగా ఉంటాయి. సాదాగా వాటిని చిత్రించాడు. మెట్టభూమోడు, అంటరాని బతుకమ్మ.. వంటి రెండో దశ కథలు 'పయిలం'లోని కథలకంటే చాలా గాఢమైనవి. ప్రగతిశీల శిబిరం అనబడే దానిలోనే స్థిరపడిపోయిన చాలా ఆలోచనలను ఆవలి వైపు నుంచి చూస్తూ రాసిన కథలివి. రచయిత విమర్శనాత్మక దృష్టిని పట్టించే కథలివి.

స్థల కాలబద్ధత విప్లవ కథ వ్యక్తిత్వంలోని ముఖ్య లక్షణం. వాస్తవానికి ఏ సాహిత్యానికైనా ఇది ఉండేదే. అలా లేని సాహిత్యాన్ని పెద్దగా ఎవరూ పట్టించుకోరు. అది పూర్తిగా వేరే రకం సాహిత్యం.

(మిగతా 30వ పేజీలో.. )

# భారతదేశంలో భావప్రకటనా స్వేచ్ఛ.. వాగ్దానం, ఆచరణ

పద్మజాషా

అనువాదం : పి. ఎస్. ఆర్. ప్రసాద్

భావప్రకటనా స్వేచ్ఛను ప్రజాస్వామిక ఆచరణకు అవసరమైన, తప్పని సరైన హక్కుగా భావిస్తారు ఎందుకు? జాతి రాజ్యంలోని ప్రజలందరి భావాలకు ప్రజాస్వామ్యంలో చోటు దొరుకుతుందనేది సూత్రం. భారత ప్రజాస్వామ్యం తనని తాను, ఒక సార్వభౌమత్వ, లౌకిక, సామ్యవాద, ప్రజాస్వామ్యంగా ప్రకటించుకుంది. రాజ్యాంగం, న్యాయం, సమానత్వం, సౌభ్రాతృత్వాలను వాగ్దానం చేసింది. 1950లో భారతదేశం, సంపూర్ణమైన సార్వభౌమత్వ, లౌకిక, ప్రజాస్వామిక దేశం కాదు. అప్పటికి దేశంలో న్యాయం, సమానత్వం, సౌభ్రాతృత్వం కూడా లేవు. రాజ్యాంగం, భారతదేశాన్ని పైన చెప్పినట్లుగా నిర్వచించటం అంటే, "ప్రజలమైన మనం," ఆ మూడు విలువలను సాధించటానికి పనిచేస్తామనే ఆశయాన్ని అంగీకరించటమే! ఆ ప్రయత్నాన్ని మనం ఇంకా చేస్తూనే ఉన్నాం గాని, విజయావకాశాలు సన్నగిల్లుతున్నాయి.

భారత ప్రజలు అంటే, ఎవరు? కాశ్మీర్, నాగాలాండ్, తమిళనాడు, పంజాబు, ఈ మధ్యకాలంలో బాంగ్లాదేశ్ సరిహద్దులో కొత్తగా భారత పౌరసత్వాన్ని పొందినవారు, భారతదేశానికి వెలుపల ప్రత్యేక రాజ్యంగా ఉండాలనుకునేవారు, వీరంతా ఆ ప్రజలకిందకు వస్తారు. ఈ ఉపఖండంలో వలసపాలనలో కూడా, చారిత్రకంగా సార్వభౌమత్వాన్ని అనుభవించిన అనేక మూలవాసీ తెగల ప్రజలున్నారు. ఇలాంటి జాతులను, ఉపజాతులను ఏదో ఒక రకంగా దగ్గరకు చేరిస్తే భారతజాతి రూపొందింది. దీనికితోడు, స్వాతంత్ర్య సమయంలో 565 సంస్థానాలను దేశంలో విలీనం చేశారు. రాజ్యాంగం ఏ ఒక్క పాలకుడుకీ, రాజుకీ, దేవుడికీ కాకుండా, ఇలాంటి భారత ప్రజలకు సార్వభౌమత్వాన్ని ఇచ్చింది.

రాజ్యాంగ ఆదర్శాలైన సార్వభౌమత్వ, లౌకిక, సామ్యవాద, గణతంత్రాన్ని సాధించాలంటే, పౌరులు-ఆర్థికవ్యవస్థలోనూ, పౌరపాలనా వ్యవస్థలోనూ, సమాజంలోనూ ఉన్న పరస్పర భిన్న ప్రయోజనాలను, వైరుధ్యాలను పరిష్కరించుకోవాలి. ఈ క్రమాన్ని చర్చల ద్వారా ఆచరణ సాధ్యం చేయటం కోసం, భావప్రకటనా స్వేచ్ఛ ఒక హక్కుగా ఉండాలి. తీవ్రమైన సాంఘిక, ఆర్థిక అసమానతలు కొనసాగుతూ, జాతులకు, అస్తిత్వాలకు సంబంధించిన అనేక సమస్యలున్న భారతదేశంలో ఇది ప్రత్యేకించి ఒక హక్కుగా గుర్తించబడాలి. భావప్రకటనా స్వేచ్ఛను, ప్రజాస్వామ్యం ఫలితంగా మనం భావించకూడదు. దాన్ని ప్రజాస్వామ్యానికి ఒక ముందస్తు షరతుగా చూడాలి. రాజ్యాంగంలో పేర్కొన్న ప్రజాస్వామిక ఆకాంక్షల సాధనకు, విమర్శనాత్మక, హేతుబద్ధచర్చ," (Habermas) అవకాశం కల్పిస్తుంది. స్వేచ్ఛాయుతమైన వాతావరణంలో చర్చించటానికి అవకాశం లేకపోతే, రాజ్యాంగ లక్ష్యాలను సాధించలేం.

**సవాలుకు మొదటి స్పందన :**

1950లో రాజ్యాంగాన్ని ఆమోదించిన కొద్ది నెలలకే, భావప్రకటనా హక్కుకు, రెండు సవాళ్ళు ఎదురయ్యాయి. రాజ్యాంగ లక్ష్యాలైన, సమానత్వం, సౌభ్రాతృత్వాలకు సంబంధించిన సవాళ్ళవి. అందులో ఒకటి, వామపక్షభావజాల ప్రచారానికి సంబంధించింది. రెండవది, ముస్లింలపట్ల ద్వేషాన్ని వ్యాపింపజేయుటానికి సంబంధించింది.

మద్రాసు ప్రభుత్వం, 1950లో మద్రాసు శాంతిభద్రతల నిర్వహణా చట్టం, 1949 కింద రమేష్ థాపర్ సంపాదకత్వంలో ముంబై నుండి వెలువడుతున్న "క్రాస్‌రోడ్స్" అనే వామపక్ష పత్రిక, ఆ రాష్ట్రంలో ప్రవేశించటాన్ని, పంపిణీని నిషేధించింది. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం తర్వాత, అప్పటి మద్రాసు రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. ప్రభుత్వ విధానాలను ప్రశ్నించే వామపక్ష సాహిత్య పంపిణీని నిరోధించాలని రాష్ట్ర ప్రభుత్వం భావించింది. తెలంగాణ సాయుధ పోరాటం, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం. భూపంపిణీ, సమానత్వం, లౌకిక సమాజస్థాపన వారి డిమాండ్లు.

రెండవ కేసు, ఆర్. ఎస్. ఎస్. పత్రిక 'ఆర్గనైజర్'కు సంబంధించింది. ఆ పత్రిక, దేశవిభజన అనంతరం ముస్లిం ప్రజలకు వ్యతిరేకంగా, రెచ్చగొట్టే కథనాలను ప్రచురించింది. ఆ పత్రిక తాను ప్రచురించే అన్ని మత సంబంధమైన అంశాలకు, ముందుగా ప్రభుత్వ అనుమతి పొందాలని కోరుతూ, తూర్పుపంజాబు ప్రజాభద్రతా చట్టం 1949 కింద ఢిల్లీ ప్రభుత్వం ఆదేశం జారీచేసింది.

"ప్రజాభద్రత, ప్రజారక్షణ" అనే అంశాలు రాజ్యాంగంలోని, 19(2) నిబంధనలో లేవని, "రాజ్యభద్రతకు ప్రమాదం కలిగించే లేదా రాజ్యాన్ని కూలదోయ సంకల్పించే," చర్యలను ఉద్దేశించి మాత్రమే భావప్రకటనా స్వేచ్ఛను, పరిమితం చేయవచ్చుతప్ప, ఇతరత్రా కాదని సుప్రీంకోర్టు ఈ రెండు వివాదాలలోనూ అభిప్రాయపడింది.

19(1) (ఎ) నిబంధనను, ప్రజాభద్రతా చట్టాలలోని పదాలను, సాంకేతికంగా పరిశీలించిన తర్వాత, భావప్రకటనా స్వేచ్ఛను

అరికట్టటానికి యీ తీర్పు అనుమతించ లేదు. అయితే, 'క్రాస్‌రోడ్స్' పత్రిక, రాజ్యాంగ లక్ష్యాలైన సమానత్వం, ఆర్థిక, సాంఘిక న్యాయం అనే సూత్రాలను ప్రచారం చేస్తుండగా, "ఆర్గనైజర్" పత్రిక ప్రధాన ఉద్దేశ్యం, రాజ్యాంగ ప్రాథమిక ఆశయమైన, సౌభ్రాతృత్వాన్ని ఉల్లంఘిస్తూ వివిధ మతాల ప్రజల మధ్య విద్వేషాన్ని రెచ్చగొట్టటం. చట్టాలను వ్యాఖ్యానించేటప్పుడు కేవలం, టెక్నికల్ దృక్పథాన్ని అనుసరించటం, "నేరాలన్నింటిని" తప్పుగా ఒకే గాటన కట్టటం, ఇప్పటికీ భారతదేశంలో కొనసాగుతోంది.

ఈ తీర్పుల కారణంగా, మొదటి రాజ్యాంగ సవరణ జరిగింది (1951). ఈ సవరణను ప్రతిపాదిస్తూ, దాని లక్ష్యాలను, కారణాలను వివరిస్తూ, 1951లో నెహ్రూ యిలా అన్నారు. "19(1) (ఎ) నిబంధన కింద కల్పించబడిన భావప్రకటనా స్వేచ్ఛ, అపరిమితమైనదనీ ఒక వ్యక్తి హత్య, హింసాయుత నేరాలను ప్రోత్సహిస్తున్నప్పటికీ, అతడిపై చర్య తీసుకోవటానికి అవకాశంలేనట్లుగా కొన్ని న్యాయ స్థానాలు భావిస్తున్నాయి. లిఖిత రాజ్యాంగాలుగల ఇతర దేశాలలో భావప్రకటనా స్వేచ్ఛ, ఆ స్వేచ్ఛను దుర్వినియోగం చేసే వ్యక్తులను నిరోధించటానికి, శిక్షించటానికి రాజ్యానికి ఆటంకం కాదు."

ఈ సవరణ ఫలితంగా "రాజ్యభద్రత", "ప్రజాభద్రత", "నేరానికి పురికొల్పటం" వంటి పరిమితులు రాజ్యాంగంలో చేరాయి. ఈ సవరణ ఫలితంగా, భావప్రకటనా స్వేచ్ఛకు ఆటంకం ఏర్పడుతుందని వ్యక్తమైన ఆందోళనను తొలగించటానికి ఈ పరిమితులకు ముందు, "సహేతుకమైన" అనే పదాన్ని చేర్చారు.

మొదటి సవరణ ఆమోదించబడిన వెంటనే, 1951లో "ఎస్. అనంతకృష్ణ వర్సెస్ స్టేట్ ఆఫ్ మద్రాస్ 19, అక్టోబరు 1951" అనే కేసులో, న్యాయమూర్తి రాజమన్నార్, బ్రిటిష్ న్యాయసూత్రాన్ని ఉదహరిస్తూ ఇలా అన్నారు. "స్వేచ్ఛాయుత దేశానికి పత్రికా స్వాతంత్ర్యం నిజంగా తప్పనిసరి. దీని అర్థం, ప్రచురణలపైన ముందుస్తు పరిమితులు విధించకూడదు. అంతేగాని, ఒక నేరపూరిత అంశం ప్రచురించబడ్డాక, అభిశంసించబడకుండా ఉండే స్వేచ్ఛ మాత్రం కాదు. తాను నమ్మిన మనోభావాలను, ప్రజల ముందు ఉంచే హక్కు ప్రతి స్వతంత్ర పౌరుడుకి నిస్సందేహంగా ఉంది. దీన్ని అరికట్టటమంటే, పత్రికా స్వాతంత్ర్యాన్ని నాశనం చేయటమే! అయితే, అతడు ప్రచురించిన అంశం ఉపయుక్తమైనది కాకపోయినా చట్టవ్యతిరేకమైనదైనా, అతడు తన చర్యలకు, తాను బాధ్యత వహించాల్సి ఉంటుంది." (4 B1. Com., 151, 152).

భావప్రకటనా స్వేచ్ఛతో, ఎలా వ్యవహరించాలనే అంశంపై, న్యాయస్థానాలు ఉదారవాద వైఖరిని తీసుకుంటూ ఉంటే, భారతప్రభుత్వం, అసమ్మతిపట్ల వ్యవహరించటంలో విచిత్రమైన పద్ధతులను అవలంబిస్తున్నది. మతతత్వంపట్ల ఒక వైఖరి, రాజకీయ, ఆర్థిక అసమ్మతిపట్ల మరొక భిన్నమైన వైఖరి రాజ్యానికి ఉన్నట్లు అనిపిస్తున్నది.

ముందుగా మతతత్వం : కాంగ్రెస్‌వంటి ప్రధానస్రవంతి రాజకీయ పార్టీలు, మతతత్వాన్ని, మతమౌఢ్యంతో దానికున్న లోతైన సంబంధాలను గురించి ఆలోచించే క్రమంలో, మతంతో ముడిపడి ఉన్న మెజారిటీ మతస్తుల మనోభావాలను కించపరచకుండా వుంటానికి ప్రయత్నిస్తున్నాయి. ఎన్నికలలో మెజారిటీ మతస్తుల ఓట్లు తమకు దక్కవేమోననే భయమే దీనికి కారణం. ఆర్. ఎస్. ఎస్. , దాని అనుబంధ సంస్థలు, యితర మతాలకు చెందిన ఛాందస వాద బృందాలు గతకొద్ది సంవత్సరాలుగా ఆయా మతాల ప్రజలను ఓటు బ్యాంకులుగా మార్చుకున్నాయి. ఇవన్నీ, ఛాందసవాద మనోభావాలకనుగుణంగా జాతిప్రయోజనాలను నిర్వచిస్తున్నాయి.

స్వాతంత్ర్యానంతర తొలిదినాల నుండి ఈ బృందాలు, పరస్పర విద్వేషాన్ని రెచ్చగొట్టే తీవ్రమైన ఉపన్యాసాలు చేస్తూ, భావప్రకటనా స్వేచ్ఛపై సవాళ్ళు విసురుతున్నాయి. ఈ హిందుత్వ, ఇతర ఛాందసవాద బృందాల, దాడికి, ప్రతిఘటన కుప్పకూలి పోయింది. మత ఛాందసవాదంతోకూడిన, పరస్పర విద్వేషకర ఉపన్యాసాలు చేసే ఇలాంటి బజారు మూకలే ఒక పుస్తకంగాని ఒక సినిమాగాని, సంగీతంగాని, ప్రదర్శించబడాలా లేదా అని నిర్ణయించే స్థితికి న్యాయస్థానాలూ, పాలనా వ్యవస్థ చేరాయి. ఈ ఛాందస వాదుల రాజకీయ బాధితుల హక్కులను రక్షించే కర్తవ్యాన్ని రాజ్య అంగాలన్నీ వదులుకున్నాయి. ఇదే నేటి స్థితి.

ఇతరుల మత మనోభావాలను, దెబ్బతీసే వ్యక్తులకు జైలుశిక్ష విధించే శిక్షాస్మృతిలో 295 (ఎ) అంశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం 1927లో ప్రవేశపెట్టింది. దీన్ని గురించి మాట్లాడుతూ, అమర్త్యసేన్ ఇలా అన్నారు. "సంఘటితమైన పీడకులు" తమ మనోభావాలను దెబ్బతీసే హక్కు ఎవరికీ లేదని ఊహాత్మకంగా భావిస్తున్నారు. (ఈ ఊహాత్మకహక్కు ఇలాంటి నిర్దిష్ట రూపంలో ఏ ఇతర దేశంలోనూ లేదు."

ఈ సందర్భంగా యిటీవలి కొన్ని ఉదాహరణలను గుర్తుకు తెచ్చుకుందాం. ఆర్. ఎస్. ఎస్. అధికార పత్రిక "పాంచజన్య", "దాద్రి"లో మహమ్మద్ అఖ్లాక్ హత్యకు సంబంధించిన ముఖచిత్రకథనాన్ని ప్రచురించింది. ఆవు మాంసం తిన్నాడన్న పుకారు కారణంగా, అఖ్లాక్‌ను హత్యచేయటం, "నిర్హేతుకం కాదని, ఆవు మాంసం తిన్నవాళ్ళని చంపవచ్చని వేదాలుకూడా రాశాయని," ఆ కథనంలో వాదించింది. ఆ వాదనను సమర్థిస్తూ, కొందరు ప్రజాప్రతినిధులు కూడా ఇలాంటి ప్రకటనలే చేశారు. ఈ ప్రకటనలన్నీ నేరుగా హింసను పురికొల్పటం, హత్యను ప్రేరేపించటమే! ఇవి దేశంలోని క్రిమినల్ చట్టాల కనుగుణంగా శిక్షించబడాల్సినవి. అయినా ఎటువంటి చర్యలూ ప్రారంభం కాలేదు. దీనిమూలంగా మనోభావాలు దెబ్బతినలేదా?

రాజ్యాంగ రక్షణ, చట్టబద్ధమైన పరిష్కార మార్గాలు అందుబాటులో ఉన్నప్పటికీ, భావప్రకటనా స్వేచ్ఛ ముసుగులో నేరాలకు పాల్పడుతున్న వ్యక్తులపై చర్యలు తీసుకోవటంలో రాజ్యం అనేక పర్యాయాలుగా విఫలమైందనేది వాస్తవం. ఆ పత్రికపైనగాని, రచయితపైనగాని, సంపాదకునిపైనగాని కేసులు పెట్టలేదు. నేరాన్ని బహిరంగంగా ప్రోత్సహించిన ఎన్నికైన ప్రతినిధులపై ఏ చర్యలూ ప్రారంభం కాలేదు. నిజానికిదేమీ కొత్తకాదు. గడచిన సంవత్సరాలుగా భారతదేశంలో, రాజ్యం రూపొందుతున్న తీరే ఇది.

రాజ్యం స్పందన ఇంత బలహీనంగా ఉండబట్టే మతఛాందస వాదం పెరిగింది. అంతేకాదు, దీని పెరుగుదల, ప్రపంచ వాణిజ్యీకరణ పెరుగుదలతో కలిసి కొనసాగింది. జాతి రాజ్యాల సార్వభౌమాధికారాన్ని, ఏ మాత్రం లెక్క చేయకుండా ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలను, ప్రపంచ పెట్టుబడి కబళించి వేస్తూ ఉంటే, దాన్నుండి ప్రజలదృష్టిని మరల్చటానికి, స్పెక్యులేషన్ పెట్టుబడి మతాన్ని ఒకసాధనంగా, ముసుగుగా వాడుకుంటోంది. ఇది ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో, సృష్టించబడిన తెగల తగాదాలు, యుద్ధాల రూపంలో జరిగితే, ఇతర ప్రాంతాలలో ఇది, ప్రపంచ మీడియా మెరుపుదాడి ద్వారా సాధించబడింది. మతతత్వ ప్రచారకులకు, వ్యాపారీకరించబడిన ప్రసారసాధనాలు, ఇష్టపూర్వకంగానే ప్రచారసాధనాలుగా మారిపోయాయి. వాళ్ళు, తమ అనుయాయులను ప్రపంచ పెట్టుబడి మద్దతుదారులుగా, త్వరితంగా మార్చటానికి ఈ ప్రచార సాధనాలు ఉపయోగ పడుతున్నాయి.

### రాజ్యం, మీడియా స్వభావం :

భారత ఆర్థిక వ్యవస్థలో, 1980లలో ప్రారంభమై 1990లలో మరింత తీవ్రమైన మార్పుల ఫలితంగా దేశ రాజకీయ చిత్రపటం వేగంగా మారింది. వ్యవసాయరంగంలోనూ, ఉత్పత్తి రంగంలో ఉద్యోగాల పెరుగుదలలోనూ తరుగుదల, సేవారంగంలో ఆకస్మిక అభివృద్ధి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. బ్యాంకేతర ఫైనాన్స్, రియల్ ఎస్టేట్‌వంటి స్పెక్యులేషన్ స్వభావంగల సేవారంగంలో వచ్చిన ఆకస్మిక అభివృద్ధి ఒక నూతన రాజకీయ సంస్కృతిని అధికారంలోకి నెట్టింది. ఈ దశలో ఆవిష్కృతమైన ప్రపంచ వ్యాప్త వ్యాపార, ద్రవ్య నెట్ వర్క్‌లు నేర స్పెక్యులేటివ్ నెట్ వర్క్‌లతో సమాంతరంగా నడిచాయి. ఆర్థిక వ్యవస్థ ద్రవ్యీకరణ చెందింది.

1990ల నుండి టెలివిజన్, రేడియో పరిశ్రమలలో ప్రైవేట్ వ్యాపారం చొరబడటంతో మీడియా పరిశ్రమ కూడా వ్యాప్తిచెందటం ప్రారంభమవ్వింది. కొత్తగా వ్యాప్తి చెందుతున్న ఈ పరిశ్రమలో ఎక్కువ భాగం పెట్టుబడి, యాజమాన్యం - బ్యాంకింగ్ ఇతర ఆర్థిక సంస్థల నుండి, రియల్ ఎస్టేట్‌ల నుండి వచ్చిన పెట్టుబడుల చేతుల్లోకి మళ్ళింది. ఉదాహరణకు తెలుగులో 24 న్యూస్ ఛానెళ్ళు ఉండగా, మూడు తప్ప మిగతా అన్నింటిలోనూ, పెట్టుబడులు బ్యాంకింగేతర ఆర్థిక సంస్థలు, వసతుల కల్పనారంగం, రియల్ ఎస్టేట్ రంగానికి చెందినవి. హెచ్6 అనే ఒక్క ఛానల్‌ను నిర్వహిస్తున్నది మాత్రం ఉత్పత్తి రంగానికి సంబంధించినవారు. సి. పి. ఐ. 99 టి. వి. అనే ఛానల్‌ను, సి. పి. ఎం., 10 టి. వి. అనే ఛానల్‌ను ఏర్పాటు చేశాయి. ఈ న్యూస్ ఛానళ్ళన్నింటికి ఎక్కువగా ప్రత్యక్షంగానూ, కొన్ని సందర్భాల్లో పరోక్షంగాను రాజకీయ సంబంధాలున్నాయి.

1990ల నుండి, బడా పెట్టుబడి, బడా మతం, బడా మీడియాల మధ్య ప్రపంచవ్యాప్తంగా ఇచ్చిపుచ్చుకోవటం ప్రారంభమైంది. ప్రపంచీకరణ రాజకీయ, ఆర్థిక వ్యవస్థలో ఆధునికానంతర రాజ్యం, పైనుండి ఒక్కటి కిందనుండి ఒక్కటిగా వున్న రెండు దాడులను ఎదుర్కొంటోందని 'నిల్స్‌గిల్‌మన్' అన్నారు. ఖండాంతర సంపన్న కూటమి, దేశ ఆర్థిక వ్యవస్థను కంట్రోల్ చేస్తున్న వారి మిత్రులనుండి వస్తున్న దాడి, పై నుండి వస్తున్న దాడి. కిందినుండి వస్తున్న దాడికి, ఖండాంతర నేర నెట్‌వర్క్‌లు, మానవ వ్యాపారం చేసే వారు, మాదకద్రవ్యాల వ్యాపారులు నాయకత్వం వహిస్తున్నారు. వీళ్ళు చట్టానికి దొరక్కుండా అజ్ఞాతంగా పనిచేస్తుంటారు. ఈ రెండిట్లో ఏ ఒక్క శక్తే రాజ్యాన్ని కూలద్రోయాలనిగాని, అధికారాన్ని స్వాధీనం చేసుకోవాలని గాని కోరుకోవని గిల్‌మన్ అన్నారు. ఈ రెండూ, రాజ్యాన్ని రక్షించాలని కోరుకుంటాయి. అదే సమయంలో దాన్ని తమ ఆధిపత్యంలో ఉంచుకొని, చట్టాల్ని, నిబంధనల్ని ప్రభావితం చేస్తూ, తమ స్వయం ప్రతిపత్తిని పెంచుకోవటానికి రాజ్యాన్ని వాడుకోవాలని చూస్తాయి. ఈ శక్తులు, రాజ్యాన్ని, ఆర్థిక, సాంఘిక మితవాదపు పనిముట్టుగా మార్చివేశాయి. అవి అలాచేయటంద్వారా, రాజ్యాంగపు ఆదర్శాలను ఆచరణసాధ్యంగాని ఆదర్శాలుగా వెక్కిరిస్తున్నాయి.

భారతదేశం వంటి బూర్జువా ప్రజాస్వామిక దేశాలలో మీడియా పరిశ్రమ, కులీన వర్గాలకూ, దొంగచాటుగా నడిచే వ్యాపారాలకూ, అనుషంగిక వ్యాపార సంస్థలుగా పనిచేస్తున్నాయి. మీడియా పరిశ్రమ రాజ్యంలో తన స్వయంప్రతిపత్తిని కాపాడు కోవటానికీ, వ్యాప్తి చేసుకోవటానికీ ప్రయత్నిస్తూనే రాజ్యాంగ విలువలపై ప్రమాణం చేస్తున్నది. తనపైన ఎటువంటి నియంత్రణా లేకుండా చేసుకోవటం ద్వారా మీడియా పరిశ్రమ శక్తివంతంగా ఎదిగింది. కులీన వర్గాలూ, ఛాయా ఆర్థిక వ్యవస్థలో ఉన్న అజ్ఞాత శక్తులు, తమ స్వయంప్రతిపత్తిని పెంచుకోవటానికి వీలుగా మీడియా పరిశ్రమ తన శక్తియుక్తుల్ని ఉపయోగిస్తున్నది. ఈ శక్తుల ప్రయోజనాలకు ఊడిగం చేసేదిగా మాత్రమే రాజ్యం మిగిలిపోయింది. రాజ్యాంగంలో ఉన్న సమత్వపు దృష్టి, అందులో పొందు పరచిన విలువలపైన జరుగుతున్న దాడి ఇది.

ఛత్తీస్‌ఘర్, ఒరిస్సా వంటి రాష్ట్రాలలో ప్రకృతి వనరులను ప్రైవేట్ పెట్టుబడులకు కేటాయించినప్పుడు, దానిమూలంగా దెబ్బతిన్న ప్రజల ప్రతిస్పందన-రాజ్యం ఆ వనరుల కోసం పోటీపడుతున్న కులీన బృందాల ప్రయోజనాలను - ఈ కులీన బృందాల ప్రయోజనాలను కాపాడడానికి ఆ ప్రాంతాల్లో వున్న పారా మిలిటరీ బలగాల పాత్ర - ప్రజల నిరసనను పాశవికంగా అణిచివేస్తూ తామనుకున్న రీతిలో అక్కడికక్కడే తీర్పులు చెప్పి అమలు చేస్తూ, ఎవరికీ జవాబుదారీ కాకుండా ఉన్న సల్వాజుడుం వంటి ప్రైవేట్ సైన్యాలు - ఇవన్నీ ఇప్పుడు భారత రాజ్యస్వభావాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

అవసరమైన సమాచారాన్ని అందించకుండా కుటిలయత్నాలు జరుగుతున్నాయి. ప్రజారంగంలో పనిచేసే కొన్ని బృందాల గొంతునొక్కివేయబడుతున్నది. ఛత్తీస్‌ఘర్, కాశ్మీర్, ఈశాన్య భారతంలోని కొన్ని ప్రాంతాలు, పూర్తిగా రక్షణ బృందాల అధీనంలో ఉన్నాయి. పత్రికా విలేఖరులనుగాని, పౌర సమాజసభ్యులనుగాని అక్కడకు ప్రవేశించనివ్వటం లేదు. ప్రజల హక్కుల్ని కాపాడాలని కోరుకునే న్యాయవాదుల్ని ఆ ప్రాంతాలలో పనిచేయనివ్వటంలేదు. పారామిలిటరీ, ప్రత్యేక పోలీసు బలగాల కార్యకలాపాలకు సంబంధించిన ఎలాంటి సమాచారాన్ని రిపోర్టు చేయనివ్వటంలేదు. జీవించే హక్కు, స్వేచ్ఛహక్కు, సంఘనిర్మాణ హక్కువంటి

ప్రాథమిక హక్కులన్నింటినీ సస్పెండ్ చేశారు. ఆ ప్రాంతాల్లో పనిచేస్తున్న సంస్థల భావప్రకటనా స్వేచ్ఛను సస్పెండ్ చేయటంద్వారా చివరికి ప్రజాస్వామ్యాన్నే సస్పెండ్ చేశారు. ఈ ప్రాంతాల్లో పనిచేస్తున్న జర్నలిస్టులపై తీవ్రమైన వత్తిడి వస్తున్నది. అరెస్టుల్నీ భౌతికదాడుల్నీ ఎదుర్కొంటున్నారు.

మీడియాలోని కొన్ని సెక్షన్లు, తమంతటతామే విధించుకున్న మౌనాన్ని పాటిస్తున్నాయి. మీడియాలో ప్రధాన భాగాలన్నీ కులీన వర్గాల యాజమాన్యంలోవున్నవే. లేదా వాటి వర్గ ప్రయోజనాలతో కలిసి ప్రయాణిస్తున్నవే! కొన్ని మీడియా సంస్థలు, నేరుగా గనుల వ్యాపారస్తుల స్వాధీనంలో ఉన్నాయి. మరికొన్నింటిలో వాటి పెట్టుబడివుంది. ప్రకటనల ద్వారా వచ్చే ఆదాయం కోసం కూడా, మీడియా యీ కార్పొరేట్ సంస్థల మీద ప్రధానంగా ఆధారపడుతోంది. ప్రజల ప్రజాస్వామిక హక్కులను కాపాడటం కోసం భావప్రకటనా స్వేచ్ఛను వినియోగించుకోవటం మీడియాకు అంతతేలికకాదు.

### మీడియాలో పాశవిక చట్టాలు, హక్కుల గురించిన సంభాషణ :

రాజద్రోహ చట్టం, ప్రజాభద్రతా చట్టాలకు తోడు, రాజ్యం, సాయుధ బలగాల ప్రత్యేక రక్షణ చట్టం AFSPA, చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం, UAPA వంటి పాశవిక చట్టాలను కూడా తీసుకువచ్చింది. రాజ్యాన్ని, దాని ఆర్థికవ్యూహాలను, ప్రశ్నించే కార్యకర్తలనూ, వాళ్ళ సానుభూతిపరులుగా అనుమానిస్తున్న వారిని, నాన్‌బెయిలబుల్ నేరాలకింద నిర్విచక్షణగా అరెస్టు చేయటానికి, నిరవధికంగా నిర్బంధంలో ఉంచడానికీ, చిత్రహింసలు పెట్టటానికీ, హత్యచేయటానికి రాజ్యం ఈ చట్టాలను వాడుకుంటున్నది.

గతకొన్ని దశాబ్దాలుగా, చత్తీస్‌ఘర్‌లోని లోతట్టుప్రాంతాలలో, వైద్య సేవలందిస్తున్న, చిన్న పిల్లల వైద్యుడు, డాక్టర్ బినాయక్ సేన్‌ను, ఉత్తరాలందిస్తున్నాడన్న నెపంతో, రాజద్రోహ చట్టంకింద అరెస్టుచేసి, యావజ్జీవ శిక్ష విధించారు. ఆయన నిర్బంధానికి వ్యతిరేకంగా, అంతర్జాతీయ నిరసన వ్యక్తం కావటంతో బెయిల్ ఇచ్చారు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఇంగ్లిష్ ప్రొఫెసర్ జి. ఎన్. సాయిబాబాను కూడా నిర్హేతుక కారణాలపై నిర్బంధించి, మధ్య, మధ్య బెయిలిస్తూ సుదీర్ఘకాలంగా జైల్లో ఉంచారు. కేవలం కొన్ని రాజకీయ అభిప్రాయాలను కలిగివున్నందుకే వాళ్ళిద్దర్నీ అంతకాలం నిర్బంధంలో వుంచారు. ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని హింసను ప్రేరేపిస్తున్నారన్న ఆరోపణ ఆ ఇద్దరిలో ఎవ్వరి మీదా లేదు. యుఏపిఏ, ఎఎఫ్ఎస్‌పి, రాజద్రోహ చట్టంవంటి పాశవిక చట్టాల కింద అరెస్టుకాబడిన వారికి, రాజ్యాంగం గ్యారంటీ చేసిన భావప్రకటనా స్వేచ్ఛ వర్తించటంలేదు.

అరూప్ భుయాన్ వర్సెస్ స్టేట్ ఆఫ్ అస్సాం కేసులో 2011, ఫిబ్రవరి, 23న తీర్పు చెప్తూ, న్యాయమూర్తి మార్కండేయ ఖట్జూ "సంస్థలో సభ్యత్వాన్ని కలిగివుండటమే నేరమనే" సిద్ధాంతాన్ని తిరస్కరించారు. ఈ సిద్ధాంతం ప్రకారం, వ్యక్తులు, తాము హింసను ప్రచారం చేయకపోయినా, హింసాత్మక చర్యలలో పాల్గొనక పోయినా, కేవలం ఒక సంస్థలో సభ్యులైన కారణంగానే శిక్షించబడవచ్చును.

రాజ్యాంగ పరిషత్తు సభ్యుడైన, సోమనాథ్‌లహరి, దాని చర్చలలో పాల్గొంటూ, భవిష్యత్తును ఖచ్చితంగా వూహించినట్లుగా ఇలా ప్రసంగించారు. "ప్రాథమిక హక్కులలో చాలా వాటిని, పోలీస్ కానిస్టేబుల్ దృష్టికోణంనుండి రూపొందించినట్లుగా నేను భావిస్తున్నాను. అలాంటి సూత్రాలన్నింటినీ ఇందులో చేర్చారు. హక్కులకు సంబంధించిన ప్రతి నిబంధనలోనూ, ఆ హక్కును దాదాపుగా, సంపూర్ణంగా వెనక్కు తీసేసుకునే నిబంధనలున్నాయి. తీవ్రమైన అత్యవసర పరిస్థితిలో ఈ హక్కుల్ని, ఉప సంహరించ వచ్చని అందులో ప్రతిచోటా ఉంది. అధ్యక్షా! తీవ్ర అత్యవసర పరిస్థితి అంటే ఏమిటి? దేవుడికే తెలియాలి! అది ఒక నిర్దిష్ట సమయంలో అధికారంలో ఉన్న ప్రభుత్వ ఇష్టాఇష్టాలమీద ఆధారపడి ఉంటుంది." (సోమనాథలహరి, రాజ్యాంగ పరిషత్తు చర్చలు 29. 04. 1947. )

మీడియాలో హక్కులకు సంబంధించిన సంభాషణా క్రమంలో, మనుషుల్ని మనుషులుగా గౌరవించాలనే ప్రాథమిక నీతి కనీసంగాకూడా లేకుండాపోయింది. కార్పొరేట్ మీడియా సంస్థలు, తమకు లొంగిపోయిన రాజ్యం గురించి, అధికార పీఠానికి దగ్గిరగా వుండి లాభాలు సంపాదిస్తున్న కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల గురించి, ఒక పక్క ప్రచారం చేస్తూ, మరో పక్క న్యాయస్థానాల వెలుపల న్యాయనిర్ణేతలుగా వ్యవహరిస్తున్న ప్రైవేట్ సైన్యాల గురించి అనుకూలంగా వాదిస్తున్నవి.

బూటకపు ఎన్‌కౌంటర్ల గురించి జరుగుతున్న చర్చల పర్వాన్ని గురించి రాస్తూ అమితవపాండే ఇలా అన్నారు. "విలువలన్నీ, పూర్తిగా తుంగలో తొక్కి వేయటాన్ని కూడా గమనించలేని స్థితిలో మనం వుండటం బాధాకరం. ప్రజల భద్రతకు ప్రాధాన్యత నీయకుండా - రాజ్యభద్రత, రాజ్యయంత్రాంగ భద్రతతో, రాజ్యయంత్రాంగాన్ని కంట్రోల్ చేసే వ్యక్తుల భద్రతతో దాన్ని సమం చేసి చూస్తున్నారు. ప్రజల సార్వభౌమత్వాన్ని రాజ్యసార్వ భౌమత్వంతో, దాని ప్రాదేశిక సమగ్రతతో సమం చేసి చూస్తున్నారు. రక్షణను ప్రజాభద్రతతో ప్రజాస్వామ్యంతో సమం చేసి చూస్తున్నారు. రాజ్యాంగం గ్యారంటీ చేసిన స్వేచ్ఛలను అనుభవించటాన్ని రాజ్యభద్రతకు ప్రమాదంగా భావిస్తున్నారు." (అమితవపాండే, 2016, బూటకపు ఎన్‌కౌంటర్లు సాధారణమైనవిగా, చట్టబద్ధమైనవిగా, సమర్థనీయమైనవిగా చూడబడుతున్నాయి. )

బూటకపు ఎదురుకాల్పుల్లో, పౌరులను హత్యచేసిన ఘటనలకు, పారామిలిటరీ బలగాలనుగానీ, సైన్యాన్నిగాని, న్యాయస్థానం బాధ్యుల్ని చేయటం చాలా అరుదైన విషయం. వనరుల రీత్యా సంపన్నమైన ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజల జీవించే హక్కును - ఆ హక్కును కాపాడవలసిన సంస్థలు, రాజ్యాంగం భావించినట్లుగా పవిత్రమైనవిగా భావించటంలేదు, కాపాడే ప్రయత్నమూ చేయటంలేదు.

గిల్‌మన్ వర్ణించిన ఆ రెండు దాడులు, రాజ్యాంగ వాంఛలకు, వాస్తవంలో ప్రజల జీవితాలకూ మధ్య ఉన్న లోతైన అగడ్తను బహిరంగం చేస్తున్నాయి. రాజ్యాంగం, జీవించే హక్కు, వివక్షతల నుండి స్వేచ్ఛ, మతస్వేచ్ఛ, సమావేశ స్వేచ్ఛ, భావప్రకటనా

స్వేచ్ఛలను గ్యారంటీ చేసింది. అధికారంలోవున్న ప్రధానపార్టీలు, వాటి స్వభావరీత్యా బూర్జువా ప్రజాస్వామిక పార్టీలు కావటంచేత, దేశంలో ఉన్న ఆధిపత్య రాజకీయ, ఆర్థిక శక్తులతో బేరసారా లాడుతూ రాజీపడుతున్నాయి. ఈ క్రమంలో రాజ్యాంగంలోని హక్కులు, తమకు అసౌకర్యంగా ఉన్నట్లు, తరచుగా తమకు ఆటంకంగా ఉన్నట్లు అవి భావిస్తున్నాయి.

జాతీయ సంపదను మౌలికంగా పునఃపంపిణీ చేయాలని డిమాండుచేసే వామపక్ష పార్టీలపై తిరుగుబాటుదార్ల ముద్ర వేస్తున్నారు. అవి రాజ్యాన్ని కూలద్రోయాలని వాంఛిస్తున్నట్లుగా చిత్రిస్తున్నారు. ఆ పార్టీలకు 'చెందిన వ్యక్తులను, చట్టవ్యతిరేక పద్ధతులద్వారా, తప్పుడు సాక్ష్యాలద్వారా దుర్మార్గంగా చిత్రీకరించటానికి, దీర్ఘకాలం నిర్బంధంలో ఉంచటానికి, చంపటానికి పాశవిక చట్టాలను రాజ్యం ఉపయోగించు కుంటున్నది. విస్తృతమైన ప్రజాదరణ పొందిన ప్రజారచయితలు, కబీర్ కళామంచ్ వంటి సాంస్కృతిక బృందాలు, సీతల్‌సాథే, సంచిన్‌మాలే వంటి గాయకులు, వి. ర. సం. లాంటి రచయితల సంఘాలపై నిషేధాలు విధించటం, దీర్ఘకాలం జైళ్ళలో పెట్టటం, వేధింపులకు గురిచేయటం వంటి చర్యలకు రాజ్యం పాల్పడుతోంది.

భారతరాజ్యాంగం, సంస్థా నిర్మాణ హక్కును, భావప్రకటనా హక్కును, కల్పించినప్పటికీ, ప్రజాసంఘాలపై క్రమపద్ధతిలో దాడులు చేస్తూ, వాటి భావప్రచార హక్కును తీవ్రంగా ఆటంకపరుస్తున్నారు. ప్రత్యేకంగా రూపొందించబడిన పాశవిక చట్టాలకు తోడు నేరశిక్షాస్మృతిలో, భావప్రకటనను అరికట్టే అనేక నిబంధనలను చేరుస్తున్నారు. వీటి మూలంగా, భావప్రకటనా స్వాతంత్ర్యం, నేరశిక్షాస్మృతిలో కాగ్నిజబుల్ నేరంగా గుర్తించ బడుతోంది. న్యాయస్థానాల ఆదేశాలతో పనిలేకుండా, అనుమానం మీదనే, అరెస్టులు చేసే అధికారం, ఈ చట్టాల వల్ల పోలీసులకు లభిస్తోంది. (గౌతమ్ భాటియా 2015. Offend, shock and Disturb, OUP)

పోలీసులకు, చట్టాన్ని ఉపయోగించటంలో నిరంకుశ అంధికారాలు లభించటంతో వాళ్ళు అసమ్మతి వస్తుందను కునప్పుడల్లా పరమక్రూరంగా దాని గొంతునొక్కి వేస్తున్నారు. విమర్శనాత్మక చర్చలో, స్వేచ్ఛగా పాల్గొనే వాతావరణం లేని, ఇలాంటి ప్రజాస్వామ్యం తన మొదటి పరీక్షలోనే ఫెయిలయ్యింది!

మత ఛాందసవాద బృందాలకు వీధి న్యాయాన్ని, దౌర్జన్యకర ఎత్తుగడలను అనుసరించటానికి అవసరమైనంత స్వేచ్ఛ లభిస్తోంది. ఇదంతా చూస్తుంటే, "భావప్రకటనా స్వేచ్ఛ" - ఇతరుల జీవించే హక్కు, వనరులపై హక్కు, లైంగిక, మత, కుల, తెగ, వివక్షతలనుండి స్వేచ్ఛను కలిగి ఉండే హక్కులను అణచివేస్తూ, వాళ్ళపై దాడులు చేయటానికి మాత్రమే ఉన్నట్లుగా అర్థమౌతోంది.

ఎలాంటి హక్కులను డిమాండు చేయాలో, వేటిని డిమాండు చేయకూడదో అనే అంశంపై, ప్రచారసాధనాలు, ప్రభుత్వాలు ఒక అంగీకృత అభిప్రాయాన్ని నిర్మించాయి. రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక హక్కులను డిమాండు చేయటం నేరంగా మారింది. హక్కుల కార్యకర్తలను, పౌర సమాజసంస్థలను వేధిస్తున్నారు. వాటి రిజిస్ట్రేషన్లను రద్దుచేసి, వాటికి అందే నిధులపై నియంత్రణ పెడుతున్నారు. భూమిహక్కును, మూలవాసీ ప్రజల, పేదల హక్కులను డిమాండు చేస్తున్న వాళ్ళపై తెలిగ్గా జాతివ్యతిరేక ముద్ర వేస్తున్నారు.

**ముగింపు :**

ఆర్థిక, సాంఘిక విముక్తి లేకుండా, కేవలం రాజకీయ స్వాతంత్ర్యం, సదుద్దేశంతో కూడిన రాజ్యాంగం మాత్రమే సమానత్వం, న్యాయం అనే ఆదర్శాల సాధనను, గ్యారంటీ చేయలేవని, రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగ నిర్మాణ సందర్భంగానే చెప్పారు.

ప్రజల ప్రాథమిక హక్కులను రక్షించటంలో విఫలమైన, రాజ్యమూ, ప్రభుత్వమూ, రాజ్యాంగం కల్పించిన భావప్రకటనా హక్కును, కమ్మరి తన కొలిమిలో ఒక అందమైన ఇనుప వస్తువును చేసినట్లుగా న్యాయవ్యవస్థను ఉపయోగించుకొని, పాలకవర్గాలు గొప్పలు చెప్పుకోవటానికి వీలుగా, భావప్రకటన అనే ఒక అలంకారికమైన వస్తువును తయారు చేశాయి. అది రాజ్యాంగపు పునాది సూత్రంగాకాక, ప్రజాస్వామ్యానికి 'సిగ్గుబిళ్ళ'గా ఉపయోగపడుతున్నది.

భావప్రకటనా స్వేచ్ఛకున్న ప్రాథమిక ప్రయోజనాన్ని రాజ్యాంగ నిర్మాతల దృష్టికోణంనుంచి, ఎన్నడూ ప్రభుత్వాలు అంచనా వేయలేదు. హక్కులకోసం పోరాడుతున్న ప్రజల డిమాండ్లు రాజ్యాంగ వ్యతిరేకమైనవికావు. అవి దార్శనికులైన రాజ్యాంగ నిర్మాతలు ఊహించిన ఆదర్శాలు. ప్రజల్ని నిరాశ్రయుల్ని చేయటం, న్యాయాన్ని నిరాకరించటం, ప్రజలకు చెందాల్సిన వనరులను కబ్జాచేయటం, తమ సమస్యలను నలుగుర్లోకి తేవటానికి ప్రయత్నిస్తున్న వారి గొంతునొక్కివేయటం వంటి చర్యలన్నీ రాజ్యాంగ వ్యతిరేకమైనవి. ఈ చర్యలు, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయ వంటి సూత్రాలను ఉల్లంఘిస్తున్నాయి. ప్రజలదృష్టిని ఆకర్షించటానికి, మతాన్ని ముసుగుగా వాడుకుంటున్న శక్తులు, ప్రజల్ని కుల, తెగ, మత ప్రాతిపదిక మీద చీల్చటానికి ప్రయత్నిస్తున్న శక్తులు రాజ్యాంగ వ్యతిరేకమైనవి. రాజ్యాంగ ఆదర్శమైన సౌభ్రాతృత్వాన్ని అవి ఉల్లంఘిస్తున్నాయి.

ఈ రాజ్యాంగ సూత్రాల దృష్టికోణం నుండి, న్యాయవ్యవస్థ వివాదాలను పరిశీలించిన రోజున, ఎలాంటి పాశవిక చట్టాన్నీ, ఇప్పుడు వ్యాఖ్యానిస్తున్నట్లుగా, - పీడకశక్తులకు రక్షణ కల్పిస్తూ, హక్కులను డిమాండు చేస్తున్న ప్రజల నోళ్ళునొక్కివేస్తున్నట్లు - వ్యాఖ్యానించటానికి అవకాశముండదు. గణతంత్ర రాజ్యాంగాన్ని ఆమోదించిన 67 సంవత్సరాల తర్వాత కూడా, ఆర్థిక, సాంఘిక, రాజకీయ హక్కులను వినియోగించుకునే అవకాశాలు కుంచించుకు పోతున్న ఈ తరుణంలో, భావ ప్రకటనా హక్కును, వినియోగించు కోవటం పాలకులకు కుట్రలాగే కనపడుతోంది.

(ప్రొఫెసర్ పద్మజాషా, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డిపార్టుమెంట్ ఆఫ్ మాస్ కమ్యూనికేషన్స్‌లో ప్రొఫెసర్‌గా పనిచేసి పదవీ విరమణ చేశారు. 23-3-2016న విజయవాడలో జరిగిన కె. వి. ఆర్ స్మారకోపన్యాసానికి అనువాదం. )



# చారిత్రక దృష్టి, నిబద్ధత కలిగిన సత్యాలు కందనవోలు కథలు

**పలమనేరు బాలాజి**

ఆరు కథా సంపుటాలు, కర్నూలు జిల్లా చరిత్ర పుస్తకంతో రచయితగా కర్నూలు కథ (2005)ను వెలువరించిన సంపాదకుడుగా, 32 బాలల పుస్తకాల్ని ముద్రించిన సాహసికుడుగా డా. ఎం. హరికిషన్ తెలుగు సాహిత్య రంగానికి సుపరిచితుడు.

కర్నూలుకు పూర్వపు పేరే కందనవోలు. అందుకే తన కథా సంపుటిని "కందనవోలు కథలు" పేరిట వెలువరించాడు రచయిత.

మాయమ్మ రాచ్చసి (2000), నయా ఫత్వా (2001), నేను మా అమ్మా (2005), మూడు అబద్ధాలు (2005), ఒక చల్లని మేఘం (2008) ఇవీ ఇతడి ఇదివరకటి కథా సంపుటాలు. కాగా తను రాసిన మొత్తం కథలన్నీ కలిపి 2015లో వెలువరించిన కొత్త సంపుటి కందనవోలు కథలు.

మిగతా సమకాలీన రచయితలతో పోల్చి చూసినప్పుడు హరికిషన్ భిన్నంగా కనిపిస్తాడు. అతడి ప్రత్యేకత అంతా కేవలం రచయితగా మిగిలిపోకుండా విభిన్న ప్రక్రియల్లో, విభిన్న రంగాల్లో తెలుగు భాషా సాహిత్య వికాసానికి అతడు చేస్తున్న కృషిలో ఉంది. సాహిత్యం పట్ల నిరంతర తపన, నిబద్ధత కలిగి రచయితగా అతడు ఇప్పటికే పలువురు విమర్శకుల ప్రశంసలు పొందినవాడు. అతడి కథావస్తువులు, కథాకథనం, కథల్లోని సంఘటనలు కూడా విభిన్నమైనవి, ప్రత్యేకమైనవి.




కందనవోలు కథలు
హరికిషన్
ప్రచురణ : కర్నూలు బుక్ ట్రస్ట్ ప్రచురణ
వెల : రు. 100/-

కర్నూలు తాలూకు దశాబ్దాల సాంస్కృతిక, రాజకీయ చరిత్ర అధ్యయనానికి ఉపకరించే కథా సాహిత్యంలో హరికిషన్ సమకూర్చిన కర్నూలు కథ సంకలనం ఒకటిగా నిలుస్తుంది. 17 సంవత్సరాల వ్యవధిలో 1997 నుండి 2014 వరకూ రాయబడిన 25 కథల సంపుటి "కందనవోలు కథలు" చదువుతున్నప్పుడు రచయిత హరికిషన్ గురించి ఇదంతా ఆలోచించవలసి వచ్చింది.

రచనలతో బాటు వివిధ రకాలుగా సమాజానికి, సాహిత్యానికి, పుస్తకాలకు, రచయితలకు మేలు చేసే మేలు రకం రచయితల్లో ఒకడిగా, కర్నూలు కథా సమయం సాహితీ మిత్రుల్లో ముఖ్యుడిగా హరికిషన్ అన్ని ప్రాంతాల వారికీ సుపరిచితుడే.

పదేళ్ళు కానివ్వండి లేదా పాతికేళ్ళు కూడా కానివ్వండి ఎంత కాలం క్రితం అయినా సరే మనం చదివింది మంచి కథ అనటానికి నిరూపణ ఏమిటంటే ఆ కథ మొత్తమో, కథలోని ఒక సంఘటనో, సన్నివేశమో, పాత్రో, వర్ణనో, కథాంశమో మనకు గుర్తుండి పోవటమే. తెలుగు సాహిత్యాభిమానులకు, ముఖ్యంగా కథల్ని ఇష్టపడే పాఠకులకు చాలా మందికి ఈ విధంగానే కథల తాలుకు జ్ఞాపకాలు కొన్ని నిరంతరం వెంటాడుతూనే ఉంటాయి.

ఆయా సందర్భాల్లో ఆయా కథల గురించి ఆలోచించడమో, ప్రస్తావించటమో జరుగుతూ ఉంటుంది. అట్లాంటి కథల్ని రాసిన రచయితల నుండి పాఠకులు మంచి కథల్ని ఆశించటంలో తప్పేమీ లేదు. మంచి కథ అంటే ఏమిటి అనే ప్రశ్నకు లెక్కలేనన్ని జవాబులు, వివరణలు ఉండనే ఉంటాయి. కథా రచయితల విషయానికి వచ్చినప్పుడు అన్ని ప్రాంతాల, వర్గాల రచయితలు నిర్దిష్టమైన కథాంశాలను ఎన్నుకొని, దీక్షతో, శిల్పనైపుణ్యంతో మంచి కథల్ని అందించే ప్రయత్నం చేస్తూ ఉన్నారు. కథకు కథకూ మధ్య, కథా సంపుటానికి కథా సంపుటానికి మధ్య ఆయా రచనల్లో పరిణితి, వస్తు విస్తృతి పెరగటం, శిల్పచాతుర్యం మెరుగవటం తెలిసిన విషయమే. కథలు రాయటంతో ఆగి, రచయితలుగానే మిగిలి పోకుండా - కొందరు వివిధ రకాలుగా తెలుగు భాషా వికాసానికి, సాహిత్యం సాంస్కృతిక, కళా రంగాల అభ్యున్నతికి నిరంతరం కృషి చేస్తూనే ఉన్నారు.

సాహితీ కార్యక్రమాల్ని ఏర్పాటు చేయటం, వివిధ ప్రాంతాలకు చెందిన రచయితల్ని ఒక చోట చేర్చటం, చర్చా కార్యక్రమాల్ని నిర్వహించటం, ఆ చర్చల సారాంశాన్ని, తీర్మానాల్ని మళ్ళీ మిగతా రచయితలకు తెలియజేయటం, రచయితలకు వర్క్‌షాపులు నిర్వహించటం, కథల పోటీలు నిర్వహించటం, ఉత్తమ కథా సంకలనాన్ని ఏరి కూర్చి ప్రచురించటం, రచయితలకు సత్కార సన్మాన కార్యక్రమాల్ని ఏర్పాటు చేయటం, ముఖ్యంగా కొత్త రచయితల్ని గుర్తించి ప్రోత్సహించటం, సాహిత్య పత్రికల్ని నిర్వహించటం, గ్రంథాలయాలు, కథానిలయాల్ని నిర్వహించటం మొదలైన సాహితీ కార్యక్రమాల్ని విధిగా బాధ్యతతో నిర్వర్తించే వాళ్ళ సాహితీసేవ విస్మరించలేనిది.

కథలు రాయటంతో రచయిత బాధ్యత పూర్తయిపోయిందనే

భావన పోయి, కథలు రాయటంతో రచయిత బాధ్యత మొదలైందనే స్పష్టమైన ఉద్దేశం కలిగిన రచయితలు కేవలం కథలు రాయటంతో ఆగిపోకుండా - యూనివర్శిటీలు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, గ్రంథాలయ సంస్థలు, సామాజిక సేవా సంస్థలు చేపట్టాల్సిన ఎన్నో ముఖ్యమైన పనుల్ని తమ భుజస్కంధాలపైన వేసుకొని, ఆ పనుల్ని చాలా ఇష్టంగా చేసుకుంటూ ముందుకు వెడుతున్నారు. వీళ్ళందరి నిరంతర కృషి వల్లనే, తెలుగు భాషా, కళా, సాహిత్య రంగాలు తమ వైభవాన్ని నిలుపుకోగలుగుతున్నాయి. కొత్త రచయితలు ధైర్యంగా, ఉత్సాహంగా కథలు రాయగలుగుతున్నారు. కొత్త పత్రికలు, కొత్త పుస్తకాలు, కొత్త రకం పుస్తకాలు వెలుగు చూస్తున్నాయి.

మనుషులు అందరూ సాటి మనుషుల గురించి ఆలోచించరు. సాటి మనుషుల కష్టాలకు, కన్నీళ్ళకు, బాధలకు స్పందించరు. జీవన సౌందర్యాన్ని తెలుసుకోరు. సాటి వాళ్ళ జీవన పోరాటానికి కనీసం ఉత్తేజం కలిగించలేరు. వాళ్ళూ ఉత్తేజం పొందలేరు.

సినిమానో, టీవీనో చూస్తున్నట్లుగానే ఉంటుంది వాళ్ళ వాలకం. కళ్లెదుట మనిషి బాధపడుతున్నా, అన్యాయానికి గురవుతున్నా కనీసం చలించరు, స్పందించరు. మనుషులు దౌర్జన్యానికో, అన్యాయానికో బలవుతున్నా, మనిషే మరణిస్తున్నా సరే వీళ్ళల్లో చలనం ఉండదు. మనుషుల మెదళ్ళు, మనసులు మొత్తంగా యాంత్రీకీకరణతో మొద్దుబారిపోయిన తరం ఇది. ఒకరు కాదు, ఇద్దరు కాదు వందలాది మంది ఒక్కసారే సామూహికంగా మరణిస్తున్నా సరే మనిషిలో కదలిక ఉండదు. ఉదాసీనంగా, యథాలాపంగా ఏమీ పట్టనట్లు బతికేయడం మనుషుల ప్రాథమిక లక్షణంగా మారిపోయిన కాలం ఇది. బహుశా అందుకనే ఏమో ఇప్పుడు అక్కడక్కడా ఒక మాట వినపడుతూ ఉంటుంది.

"మనుషులందరూ మనుషులు కారు, కాలేరు". మనుషుల పట్ల ప్రేమ, కరుణ, బాధ్యత స్పందన కలిగిన వాళ్ళే సృజనకారులు. అట్లాంటి సృజనకారుల్లో హరికిషన్ ఒకడని అతడి సాహిత్యం, వ్యక్తిత్వం తెలియజేస్తాయి.

బహుశ మనుషుల పట్ల మనుషులకు కలిగే ప్రేమ, ఉద్వేగం, ఇష్టత కారణంగానే మానవ సంబంధాలు బలపడుతాయేమో. పని, శ్రమ, ఉత్పత్తి, లాభం అనే కారకాల విషయం గమనార్హం - మనుషుల్ని మనుషులుగా గుర్తించలేని వాళ్ళతో, సౌజన్యపూర్వకంగా, మర్యాదగా, సంస్కారవంతంగా ప్రవర్తించలేని వాళ్ళతో నేటి సమాజం నిండిపోతోంది.

మనుషుల్లో దయ, కరుణ మాయమైపోయేకొద్దీ మనుషులు మృగాలుగా మారి అత్యాచారాలు, దోపిడీలు, దుర్మార్గాలు, హత్యలు, మోసాలు, కుట్రలు చేయటం ఎక్కువవుతూ ఉంది. జీవనోపాధి పట్ల, కనీస సౌకర్యాల పట్ల కాక, విలాసాల పట్ల, ఆస్తుల పట్ల పెరిగిన విపరీతమైన కాంక్ష, వ్యామోహం మనుషుల్లో విచక్షణతను వివేకాన్ని పోగొడుతోంది.

బహుశా ఇప్పుడు మనం తేరుకోకపోతే, బహుశా ఇప్పుడు మనం అప్రమత్తంగా ఉండకపోతే రేపటి సమాజం భయంకరంగా ఉండబోతోంది. అట్లాంటి తీవ్ర ప్రమాదాన్ని నివారించటానికి, సమాజంలో మార్పు రావటానికి కళలు, సాహిత్య రంగాలు మరింత చురుకైన మెరుగైన పాత్రను నిర్వహించాల్సిన చారిత్రక సందర్భంలో ఇప్పుడు మనం ఉన్నాం.

ఆ మార్పు ఒక్కసారిగా అన్ని తరాల, వర్గాల, జెండర్ల వారిలో ఒక్కసారిగానే మొదలు కావాల్సి ఉంటుంది. అటు పాతతరం, యువతరంతో బాటు పిల్లల్లో కూడా సమూలంగా మార్పు రావాల్సిన అవసరం ఎంతైనా ఉంటుంది.

మనుషుల, మనసుల, మస్తిష్కాల, సమాజాల ప్రక్షాళనకు కళా సాహిత్య రంగాలు చేస్తున్న కృషిలో భాగంగానే వర్తమాన కళాసాహిత్య రంగాల ఆవిష్కరణల్ని మనం శాస్త్రీయంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. రచయితలకు సమాజంలోని యువతీ యువకులు, వృద్ధులతో గల మానవ సంబంధాలు, పరిచయాలు ఎంత ముఖ్యమో ఆయా స్థలకాలాల్లోని రచయితలకు ఆయా స్థలకాలాలకు చెందిన బాలలతో గల సాన్నిహిత్యం దగ్గరితనం, అనుబంధం కూడా అంతే ముఖ్యమైనవి. బాల సాహిత్యానికి విస్తృతంగా ప్రచారం కల్పించటం, పిల్లల్ని పుస్తకాల వైపు, కళల వైపు మానవీయ విలువల వైపు ఆకర్షించేలా ప్రయత్నాలు చేయటం చాలా ముఖ్యం. ఈ బాధ్యతను విజయవంతంగా నిర్వహిస్తున్న ఉత్తమ ఉపాధ్యాయ కథకుడు హరికిషన్.

ఈ క్రమంలో బాలసాహిత్యంపై విరివిగా కృషి చేసిన రచయితల్లో కర్నూలు ప్రాంతం నుండి విశేషమైన కృషి చేసిన వారిలో హరికిషన్ ముఖ్యులు. కథల్ని సాగతీయకుండా చురుగ్గా నడపడం, కథాంశానికి అనుగుణంగా సన్నివేశాల చిత్రణ, పాత్రల స్వరూప స్వభావాలను సహజంగా చూపించటం, సమాజంలోని దుర్మార్గమైన అధికారం, కులం పట్ల అతడికి గల వ్యతిరేకత ఈ కథల్ని మంచి కథలని తేల్చి చెబుతాయి. ఈ కథల్లోని ఉత్కంఠత, కథా సంవిధానం, శిల్ప నైపుణ్యం, సంభాషణల చతురత ముఖ్యంగా క్లుప్తత, స్థలకాలాల చిత్రణ, చారిత్రక దృష్టి, మానవీయ విలువల పట్ల కల ఆర్తి ఈ కథకుడి సాహిత్య వ్యక్తిత్వాన్ని ప్రాపంచిక దృక్పథాన్ని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. ప్రాంతీయ అస్తిత్వ చైతన్యం, రాయలసీమకే ప్రత్యేకమైన కరువు కాటకాలు - దెబ్బ తిన్న సంబంధాల చిత్రణ, ఆర్థిక అసమానతలు, ఫ్యాక్షనిజం - దారుణాలు, విద్యావ్యవస్థలోని డొల్లతనం, స్త్రీ దుఃఖం ఇతడి కథా వస్తువులు. మొత్తంగా ఈ కథలు సమస్యల చిత్రణతో ప్రారంభమై రావాల్సిన చైతన్యం, మార్పుల గురించి హెచ్చరిస్తూనే చైతన్యవంతంగా, ఆశాజనకంగా ముగుస్తాయి.

మరో మంచి కథకుడు కథా సమయం మిత్రుడు జి. ఉమామహేశ్వర్‌కు ఈ కథా సంపుటిని అంకితం ఇవ్వటం అభినందనీయం.

సాహిత్య విమర్శ, సమీక్ష, చర్చలకు స్థానం లేకుండా పోయిన తెలుగు సాహిత్య రంగానికి ఒక రకంగా ఆయా పుస్తకాలకు రచయితలు, విమర్శకులు, పాఠకులు రాసే ముందుమాటలు మేలు చేస్తున్నాయేమో అని ఒక్కోసారి అన్పిస్తూ ఉంటుంది. రచయితల పట్ల, ఆయా రచనల పట్ల వాళ్ళు సానుకూలంగా రాసే మాటలలా పక్కన బెడితే ఆయా రచనలన్ని పరిశీలించి అధ్యయనం చేసి

సమాంతర, సమకాలీన రచయితలు, రచనలతో పోల్చి చూసి నాణ్యతా ప్రమాణాలను, గుణగణాలను, బలాలు బలహీనతలు, తప్పిదాలు, ప్రయోగాలను స్థూలంగా పరిశీలించి రాసే ముందు మాటలు ప్రామాణికంగానే ఉంటున్నాయని పిలుస్తుంది. కొన్నిసార్లు అసలు పుస్తకాల కన్నా ఆయా పుస్తకాలకు రాసిన ముందుమాటలే బలమైనవిగా ఉండటం కూడ మనం గమనిస్తూనే ఉన్నాం.

"కథనంలో క్లుప్తత పాటించడం, ఒక కథలో ఒకే పాయింట్ చెప్పడం, కథ ఎత్తుగడకూ, నడకకూ, ముగింపుకూ లంకె ఉండటం, కథలోకి నేరుగా ప్రవేశించడం, అనవసర విషయాలేవీ కథలో లేకపోవడం, వర్ణనల్లూ, అలంకారాల పట్ల వ్యామోహం లేకపోవడం.. ఇలాంటి సూత్రాల వల్ల ఈ సంపుటిలోని కథలన్నీ కూడా కథకుడికి కథా నిర్మాణం పట్ల గల శ్రద్ధను, నేర్పును తెలియజేస్తున్నాయి.

దాదాపుగా ఇందులోని కథలన్నీ, ప్రాంతీయ స్పృహతో గుబాళిస్తూ ఉంటాయి. దేశంలో ఎక్కడైనా ఈ కథల్లోని జీవితం కన్పిస్తూండవచ్చు గానీ, ఇది నిర్దిష్ట ప్రాంతపు ప్రాదేశిక జీవితం వాతావరణం, భాష, మాటతీరు మనుషుల ప్రవర్తన, ఆర్థిక పరిస్థితులు, మత కుల వర్గ స్పృహ, మహిళల కుటుంబగత హింస ఇలాంటివెన్నో ఈ కథల్లో కొట్టుకొచ్చినట్లు కన్పిస్తూ, ప్రాంతీయమైన రంగూ, రుచీ, వాసనలను వెదజల్లుతాయి" అంటారు తన ముందుమాటలో సింగమనేని నారాయణ.

"నిరాడంబర శైలీ, ముక్కుసూటి కథనం, వస్తు వైవిధ్యం, శిల్పం పేరున ప్రయోగాలు చేయకపోవడం, పాత్రోచితమైన భాషా ప్రయోగం చేస్తూనే కథనంలో సైతం తనదైన ప్రాంతీయ ముద్రని చూపే నైపుణ్యం, తన చుట్టూ ఉన్న సమాజంలోని గతిశీలతని భిన్న పార్శ్వాల నుంచి విశ్లేషించగల ఎరుక, స్వీయ జీవితానుభవాలను ప్రగతిశీల ప్రాపంచిక దృక్పథం నుంచి వ్యాఖ్యానించే నేర్పు, స్థానీయతకి పెద్దపీట వేసి ఒక వాతావరణాన్ని నిర్మించే జాగరూకత, మానవీయ స్పందనల్ని - ఉద్వేగాల్ని నిర్దిష్ట సామాజిక సందర్భం నుంచి చూడగల సంయమనం, 'కథా సమయం' వంటి సంస్థల ద్వారా పెంచుకొన్న సదసద్వివేచనా రచయితగా హరికిషన్ కూడగట్టుకొన్న బలాలు. ఇవి భవిష్యత్తుల్లో మరింత పదునెక్కుతాయని ఆశంస" అంటారు ఎ. కె. ప్రభాకర్ తన ముందుమాటలో.

ఏదేమైనా 'కందనవోలు కథలు' కథా సంపుటికి 'కథ చెప్పటం తెలిసిన కథకుడు' పేరిట ప్రసిద్ధ కథా రచయిత సింగమనేని నారాయణ, 'నిర్దిష్టత నుంచి నిర్దిష్టతలోకి' పేరిట ప్రముఖ విమర్శకులు ఎ. కె. ప్రభాకర్‌లు రాసిన రెండు విలువైన ముందు మాటలు యువతరం కథా రచయితలకు, కొత్తగా కథలు రాసే ఆసక్తి ఉన్న కథకులకు తప్పకుండా ప్రేరణ కలిగిస్తాయి. వీరిద్దరూ అభిప్రాయపడినట్లు హరికిషన్ విలువైన కథకుడే, ఈ సంపుటంలోని కథలూ విలువైనవే.

ఉత్తమ కథా సంకలనాల్లో హరికిషన్ రాసిన అనేక కథలు స్థానం సంపాదించుకున్నాయి. రెండు, మూడు పత్రికలకే పరిమితం కాకుండా. విభిన్న పత్రికల్లో రచనలు చేయడం ద్వారా హరికిషన్ చాలామంది పాఠకులకు చేరవయ్యారు. హరికిషన్ రాసిన 25 కథల్లో ఏడు కథలు విడిగా అచ్చుయినవి కాగా, ఆదివారం ఆంధ్రజ్యోతిలో ఏడు, అరుణతారలో ఐదు, సాహిత్య ప్రస్థానంలో మూడు, తెలుగు వెలుగు, పాలపిట్ట, ఆదివారం వార్త సంచికల్లో ఒక్కొక్క కథ అచ్చయినాయి.

రచయిత కంఠస్వరంతో కానీ, కొన్ని కథాంశాల పట్లగానీ, రెండు మూడు కథల్లోని రచయిత దృష్టికోణం గురించి కానీ కల అభిప్రాయ భేదాలను అటుంచితే "కర్నూలు కథ"ను మినహాయించి హరికిషన్ రాసిన 39వ పుస్తకంగా, స్థానిక చారిత్రకాంశాల వేదికగా "కందనవోలు కథలు" కథాసంపుటిలోని కథల గురించి మరింత లోతైన చర్చ జరగాల్సి ఉంది. ఈ కథల గురించి పరిశోధనలు రేపటి తరానికి లేదా నేటి యువతరానికి ఎంతగానో ఉపయోగ పడుతాయని చెప్పక తప్పదు.



---

(22వ పేజీ తరువాత..)

చిన్నయ్య నల్గొండ స్థానీయ పరిణామాలను మరింత సూక్ష్మస్థాయిలో వాటి స్థలకాలాల్లో చూసి సాధారణీకరించిన అర్థంలో చిత్రిస్తాడు. ఆ సూక్ష్మ స్థాయికి వెళ్లినప్పుడు మామూలుగా అస్తిత్వవాదుల్లాగా ముందస్తు నమూనాల ప్రకారం కాకుండా వాస్తవాన్ని దాన్ని గతిలో, జీవితంలోని వాస్తవికతలో గుర్తిస్తాడు. దాన్ని నిరలంకార శైలిలో రాస్తాడు. తెలంగాణ నుంచి మహోధృతంగా విస్తరించిన విప్లవ కథా చరిత్రలోని ఇవ్వాల్టి-దశకు ప్రాతినిధ్యం వహిస్తున్న విభిన్న కంఠస్వరాల్లో చిన్నయ్యది ఒకటి. ఆయన కథా యాత్ర పదిలంగా, సుస్థిరంగా, గతిశీలంగా.. ఉద్యమ, సామాజిక అవసరాలు తీర్చేలా సాగుతుందని భరోసా ఇచ్చే కథలు పదేళ్ల కిందటి 'పయిలం'లోనే ఉన్నాయి. ఆ హామీని నిలబెట్టుకునే కథలు ఈ దశాబ్దంలో ఆయన విమర్శనాత్మక వాస్తవిక దృష్టితో ఇంకా మంచివి రాశాడు.



**మీ రచనలను అరుణతారకు ఈ-మెయిల్ కూడా చేయవచ్చు!**

పేజ్‌మేకర్ ఓపెన్ ఫైల్, పి. డి. ఎఫ్. పద్ధతులలో (అను 6. 0లో అయితే మేలు),

మైక్రోసాఫ్ట్ వర్డ్, ఎం. ఎస్. భాషాలో కూడా అరుణతారకు మెయిల్ చేయగలరు

ఈ-మెయిల్ : **arunatara1977@gmail.com**

**Like Page://arunatara viplava rachayitala sangham**

**Website : www. virasam. in**

# ప్రపంచ ప్రసిద్ధ సోవియట్ విప్లవ రచయిత ఫెదయేవ్ నవల 'వెనుకంజ'

**నాగభూషణ్**

(గత సంచిక తరువాయి. . )

(3)

ఇలా వారు కబుర్లు చెప్పుకుంటూ, మధ్యలో తగిలిన వేగుల అసత్య వార్తలు వింటూ, 'సొలోమొనాయా' గ్రామానికి మూడు మైళ్ల దూరంలోగల ఒక వ్యవసాయ క్షేత్రంలో తమ గుర్రాల్ని వదిలి, నడవసాగారు. గ్రామం చేరిన కొద్దిసేపటికి ఓ మహిళవారికి పరుగెత్తుకుంటూ ఎదురొచ్చి; పెద్ద జపానుసైన్యం వస్తోందనీ, పారిపొమ్మనీ వగర్చుకుంటూ చెప్పిందో లేదో, అంతలోనే నలుగురు జపాను సైనికులు మార్చి చేసుకుంటూ రావడం చూశాడు బాక్లనోవ్. వెంటనే అతడు రివాల్వర్ తీసి టకటకా పేల్చగానే, ఇద్దరు నేలకూలగా, ఒకడు పరుగెత్తాడు మిగిలిన నాలుగోవాడు తన రైఫిలుఅందుకున్నాడు. బాక్లనోవ్ అతణ్ణి కాల్చబోయాడుగానీ, గుళ్ళు నిండుకున్నాయి. అది చూసి మెచిక్ తన భయాన్ని అణచుకుని, తన రివాల్వర్‌తో గురిచూసి పేల్చేసరికి, అతడు కూడా కూలిపోయాడు తక్షణం ఆ ఇద్దరూ పరుగులుతీస్తూ, మధ్యలో గుర్రపుబండి కనబడగా, పక్కనే కట్టేసి ఉన్న గుర్రాన్ని బండికి పుచ్చి, వేగంగా ముందుకు నడిపించారు. ఇంతలో వెనుక గ్రామంలో జపానువారి ఈలలు వినిపించడం, వారి ముఖ్యబలం గ్రామానికి చేరుకున్నట్లు గ్రహించాడు బాక్లనోవ్. అతడు బండిని రెండుమైళ్లు తీసుకెళ్లి అక్కడ ఆపాడు. ఆ పై దారి పక్కనున్న పెద్ద చెట్టునెక్కి గ్రామాన్ని పరిశీలించాడు. సుమారు ఇరవై మంది అశ్వికులు గ్రామం నుండి తమ వేపురావడం చూశాడు. కొద్ది వెనుక జపానువారి కాల్పులు కూడా కనబడింది. వెంటనే బాక్లనోవ్ చెట్టుదిగి, బండిపై తమ గుర్రాల్ని కట్టివేసిన దగ్గరకు వచ్చి, వాటినెక్కి, పిబిషి వైపు దౌడు తీశారు. వారు దళాన్ని చేరుకునేసరికి రాత్రి అయింది.

బాక్లనోవ్ వచ్చేదాకా లెవిన్‌సన్ కూర్చోలేదు గస్తీ దళాన్ని పటిష్టం చేసి, కుబ్రిక్ దళాన్ని గార్డుడ్యూటీలో పెట్టాడు. తిరిగి వచ్చిన మెచిక్ తన దళం ఉన్న కందకంలోకి చేరి, అలసిపోవడంచేత నిద్రకుపతమించినా, పట్టలేదు. ఇంతలో కాల్పులు సాగించనున్న క్యూబ్రిక్ ఆజ్ఞతో కాల్పులు మొదలయ్యాయి. జపాన్ వేగులపై సాగుతున్నాయి కాల్పులు. భారీఫిరంగిమోత, ఆపై రైఫిల్ కాల్పులు.. ఇంతలో అక్కడికి బాక్లనోవ్, మెతెలిత్సాలు వచ్చారు. ఈ మారు శత్రువుల్ని స్పష్టంగా చూశాడు మెచిక్. వారు అలలు అలలుగా పొద నుడి పొదకు పరుగెడ్తూ వస్తున్నారు. మెచిక్ ఇప్పుడు భయపడలేదుగానీ, ఈ ఉదంతం ఎప్పుడు ముగుస్తుందా అన్న ఆ దుర్గమాత్రం కలిగింది. ఆ సమయంలో పడుకుని, గురి చూడకుండా, భయంతో నేలను అంటిపెట్టుకున్న పీకా ఓ చెట్టుకేసి కాలుస్తుండడాన్ని క్యూబ్రిక్ చూసి మందలించాడు. అయితే తనవద్దనున్న మందుగుండు అయిపోయేక గానీ పీకా కాల్చడం ఆపలేదు. ప్లటూన్ కమాండర్ బూట్లతో తట్టినా, పకా తలప కెత్తినపాపాన పోలేదు.

కాల్పుల అనంతరం దళమంతా అస్తవ్యస్తంగా, ఒంటిలైనుతో పరుగెత్తడంతో, ఏం జరుగుతోందీ గ్రహింపులేకుండానే మెచిక్‌కడా వారితో పరుగెత్తాడు. అంతగాభరాలోనూ అతడు, ఈ పరుగంతా యాదృచ్ఛికం కాదనీ ఇదంతా ఓ ముఠా చేత నడపబడుతోందనీ గ్రహించాడు. ఒంటివరుస గుర్రాలపై వెడుతూ అతడు తన భవిష్యత్తును నిర్దేశిస్తున్న వారివంక చూశాడు. దళం ముందు స్వారీ చేస్తున్న లెవిన్‌సన్ పొట్టిగా వుండి, విశ్వతంగా కనిపించాడతడికి. నడుంకి పెద్ద పెద్ద రివాల్వర్ వేలాడుతోంది. ఇలాంటివాడే తనను నడిపిస్తున్నాడంటే, నమ్మడం కష్టమైంది మెచిక్‌కి. ఇంతల మరోసారి వారిపై గుళ్ల వర్షం దూసుకొచ్చింది. అంతాముందుకు వేగంగా వెళ్లగా వెళ్లగా, కొద్ది మంది నేల కొరిగారు. తైగాలోకి వచ్చాకగానీ మెచిక్ పూర్తి స్పృహలకి రాలేదు. ఒక దట్టమైన దేవదారువృక్షాలతోపు వారికి రక్షణ ప్రసాదించింది.

ఆపై కొన్ని రోజులు ఎలాంటి తేడా లేకుండా దొర్లిపోయాయి. ఈ విషయాన్ని వర్ణిస్తూ రచయిత, మగ్గంలోంచి వెలువడే గుడ్డలాగా, రోఉలు దొర్లిపోతున్నాయనీ, దారానికి దారానికే తేడాలేనట్లే, రోజుకు రోఉకూ తేడా కనిపించడంలేదనీ అంటాడు. అలా ఎదుకుందంటే, నిద్రాభావంతోనూ, అమానుష పోరాటాలతోనూ, నిండిన రాత్రుల ఫలితమంటాడు. ఆ సులో కంటే నిరంతరం ఆడినట్లు, ఈ మనుషులు కూడా పగలంతా అవిరామంగా శ్రమిస్తున్నారని చెబుతాడు.

ఒక రోజు లెవిన్‌సన్ గుర్రాల్ని పరీక్షిస్తూ, జియాచీకా వద్దకు వచ్చి, దాని జీనువిప్పించి, వీపంతా పుడుగా వుండడాన్ని చూసి, ఎంతో ప్రయత్నంతో గానీ కోపాన్ని అదుపులో పెట్టుకలేకోయాడు. అందుకోసం ఓ చెట్టు కొమమను నలిపేస్తూ, ప్లటూన్ కమాండర్ని పిలిచి చూపాడు, మెచిక్ మాట్లాడలేక, జీనుచేతో పట్టుకుని ఉండిపోగా, "మూర్ఖుడు.. ఎన్ని సార్ల ఆ విషయమై హెచ్చరించానో?" అన్నాడు క్యుబ్రిక్. "నేనూ అదే అనుకున్నాలే" అన్నాడు లెవిన్‌సన్ కొమమను విసిరేసి. ఆపై మచిక్‌ని తీవ్రంగా చూస్తూ, "ఈ నాటి నుడి నువ్వు క్వార్టర్ మాస్టర్ దగ్గర సామాన్లు మోసే కంచరగాడిదలతో పాటు వెళ్లు, గుర్రానికి నయమయ్యేదాకా" అన్నడు. మెచిక అవమానంతో, "నన్ను నమ్ము, ఈ సారి జాగ్రత్తగా చూస్తా" అనంటున్నా లెవిన్‌సన్ వినిపించుకోలేదు.

ఆహారపు కొరత కారణంగా వారు 'ఉలాహిన్స్కు' నదిపాయల వెంట ఒక చోటు నుండి మరో చోటుకు కాలుగాలిన పిల్లలాగా కొన్ని రోఉల పాటు ప్రతి రోజూ తిరిగారు. నిరంతరం శత్రువులతో పోరాడుతూ నడస్తూ వారు నీరసించిపోయారు.

శత్రు ఆక్రమణలోనికి పోని క్షేత్రాల సంఖ్య నానాటికీ తగ్గిపోతుంటే, ప్రతి రొట్టె ముక్కకూ కాసిన ధాన్యానికే తీవ్రమైన పోరాటం చెయాల్సి వస్తోంది. పాతగాయాలు మానకముందే, కొత్తగాయాలు కలుగుతున్నాయి. సైనికులు పెడసరంగా తయారయ్యారు. ఆత్మరక్షణే గాక, తనసైనికుల్లో నిగూఢాంతరాళాల్లో, వృత్యువును కూడా లెక్కచేయ్యనితనం పెనవేసుకునిపయందని లెవిన్‌సన్ భావించాడు. అదిలేకుంటే వారు ఉలాహిన్స్కు, తైగాలో ఐచ్ఛికంగా ప్రాణాలర్పించేవారు కాదనీ అతని ఆలోచన. అయితే, ఆ మహదాశయాన్ని కప్పిపుచ్చి పైకి కనిపించే రోజువారీ కొర్కెలైన నిద్రాహారాల అవసరాన్ని అతడు గుర్తించకపోలేదు. మామూలు బాదరబందీ తాము వహించి, అతిక్లిష్టమైన తమ అందరిభారాలను శక్తివంతులైన లెవిన్‌సన్,

బోక్లనోవ్, ద్యుబోవ్ వంటి వారిపై మోపారు వారికూడా నిద్రాహారాల అవసరమనే విషయాన్ని వారు మరిచిపోయారు. తమ నిద్రాహారాల బాధ్యతను కూడా వారిపైనే వేసేశారు.

లెవిన్‌సన్ ఈ పోరాటాలన్నింటిన్నీ స్వయగా నడుపుతూ సైనికుల మధ్యే గడపసాగాడు. వారి పాత్రల నుండే తానూ తింటున్నాడు. కాపలా వారిని పరీక్షిస్తూ అనేక రాత్రుల్ని నిద్రలేకుండా గడిపాడు. అయినా దళం మొత్తానికి నవ్వుమరిచిపోని వయక్తి అంతడొక్కడేనంటే అతిశయోక్తి లేదు. "నేను మీతోపాటే కష్టపడుతున్నాను. రేపునేను మృత్యువుకి గురికావచ్చు, లేదా ఆకలిబాధకు రాలిపోవచ్చు. అయినా ఎలా ఉత్సాహంగా పట్టుదలగా పనిచేస్తున్నాన్నో చూడండి. ." అంటూ అతడు తమతో అంటున్నట్లే దళం వారు భావించేవారు. అయినప్పటికీ దళానికీ, అతనికీ మధ్య ఒక్కో బంధము రోజురోజుకీ తెగిపోతోంది. అది తెగిపోయేకొద్దీ, తన పట్ల వారికి విశ్వాసాన్ని కలిగించడం అతడికి కష్టసాధ్యంగా మారసాగిది. క్రమంగా అతడు దళం పై పెత్తనం చేసే శక్తిగా మారిపోయాడు. అయితే అది అవసరమేనని, వారిచేత అధికారాన్ని ఉపయోగించైనా, ఆజ్ఞవినేట్లుగా చెయయడ అవసరమనీ అతడనుకున్నాడు. లేకుంటే, అది సైనిక క్రమశిణకు భంగకరమన్న సగతిని అతడు గ్రహించాడు. (కమ్యూనిస్టయిన లెవిన్‌సన్ ఈ విధంగా ప్రవర్తించడం వల్ల అతడిలో నిరంకుశ లక్షణాలు పెరిగిపోయాయనడానికి తార్కాణమని కొందరు పాఠకులు భావించవచ్చును. ఈ సందర్భంలో లెనిన్ చెప్పిన ఈ కింది విషయాలు గమనించండి. 1918 ఏప్రిల్, మే మధ్య లెనిన్ రాసిన "సోవియట్ ప్రభుత్వపు తక్షణ కర్తవ్యాలు" అనే వ్యాసంలో సుసంఘటిత సంస్థ" నియంతృత్వం అనే అంశంపై ఆయన పలు విషయాలు చర్చించాడు. సమిష్టికృషితో యిచ్ఛీకత్వం వుండాలనీ, వేలమంది తమయిచ్ఛను ఒక నియిచ్ఛకులోబరంద్వారా దీన్ని సాధించవచ్చుననీ ఆయన వివరించాడు. సమిష్టికృషిలో పాల్గొనేవారిలో ఆదర్శప్రాయమైన చిత్తశుద్ధీ, చైతన్యము, క్రమశిక్షణా ఉన్నప్పుడు, ఈలోబరచడం జంత్రమసమ్మేళనపు కండక్టరే మెత్తాని నాయకత్వంలో వుంటుందనీ, ఆదర్శక్రమశిక్షణ, చిత్తశుద్దీలేకపోతే, అది నిశితమైన నియంతృత్వ రూపాలు ధరించవచ్చుననీ ఆయన అన్నాడు. కానీ అది ఎల్లా వున్నపటికీ ఏకై యిచ్ఛకు బదులు చెప్పకుండా లోబడటం భారీ పరిశ్రమల్లో పరమ అవసరంమనీ నొక్కి చెప్పాడు. రైల్వేలో ఇది రెడు రెండ్లూ, మూడు రెట్లూ అవసరమని చెప్పాడు. ఈ సందర్భంగా రైల్వేల నిర్వహణ గురించి ఇచ్చిన ఉత్తర్వుల్లో వ్యష్టి నిర్వహణాధికార్లకు నియంతృత్వధికారాలు(లేదా అపరమిమితాధికారాలు) యిచ్చే శాసనాన్ని గురించి ఆయన ప్రస్తావించాడు. అయితే ఈ శాసనంలో అలా ఇవ్వబడ్డ నియంతృత్వాధికారాలు కార్మికుల హక్కులకు భంగకరమని మెన్షివిక్కులు, సోషిస్టు రివల్యుషనరీలు అరిచిగోలచేశారనుకోండి.. కానీ ఈ శాసనాన్ని ఆయన గట్టిగా సమర్థిస్తూ రైల్వేలో విచివనచర్యల్ని, శ్రమశిక్షణారాహిత్యాన్ని నిర్మూలించచేదుకు ఇది అత్యవసరమని ఆయన పేర్కొన్నాడు)

ఆ రోజుల్లో జరిగిన ఒక సంఘటన ఈ సతాయన్ని రుజావు చేసింది:

అసలే ఆహారం కొరతగా ఆ రోజుల్లో నదిపాయల్లో వారు చేపలు పట్టి, తద్వారా తమ అవసరాన్ని చాల వరకు తీర్చుకోసాగారు. చేపలు పట్టాలంటే ముందు వాటిని నీటిలో నిశ్చేష్టితం చెయ్యాలి. కరుస్తున్న చల్లటి నీటిలోకి దిగి వాటిని పట్టుకోవడానికి ఎవరూ ముందుకు వచ్చేవారు కాదు. అందువల్ల అంతా తమకులోకువగావుండే ఒక్క 'లావ్రుష్కా'ను నీళ్లలోకి తోసేస్తుండేవారు. లావ్రుష్కా అంతకుముందు పందుల కాపరి. తండ్రిఎవరో తెలీదు. ఎప్పుడూ సిగ్గుపడుతూ నత్తుతుంటడు. అతడికి నీళ్లంటే చెడ్డభయం. వాటిలోకి దిగేముందే గజగజవణికిపోయేవాడు. ఈ తతంగమంతా ఒక రోజు లెవిన్‌సన్ దృష్టిలో పడింది. "ఆగు" అంటూ అతడు లావ్రుష్కాను ఆపేశాడు. అతణ్ణి బలవంతంగా నీటిలోకి తోస్తున్న సైనికుడితో, "నువ్వేదిగరాదూ?" అనడిగాడు లెవిన్‌సన్. ఆ సైనికుడు కళ్లింత చేసుకుని, ఆనుకోకుండా, "పోనీ, నువ్వేదిగరాదూ?" అనేశాడు.

"నేను దిగను. నే చూసుకోవలసిన పనులు చాలా వున్నాయి. కానీ నువ్వయితే దిగాల్సిందే.. త్వరగా వెళ్లు.. లాగూ విప్పు.. చేపలు చెదిరిపోతున్నాయి.." లెవిన్‌సన్ స్థిరంగా అన్నాడు. "నేవెళ్లను. నేనేం వెర్రివెంగళాయనా?" సైనికుడు మొండిగా అని, వెనక్కి వెళ్లిపోసాగాడు. ఇదంతా చోదయంలా చూస్తున్న కొందరు ఆ సైనికుడి వంక మెచ్చుకోలుగా, లెవిన్సన్ వంక వెక్కిరింపుగా చూడసాగారు. దీంతో గోంచరెంకో ఆ సైనికుణ్ణి తిట్టి, తానే నీళ్లల్లోకి తిగబోతుంటే, లెవిన్‌సన్ అతణ్ణి ఆపేశ్వాడు. ఆనక మొదటి సైనికుణ్ణి దిగమని ఆజ్ఞాపించాడు. అయితే అతడు పశ్చాతాపడ్డాడుగానీ, ఇతరుల ముందు వెనకడుగు వెయ్యడానికి ఇష్టపడక, నేను వెళ్లనని మొదటే చెప్పాను" అని ధిక్కరించాడు. వెంటనే లెవిన్‌సన్ తన రివాల్వర్ తీసి గురిపెట్టి, , అతడివంకకు నడిచాడు. ఫలితంగా ఆ సైనికుడు భయపడుతూ, తడబాటుతో లాగూడదీసి నీటిలోకి దిగాడు.

ఆ క్షణాన మిగిలిన అందరి సైనికుల్లోనూ తనపట్ల చూపించిన భయగౌరవాల్ని లెవిన్‌సన్ గమనిచాడు. వారిలో సానుభూతి ఏమాత్రం లేదు. అంతేగాక తాను వారిపైన గల ఒకానొక విరుద్ధశక్తి మాత్రమేననని కూడా అతను గ్రహించాడు. అయినా ఆ శక్తి సరైన దేననీ, దాన్ని కొనసాగించవలసిందేనన్న సగతి కూడా అతడు గ్రహించాడు. ఆనాటి నుండి అతడు, ఆహారసేకరలోగానీ, విశ్రాంతిలోగానీ తడపటాయింపులు పక్కన బెట్టేశాడు. లోగడ మొరోజాక రయాబెట్స్ పొలంలో పుచచకాయలు తొంగిలించడానికీ, ఇప్పుడు తాము చేస్తున్నదానికీ గల భేదాన్ని కూడా అతడు గుర్తించాడు.

లెవిన్‌సన్ తన దళంతో ఇప్పుడు ఇరోహేజ్ నదీముఖద్వారానికి దగ్గరలోని ఒక కొరియన్ క్షేత్రాన్ని చేరుకుని, దారిలో దొంగసారా రవాణా చేసే 'సిర్సా' అనే వ్యక్తిని చూశాడు. అతడు తెలిసిన వాడే "నీకోసం జపాను వాళ్లు, రోల్చకతా గాలిస్తున్నారు" స్త్రిర్సా లెవిన్‌సన్‌కు చెప్పాడు. "వాళ్లకు నేను దొరకను గానీ, ఇక్కడ మాకు మేతేమన్నా దొరుకుతుందా?" అడిగాడు లెవిన్‌సన్. "వాళ్లు మూర్ఖులు కాదు. పైగా పెద్దమొత్తంలో బహుమతి కూడా ప్రకటించారు. ఇక మత విషయం.. అదే మాం॥ ఇక్కడలేదు. కొరియావాళ్లే నల్లరొట్టె(రాగిరొట్టె)తో గడుపుతున్నారు. ఓ పెద్ద పంది అయితే వుందిగానీ, శీతాకాలానికంతటికీ వారందరికీ అదొక్కటే ఆహారం. దాన్ని వారు పూజిస్తున్నారనుకో" చెప్పాడు స్త్రిర్సా. వృద్ధుడయిన ఆపందియజమాని కాళ్లావేళ్లా పడి బతిమాలుతుంటే లెవిన్‌సన్‌కి జాలి కలిగిందిగానీ, తన వెనక ఆకలితో నకనకలాడుతున్న 150 మంది వ్యక్తుల సంగతి గుర్తొచ్చి, తనమనసును గట్టిపరుచుచుకుపోయింది. రక్షణలేని రైతులెందరో తన కాళ్లమీద వాలినట్లయింది గానీ, ఇతర సైనికులతో పాటు తానూ ఆకలి కొద్దీ ఆ పందిమాంసాన్ని అవు రావురుమంటూ తిన్నాడు.

మరుగాను జరిగిన తీవ్ర పోరాటంలో దాదాపు 30 మంది పార్టిజాన్లను పోగొట్టుకున్నాక, ఇరోహేజ్ లోయను చేరుకోగలిగాడు లెవిన్‌సన్. కోల్చక అశ్వక బలం అతన్ని వెన్నంటే తరుముతోంఇ. సామాన్లు మోసే గుర్రాల్ని వెనకేవదిలేయ్యాల్సివచ్చింది. ఆ విధంగా ఆస్పత్రికెళ్లేబాటను మధ్యాహ్నానికి ఎలాగో చేరుకున్నాడుగానీ, తీవ్రంగా అలసిపోయి, జీను మీదకూర్చోలేని పరిస్థితి వచ్చింది. గుండె అతిమెల్లగా, ఏక్షణంలోనో ఆగిపోయేలా కొట్టుకొంటోంది. నిద్రకై తపించిపోయాడు. కాస్తతలను వాల్చాడో లేదో,

వెంటనే కునుకు పట్టేసింది. కానీ లోపలనుండి వచ్చిన కంపనతో చుట్టూ చూశాడు. ఎవరూ తన నిద్రించిన విషయాన్ని గమనించినట్లు లేరు. అతడు కూడా తమలాగా అలిసిపోతాడనీ, నిద్రకై తపిస్తున్నాడనీ వారు అనుకోరు. "నాలో ఇంకా అవసరమైన బలం మిగిలివుందా?" తనని తానే ప్రశ్నించుకున్నాడు లెవిన్సన్.

దళం ఆస్పత్రిని చేరుకున్నాక, డాక్టర్ని ఒక పొద వెనకి తీసుకెళ్లి లెవిన్సన్ మాట్లాడుతుంటే, యాదృచ్ఛికంగా వారికి కనబడకుండా ఉన్న మెచిక్ విన్నాడు. ఆ ప్రాంతంలో దళం ఎక్కువకాలం నిలబడలేదని లెవిన్సన్ చెబుతున్నాడు. మిగిలిన మార్గమల్లా బాగా ఉత్తరాన ఉన్న "త్యూజోవాక" లోయకు చేరుకోవడమేననీ, అక్కడికి వెళ్లాలంటే పర్వతాలపై నడిచి వెళ్లాల్సి వుంటుందనీ, అతడన్నాడు. మరి అంతదూరం వెళ్లాలంటే, ఫ్రాలోవ్ సంగతి ఎలా అని డాక్టర్ స్టాషింస్కీ అడగడంతో లెవిన్సన్ ఆలోచనలో పడిపోయాడు". అయితే అతడితోపాటు నేనూ అక్కడే ఉండిపోతా అదినా విధి" అని డాక్టరు చెప్పగానే, "రేపు మధ్యాహ్నానికల్లా జపానువాళ్లు ఇక్కడికి రావడం ఖాయం. అప్పుడు అతడితోపాటు చనిపోవడమేనా నీ విధి?" అడిగాడు లెవిన్సన్. "ఇక మిగిలింది ఒకే మార్గం. ." అంటూ అతడు దాన్ని చెప్పేందుకు ప్రయత్నించాడు గానీ, దాన్ని మాటలతో చెప్పలేకపోయాడు. అతడి భావాన్ని డాక్టరు అర్థం చేసుకుని బెదిరిపోయాడు. అతన్ని చంపాలనుకుంటున్నారని మెచిక్ గ్రహించాడు. అతడు ఆరోగ్యవంతుడయ్యే అవకాశంవుదా అన్న లెవిన్సన్ ప్రశ్నకు, లేదని డాక్టరు జవాబిచాడు." అది కొంత వరకూ పరిస్థితిని తేలిక పరుస్తుంది.." తన ఆత్మవంచనా ప్రయత్నానికి లెవిన్సన్ సిగ్గుపడ్డాడు గానీ, అతని హృదయ భారం కొంత తగ్గింది.

మరునాడు జరిగిన తీవ్ర పోరాటంలో దాదాపు 30 మంది పార్టిజవాన్లను పోగొట్టుకున్నాక, ఇరోహెజ్ట్ లోయను చేరుకోగలిగాడు లెవిన్సన్. కోల్చక అశ్వక్ బలం అతన్ని వెన్నంటే తరుముతోంది. సామాన్లు మోసే గుర్రాల్ని వెనకే వదిలేయ్యాల్సి వచ్చింది. ఆ విధంగా ఆస్పత్రికెళ్లేబాటను మధ్యాహ్నానికి ఎలాగో చేరుకున్నాడుగానీ, తీవ్రంగా అలసిపోయి, జీను మీదకూర్చోలేని పరిస్థితి వచ్చింది. గుండె అతిమెల్లగా, ఏక్షణంలోనో ఆగిపోయేలా కొట్టుకొంటోంది. నిద్రకై తపించిపోయాడు. కాస్త తలను వాల్చాడో లేదో,
వెంటనే కునుకు పట్టేసింది. కానీ లోపల నుండి వచ్చిన కంపనతో చుట్టూ చూశాడు. ఎవరూ తన నిద్రించిన విషయాన్ని గమనించినట్లు లేరు. అతడు కూడా తమలాగా అలిసిపోతాడనీ, నిద్రకై తపిస్తున్నాడనీ వారు అనుకోరు. "నాలో ఇంకా అవసరమైన బలం మిగిలివుందా?" తనని తానే ప్రశ్నించుకున్నాడు లెవిన్సన్.

దళం ఆస్పత్రిని చేరుకున్నాక, డాక్టర్ని ఒక పొద వెనక్కి తీసుకెళ్లి లెవిన్సన్ మాట్లాడుతుంటే, యాదృచ్ఛికంగా వారికి కనబడకుండా ఉన్న మెచిక్ విన్నాడు. ఆ ప్రాంతంలో దళం ఎక్కువకాలం నిలబడలేదని లెవిన్సన్ చెబుతున్నాడు. మిగిలిన మార్గమల్లా బాగా ఉత్తరాన ఉన్న "త్యూజోవాక" లోయకు చేరుకోవడమేననీ, అక్కడికి వెళ్లాలంటే పర్వతాలపై నడిచి వెళ్లాల్సి వుంటుందనీ అతడన్నాడు. మరి అంతదూరం వెళ్లాలంటే, ఫ్రాలోవ్ సంగతి ఎలా అని డాక్టర్ స్టాషింస్కీ అడగడంతో లెవిన్సన్ ఆలోచనలో పడిపోయాడు. అయితే "అతడితోపాటు నేనూ అక్కడే ఉండిపోతా అదినా విధి" అని డాక్టరు చెప్పగానే, "రేపు మధ్యాహ్నానికల్లా జపానువాళ్లు ఇక్కడికి రావడం ఖాయం. అప్పుడు అతడితోపాటు చనిపోవడమేనా నీ విధి?" అడిగాడు లెవిన్సన్. "ఇక మిగిలింది ఒకే మార్గం. ." అంటూ అతడు దాన్ని చెప్పేందుకు ప్రయత్నించాడు గానీ, దాన్ని మాటలతో చెప్పలేకపోయాడు. అతడి భావాన్ని డాక్టరు అర్థం చేసుకుని బెదిరిపోయాడు. అతన్ని చంపాలనుకుంటున్నారని మెచిక్ గ్రహించాడు. అతడు ఆరోగ్యవంతుడయ్యే అవకాశంవుదా అన్న లెవిన్సన్ ప్రశ్నకు, లేదని డాక్టరు జవాబిచాడు." అది కొంత వరకూ పరిస్థితిని తేలిక పరుస్తుంది.." తన ఆత్మవంచనా ప్రయత్నానికి లెవిన్సన్ సిగ్గుపడ్డాడు గానీ, అతని హృదయ భారం కొంత తగ్గింది.

గ్లాసులో మందు పోస్తున్న డాక్టరుతో మెచిక్ కలబడ్డాడు "ఆగు నేనంతావిన్నా" అంటూ. కానీ డాక్టరు అతణ్ణి బయటకు నెట్టే సరికి, మెచిక్ పారిపోయాడు. ఆపై మందు తాగమన్నాడు డాక్టరు. రోగి, డాక్టరు ఇద్దరి చూపులూ కలిశాయి. వారు ఒకరినొకరు అర్థం చేసుకున్నారు. ఫ్రాలోవుకు ఆశ్చర్యం కలగలేదు. భయంగానీ, ఆవేశంగానీ, ద్వేషం గానీ కలగలేదు. ఇంత కాలం ఈ బాధంతా ఎందుకు పడ్డానా, చావంటే భయంపట్టుకుని, జీవితాన్ని పట్టుకుని ఎందుకు వేలాడినా అనుకున్నాడు చావేతనను ఈ బాధలన్నింటినుంచీ విముక్తి చేస్తుంది గదా అనుకొని ఆశ్చర్యపడ్డాడు. మొదటి సారిగా తనపై తనకు, స్టాషింస్కీ మీద కూడా నేమో జాలి కలిగింది. అతడు డాక్టర్తో చెప్పాడు. "నువ్వెప్పుడైనా 'సుచాన్స్క్' వెళ్లడం తటస్థిస్తే, మావారిని నా కోసం విచారించవద్దని చెప్పు. . అంతా ఒక చోటికే కదూ వెళ్లేది.. అక్కడ గనిలో నాకో చిన్నారి కొడుకున్నాడు. వాడి పేరు ఫెద్యా.. పరిస్థితులన్నీ ప్రశాంతంగా ఉన్నప్పుడు.. వాడికేమైనా కావలిస్తే.. సరే" అంటూ అతడు గ్లాసు అందుకొని గడగడ తాగేశాడు.

మెచిక్ తూలిపోతూ అడవిలోకి పరుగెత్తుకు పోతూ వారాయనను గుద్దుకున్నాడు. ఆమెతో ఫ్రాలోవు విషయం చెప్పినా ఆమె వినిపించుకోక, అతణ్ణి కౌగిలించుకోపోయేసరికి, అతడు తప్పించుకున్నాడు. మర్నాడు ఫ్రాలోవును సమాధి చేశారు. పీకా ఆ రాత్రి ఎటో వెళ్లిపోయే సరికి, అతడి గుర్రం ఉసురుమంటూ తిండిలేక నిలబడింది. దీనికి మర్నాడు బరువులెత్తవదదని లెవిన్సన్ చెప్పాడు. ఆపై అంతా గుర్రాలెక్కారు. గుర్రాలు చేసిన సన్నని దారి గుండా దళం ఓ రోసైన శిఖరాన్ని అధిరోహిస్తోంది. గుర్రాల కాళ్ల తగిలి దొర్లే బండరాళ్లు బడబడ శబ్దం చేస్తున్నాయి. ఎడినగడ్డ నిలువెత్తు ఎదిగి, గుర్రాల కాళ్ల కిందనలిగి శబ్దం చేస్తోంది. గడ్డంపెరిగిన దుప్పులు దీనంగా కనిపిస్తున్నాయి. క్రూరమృగం బొబ్బలు పెడుతోంది. క్యూబక్ ప్లటూన్ వెనకపడింది. "నీతోక ముడుచుకోకపోతే ఎవరైనా కటుక్కున కొరుకుతారు" అని లెవిన్ సన్ పంపిన సదేశాన్ని ఆర్డర్లీ ఎఫిమ్కా అతికష్టమ్మీద క్యూబక్కి చేరేశాడు. అందుకు జవాబుగా అతడు, తన తోక మాటకేంగానీ, నీ ముక్కుపగలకుండా జాగ్రత్తగా చూసుకో అని చెప్పాడు.

మొరోజ్కా వార్యాకు దూరంగా ప్రయాణించడం చూసిన ఎఫిమ్కా, "ఎందుకు దెబ్బలాడుకున్నారు?" అనడిగాడు. "దాన్ని వదిలేశాను" చెప్పాడు మొరోజ్కా. "అంతేలే.. ఇలాంటివి జరుగుతుంటాయి" అని తనదారిన తనువెళ్లాడు ఎఫిమ్కా. "వాళ్లంతా అదృష్టవంతులు.." అనుకున్నాడు మొరోజ్కా ప్రయాణిస్తూ, "ఉదహరణకు లెవిన్సన్ని తీసుకుంటే.. అధికారం చేతులోవుంది.. అంతా గౌరవిస్తారు.." అనుకుటూ, "నాయిష్టం వచ్చినట్లు నేను చేస్తా" అనుకున్నాడు. లెవిన్సన్ డొక్క పోటుతో విపరీతంగా బాధపడుతున్నారని గానీ, అంతేగాక ఫ్రాలోవ్ మృతికి బాధ్యతవహిస్తున్నాడని గానీ, అతని తలకోసం పెద్దబహుమతి ప్రకటించబడిందని కానీ మొరోజ్కాకి తెలీదు. తానైతే పూర్వమూ, ఇప్పుడూ కూడా మోసానికి గురయ్యాననీ, ఎటుచూసినా దగాయే అలుముకున్నదని కూడా అతననుకున్నాడు. చిన్నప్పట్నుంచీ తాననుభవించిన కష్టాలకు, కన్నీటికీ విలువలేదనీ, వాటికి గుర్తింపే లేదన్న కోపం ఆవరించిందతనికి. తనకు లభించిందేమిటి? ఓ గుండు దెబ్బతగిలితే, ఫ్రాలోవు లాగా తానూ చనిపోతాడు తన కోసం విచారించే వాళ్లే వుండరు. గడచిన 27 సంవత్సరాల నుంచీ- లెవిన్సన్,

బాక్లనోవ్, ద్యుబోవ్‌లు పయనించే మార్గాన్ని కనుగొనాలని ఎంత ప్రయత్నించినా, ఎవరో ఒకరు మధ్యలో అడ్డుపడుతున్నారు. అయితే అలా తనకి తానే అడ్డుతగులుతున్న సగతి అతడికే తెలీదు. ఇప్పుడు మెచిక్ వంటి వారి నైచ్యం కారణంగా బాధపడుతున్నానన్నభావన అతడిలో ఆత్మసంతృప్తిని కలగజేసింది. ఆ రోజు మధ్యాహ్నం అతడు గుర్రానికి నీళ్లు పెడుతుండగా, మగ్గు దొంగ (లోగడ అతడు మొరోజ్కా మగ్గును దొంగిలించి, అది తనదేనని అబద్ధమాడాడు) వచ్చి, రహస్యంగా వార్యా మెచిక్‌ల ఉదంతం గురించి చెప్పబోయాడుగానీ, మొరోజ్కా వినిపించుకోలేదు. అయినా అతడు కృత్రిమ సానుభూతిని ఒలికించబోయేసరికి, మొరోజ్కాకు మండుకొచ్చి, ఒక్క తన్నుతన్నాడు. దాంతో ఇద్దరూ కలబడ్డారు. గోంచరెంకో వచ్చి విడదీసి, మొరోజ్కాని లాక్కుపోయాడు. గొంచరెంకో యొక్క అపార బలాన్ని మొరోజ్కా ఎంతో మెచ్చుకున్నాడు. ఆ తర్వాత ప్రయాణమంత అతడు గోంచరెంకో పక్కనే ఉన్నాడు.

మెచిక్ ఆస్పత్రిని వదిలి వెళ్లినా, వార్యా అతన్ని మరిచిపోలేదు. అతడు తన మనసును గాయపరచాడని మరిచిపోవడానికి ప్రయత్నిస్తూనే, అతణ్ణి గురించి కలలు కనసాగింది. అతడు తనవెనకే వస్తున్నా, వెనకిక తిరిగి చూడలేదు. అతడే తన వద్దకు రావాలనుకున్నా, తర్వాత తానే అతని వద్దకు వెళ్లాలని నిశ్చయించుకుంది. ఇంతలో ఆమెనంటి వస్తున్న ఛిజ్, ఆమె పక్కన జేరి తన కోర్కెను అంగీకరించమని కోరాడు. మెచిక్‌ను గురించిన ఊహల్లో తేలిపోతున్న ఆమె, మొదట ఛిజ్‌ని పట్టించుకోలేదు. తర్వాత కూడా అతడి జుగుప్సాకర అవసరాన్ని అసహ్యించుకుంది. ఆ రాత్రి ఓ సన్నటి లోయలో దళం విడిది చేయగా, అంతా చలికి తట్టుకోలేక చలి మంటలు వేసుకున్నారు. ఆఖరిగా ఉన్న మంట వద్ద మెచిక్‌ని కనుగొంది. అక్కడే ఛిజ్ కూడా ఉన్నాడు. ఆమె మెచిక్‌తో మాటలు కలపబోతే, అతడు స్పందించలేదు. ఆమె అక్కణ్ణుంచి వెళ్లిపోతుంటే, ఛిజ్ ఆమెను వెంబడించి ఒత్తిడి చేసే సరికి, ఎవరైతే ఏమిటన్న నిర్లిప్తతతో ఆమె లొంగిపోయింది.

ప్రయాణంలో గోంచరెంకోతో మాటల సందర్భంగా మొరోజ్కా, తనకు రైతులంటే అసహ్యమనీ, తనకు కూడా తాత పినతండ్రులున్నారనీ, వాళ్లు శుద్ధ జిత్తులమారులూ, పిరికిపందలూనని చెప్పాడు. అయితే గొంచరెంకో అతడితో ఏకీభవించలేదు. "మనందరిలోనూ రైతున్నాడు. తేడా అల్లా మనం రైతుల బూట్లునే వేసుకోమంతే.. అంటే మనమంతా రైతుల పరిస్థితుల్లనే ఉన్నాం" అన్నాడతడు. మధ్యలో ద్యుబోవ్ అందుకుని, తనకు గ్రామంలో బంధువులు లేరుగానీ, రైతులంటే అసహ్యమేనని చెప్పాడు. తనను ద్యుబోవ్ బలపరిచినందుకు మొరోజ్కా సంతోషించాడు. అయినా గోంచరెంకో నిరుత్సాహం చెందక, "నాకూ బంధువులు లేరు లే"అన్నాడు. "అయితే మీగని చిన్న గ్రామమేకదా! ఆ ఊళ్లో ప్రతి వారికీ చిన్న స్వంత తోట వుంది. సగం మంది శీతాకాలం గనిపనికి వెళ్లి, వేసవిలో తిరిగొస్తారు. మీ ఆడవాళ్లు తోటల్లో పనిచేస్తారు. అంటే మీ చుట్టూ ఉన్న వారంతా గ్రామస్తులే. అప్పుడు మీరు మాత్రం ఏమవుతారు?" అని ప్రశ్నించాడు. దుయబోవ్‌కు అంగీకరించక తప్పలేదు. గొంచరెంకో వాదన చూసి మొరోజ్కాకు అనిపట్ల మరింత గౌరవం కలిగింది. దాంతో అతడు గోంఛరెంకో నిత్యసహవాస ధర్మమా? అని తాను సైతం చైతన్య వంతుడైన పార్టిజాను అని భావించసాగాడు. క్రమబద్ధమైన జీవితంతో, యుద్ధంలో ప్రథమ శ్రేణిలో ఉంటూ, మాట తప్పక ఉండటంతో అంతా అతణ్ణి మెచ్చుకోసాగారు. అతడి జీవితం, గోంఛరెంకో జీవితం వలె, పొల్లు భావాలకు, సొల్లు కబుర్లకూ తావు లేని నియమబద్ధమైన జీవితంగా మారింది.

ప్రయాణం అయిన రోజున త్వరలోనే తగిన ఆశ్రయం, ఆహారం దొరుకుంతుందన్న హుషారుతో సాగుతోంది. కానీ ఇంతలోనే దళాన్ని నిలిచిపొమ్మని ఆదేశాలొచ్చాయి. "మెతాలిత్సాను" పిలిచి పై ప్రాంతాన్ని తనిఖీ చేసేందుకు పంపారు. ఆ రాత్రి ఆకలితో అక్కడే గడపాలన్న ఆజ్ఞ విని అంతా గునిశారు. హిరోహెత్జ్ నది కింది భాగం శత్రు ఆక్రమణలో వుందేమోనన్న అనుమానంతో లెవిన్‌సన్ ఆ రాత్రి అక్కడే గడపాలని నిశ్చయించాడు. శత్రువులక్కడ ఉన్నా గానీ, వారిని చీల్చుకుని మరీ "మ్యదవాకొ"లోయను చేరగలమని, అక్కడ తమనుగానీ, గుర్రాలగ్గానీ తిండి కొరత ఉండదని అతడు ఆశించాడు. ఈ ప్రయాణమంతా విపరీతమైన నడుం నెప్పి అతన్ని బాధించింది. విశ్రాంతి, మంచి ఆహారంతోనే అది పోతుంది. కానీ అవి ఇప్పట్లో లభ్యం కావు గాబట్టి, ఇది మామూలు జబ్బేనని అతడు సర్దిచెప్పుకున్నాడు.

"మనం ముందుకు పోదాం" రెట్టించాడు క్యుబ్రక్. ఆకలి అతణ్ణి నిలవనీయడం లేదు." సరే ఆగలేకపోతే నువ్వేళ్లు, నీ స్థానంలో మరొకర్ని పెట్టి" అన్నాడు లెవిన్‌సన్. రోడ్డు వెంట సాయుధ కాపలపెట్టు" కొనసాగించాడతడు. 'బోధపడింది' అనక తప్పలేదు క్యుబ్రక్‌కి. దొంగముండా కొడుకుని తిట్టుకున్నాడుగానీ, లెవిన్‌సన్ పై కోపంతోపాటు గౌరవం, అలాగే తనపై తనకే జాలీ కూడా కలిగాయి అతడికి.

లెవిన్‌సన్ ఆ రాత్రి చిక్కటి చీకట్లోనే అకస్మాత్తుగా లేచి ముందుకు సాగాడు. కాలవ ఒడ్డున కంగారు స్వరంతో 'ఎవరది?' అనే ప్రశ్న. అది మచిక్‌దని గ్రహించి, అతడి దగ్గరకెళ్లాడు లెవిన్‌సన్. తన రైఫిల్ ఎందుకు బెట్టు చేస్తుందో అతడికి అర్థంగాక తడుముకుంటున్నాడు. మెచిక్ సెంట్రీడ్యూటీలోకి వచ్చి అరగంటే అయినా, అదొక యుగంలా అనిపిస్తోందతడికి, అకస్మాత్తుగా ఓ కొత్త ఆలోచన వచ్చి సతమతమవుతున్నాడు. అతనికొకప్పుడు పట్నవాసం విసుగొచ్చి దళంలోకి వచ్చాడు. ఇప్పుడిక్కడ విసుగొచ్చి పట్నానికి వెడితే బాగుంటుందనుకున్నాడు.

మాటల సందర్భంగా, "ఎవర్నైనా పట్నం పంపించే పనుంటే, నేవెడతా" అన్నాడు మెచిక్. "ఏం, నువ్వే ఎందుకు ?" అంటే, "నాకు పట్నం బాగా తెలుసు. నేనక్కడ పని చేస్తున్నప్పుడు రహస్యపత్రాలు చాలా సార్లు తీసుకెళ్లా" అన్నాడతడు. నువ్వెక్కడ పని చేశావంటే, ' మాగ్జిమలిస్టులతో' (సోషలిస్టు రివల్యూషనరీలలో ఒక వర్గం) అన్నాడు మెచిక్. తాను ఎవరినీ పంపాలనుకోవడంలేదని లెవిన్‌సన్ చెప్పాడు. అయినా మెచిక్ వదల్లేదు. తొట్రుపడుతుతునే, "నా వల్ల ప్రయోజనం ఏం లేదని, భయస్థుణ్ణనీ అనుకోకు, నిజానికి నేను అసమర్థుణ్ణి. ఏ పక్షానికీ చెందను. నా కిక్కడ స్నేహితులెవరూ లేరు. సాయపడరు. అది నా తప్పా? అంతా నన్ను మోటుగా వేళాకోళాలాడారు. నేను మరింత బలశాలినయితే, నా మాట వినివుందురు, తనతోటి కామ్రేడ్స్ వద్దదొంగిలించి అయినా సరే పొట్టని నింపుకోడం వీరికి తప్పుకాదు. రేపు వీరు కొలాచక్‌కుపట్టుడినా, అక్కడా ఇలాగే సేవ చేస్తారనిపిస్తోంది. నేను మాత్రం ఆ పని చెయ్యలేను.." అన్నాడు.

లెవిన్‌సన్‌కు అతగాడి ఆంతర్యం అర్థమయింది. "ఓహో వీడి సంగతి ఇదా! భలే కుక్కల తక్కెడ సరుకే" అనుకుంటూ, "ఇంతకు మువ్వనేది ఇక్కడి ప్రతివాడూ తన పొట్టనింపుకోవడమెలా అన్న ఆలోచనలోనే వుంటారని కాదూ.. కానీ అలా అనుకోవడ శుద్ధపొరపాటు.." అంటూ అలా అనుకోవడం ఎలా పొరపాటో వివరించేందుకు ప్రయత్నించాడుగానీ, తాను చెప్పేది అతడి బుర్రలోనికి ఎక్కడం లేదని అర్థమై, మరింత ముఖ్యమైన విషయాల్ని, తను చిన్నతనంలో ఎంతో కష్టపడితేగానీ అర్థం చేసుకోలేకపోయిన విషయాల్ని చెప్పాలని భావించాడు. అయితే అదంతా అనవసరమనీ, ఇప్పుడు కావలిసింది ఆచరణ అనీ గ్రహించి, ".. మరయితే ఇప్పుడు నీ విషయంలో ఏం

చెయ్యాలంటావ్?" నిజానికి తప్పంతా నీదే, ఇతరుల్ని ఈ బురదలోకి లాగకు వెర్రివాడా.. వాళ్ళు విన్నారంటే, చీల్చేస్తారు.. కనుక సరిగ్గా ఆలోచించు. ."అన్నాడు చివరికి. మళ్లీ ఒక్కసారిగా, నీ రైఫిల్ దగ్గరుంచుకునేప్పుడు దాని కాచ్ మూసెయ్యడం మంచిది" అని సలహా ఇచ్చాడు. తను వచ్చినప్పుడు చూసిందాన్ని మర్చిపోకుండా, అక్కణ్ణుంచి వెళ్లిపోయేముందు, ఇంకా నువ్వు జియాచికా గుర్రం మీద స్వారీ చేస్తున్నావా? అని అడిగేసరికి, మెచిక్ అవునన్నాడు. "రేపు నీకు పీకా వాడిన నిష్కా నిస్తాం. . ఏంచాలా?" అంటే, 'చాలు' అన్నాడ మెచిక్ దీనంగా.

అక్కణ్ణుంచి వెళ్లిపోతూ, ఒట్టి కుక్కల తక్కెడ రకమనీ, ధైర్యసాహసాలు లేని క్షుద్ర కీటకమనీ అనుకున్నాడు. ఇటువంటి చెత్తరకాన్ని ఉత్పత్తి చేసిన దేశం ఎంతటి దౌర్భాగ్య దేశం అనుకుని విచారించాడు. కోట్లాది జనం శతాబ్దాల తరబడి నోరెత్తకుండా, దారిద్ర్యంలోనూ, మురికిలోనూ జీవిస్తూ, తాతల నాటి పాత పరికరాలతో వ్యవసాయం చేస్తూ, దగుల్బాజీ దేవుణ్ణి నమ్ముతూ, తెలివి ఏమాత్రం లేని మనదేశంలో తప్ప, ఇలాంటి వారు ఇంకెక్కడుంటారు? అనుకున్నాడు. ఇలాంటి దారిద్ర్యాన్ని, మూర్ఖత్వాన్ని అధిగమించడమే తన జీవిత లక్ష్యం. అలా కానప్పుడు ఇప్పటి లెవిన్‌సన్‌గాక, మరెవడో అయ్యుండేవాడు. శక్తివంతమైన నూతన మానవుడు సృష్టించబడాలి. ఇలాంటి పరిస్థితుల్లో అది సాధ్యమేనా? అనుకున్నాడు.

ఎప్పుడైనా నేను మెచిక్‌లా ఉన్నానా? తన బాల్యంలోగానీ, ప్రథమ యవ్వనంలోగానీ తానెలా వుండేవాడో జ్ఞప్తికి తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు గానీ, అదంత సులభంగా కనిపించలేదు లెవిన్‌సన్‌కి. అతనికెప్పుడు జ్ఞాపకమున్నదల్లా బలహీనంగా, పెద్దకళ్లతో, ఏదో అదృష్ట పక్షి (మత నమ్మకం)వస్తుందని ఆశగా చూసే ఒక యూదు కుర్రాడు.. ఆనాడు పక్షి రానందుకు నిరాశతో దాదాపు ఏడ్చేసిన కుర్రాడు.. ఇలా ఎంతో మంది ఆశతో ఎదురు చూస్తుంటారో తెలుసు.. అలాంటి ఊహల్ని కట్టిపెట్టేశాడు తను. "ఉన్నదాన్ని ఉన్నట్టు చూడ్డం, ఉన్న ప్రతిదాన్నీ మార్చడం, మార్చిన ప్రతిదాన్నీ అదుపులో పెట్టం.." ఈ అతిసూక్ష్మమైన, మానవుడు సాధించగలిగిన దానిలో అతిక్లిష్టమైన జ్ఞానాన్నతడు సాధించాడు. "ఎలాగైనా నేనతనికంటే శక్తిమంతుడ్ని" అనుకున్నాడతడు. అప్పుడొక విధమైన విజయగర్వం, ఎవరికీ అర్థంకానిది.. మొలకెత్తింది. "నేను చాలానే కోరుకుంటున్నాను, కానీ చాలానే చెయ్యగలను.. అదీ అసలు లేడా.." అనుకుని, ఎక్కడికనే స్పృహలేకుండా ముందుకు సాగాడు. అప్పుడతనిలో ఒక నూతన శక్తి పెల్లుబికి, ఓ ఉన్నత పథానికి (అతను నమ్మే నూతన మానవుని వంకేమో)ఎత్తుకెడుతోంది. అతడు మావంక తిరిగివచ్చేసరికి, చల్లిమంటలన్నీ ఆరిపోయాయి. ఇంకా పూర్తిగా ఆరని తన మంటవద్దకు వెళ్లి, దాంట్లో ఎండుగడ్డి, రెమ్మలూ వేసి మంట చేశాడు. అలసటతో అతని తల దిమ్మెక్కింది. బాక్లనోవ్ పక్కన పడుకుని, అటూ ఇటూ శరీర వైఖరి కుదిరే వరకూ దొర్లుతూనే ఉన్నాడు. కళ్లు మూశాడో లేదో ఎక్కడికో తేలిపోతున్నట్లు, ఈదుతున్నట్లు అనిపించింది. అతడు తన శరీర స్పృహ కోల్పోయి, అంతులేని అంధకార సుడిగుండంలో పడిపోయాడు.

మూడో భాగం : మెతెలిత్సాను పర్యవేక్షణకు పంపేటప్పుడే, ఆ రాత్రికి తిరిగి వచ్చెయ్యమని లెవిన్‌సన్ చెప్పాడు గానీ, అతను వెళ్లాల్సిన గ్రామం చాలా దూరంలో వుంది. సాయకాలం 4గంటలప్పుడు అతడు వేగంగా గుర్రాన్ని దౌడుతీయిస్తూ అంతులేని తైగాను దాటేప్పటికే చిమ్మచీకటిపడింది. చివరికి ఓ శిథిల గృహంచేరి, ఎలాగోదాని పైకెక్కి చుట్టూ చూశాడు. ఎదురుగా ఒక పెద్ద లోయ, రెండు వైపులా చల్లారిన అగ్ని పర్వతాలు అక్కడి నుడి ఒక దిబ్బపైకి వెళ్లి చూస్తే, ఎడమవైపున ఒక కాలువ, దానికి దూరంగా ఒక చలిమంటా, దాని దూరంగా ఒక గ్రామంలో లైట్లూ కనిపించాయి. కుడివైపున లావా ప్రవాహం దూరంగా పోయి అదృశ్యంకాగా, దాని గట్టున దట్టమైన అడవి.. 'బహుశా అక్కడ తప్పకుండా ఒక ఊబిగొయ్యి వుండి వుంటుంది'అనుకున్నాడు మెతెలిత్సా.

బాగా చలివేస్తున్నందున, ముందు చలిమంట దగ్గరకు వెడుతూ, రివాల్వర్‌ను చక్కా కింద దోపుకుని, దాని ఒరను జీను కింద పెట్టాడు. మంట దగ్గరకెళ్లేసరికి, అక్కడున్న ఓ కుర్రాడు అతన్ని చూసి భయపడి ఆత్మరక్షణ కోసం ఒక బాకును, మరో చేత్తో కమ్చీని పట్టుకోగా, అతడి చెరిగిన బట్టలూ, ఒక శరీరం చూసి మెతెలిత్సాకు నవ్వాగిందికాదు. చివరికి ఇద్దరూ నవ్వుకుని స్నేహితులైపోయారు. తనది హానిహెజ్ గ్రామమనీ, గుర్రాలు కొనడానికొచ్చాననీ మెతెలిత్సా చెప్పి ఆ గ్రామం అనుపానులు అడిగాడు. తన యజమాని దగ్గర గుర్రాలకు కాపలాకాసే ఆ కుర్రాడు, ఆర్నెల్ల కిందట కొసక్కులు వచ్చి తన తండ్రినీ, అన్ననీ కూడా చంపారనీ, స్త్రీలను పాడుచేశారనీ, ఊళ్లో డజను ఇళ్లకుపైగా తగలెట్టారనీ, ఇంకా ఆ సైనికులు కొంత మంది ఊళ్లో ఉంచి, మిగిలిన వారు నెలకో సారి వస్తుంటారనీ, పక్కఊరైన, 'రాకిత్నోయ్'లో పెద్ద కొసక్కురెజిమెంటు ఉన్నదనీ చెప్పాడు. పక్కనున్న అడవిలోకి పోయి దాక్కోవచ్చును కదా? అని అంటే, "అక్కడెంత కాలమని ఉంటాం?అందులో అక్కడ ఊబిగోతులున్నాయి. ఒక గొయ్యి మరింత భయంకరమైంది" అన్నాడా కుర్రాడు, అల్లాగే అతడు ఊళ్లో కొసక్కులూ వారి నాయకుడూ ఏయే ఇళ్లలో ఉండేదీ, వాటి అనుపానులు వివరించి చెప్పాడు. "సరే, నేనిప్పుడు గుర్రాల్ని కొన కుదిరేట్టులేదుగానీ, ఓ సారి ఊళ్లోకి పోయివస్తా, నా గుర్రాన్ని చూస్తుండు..' అంటూ మెతెలిత్సా వెళ్లాడు.

కాలువ గట్టునే ఊళ్లోకి వెళ్లి ఇళ్ల వెనుక నుండి మూడో సందులోకి వెళ్లాడు. కుక్కలు మొరిగినా, జనం ఎవ్వరూ బయటకు రాక వెనక్కి చేరాడు. అందులోనే కొసక్కుల నాయకుడుంటున్నాడు. చుట్టూ కంచె, లోపల పొదలు. . చెట్లూ.. ఎడమపక్క కిటికీ నుండి వెలుగు. . లోపల మనుషులు.. మాటలు..

"ఇక్కడే.." అనుకుంటూ ఒక యాపిల్ చెట్టు వెనక నిలబడి, వారి మాటలు వినేందుకు ప్రయత్నించాడు మెతెలిత్సా. లోపల ముగ్గురు వ్యక్తులు పేకాడుతున్నారు. ఒక పక్కన ముసలి పూజారి పేక కలుపుతున్నాడు. ఇతడి వైపు వీపు పెట్టి ఒకడు, ఎదురుగా ఒక బోండాం ఆఫీసరూ.. చివర ఉచ్చిన మొహంతో నాల్గవవాడూ.. పేకాట గురించీ, శృంగార విషయాల గురించీ.. అందులో పూజారి మాదచ్చోదీ బుద్ధిబయటపడి అంతా నవ్వారు.

ఇక అక్కణ్ణుంచి తప్పుకుని రోడ్డుపైకి వెళ్లాడుగానీ, ఒక కొసక్కు ఎదురుపడ్డాడు. మెతెలిత్సా అతన్నుంచి తప్పించుకు పారిపోతూ కాల్జారి జారిపడ్డాడు. ఒక వ్యక్తి పడిపోయినా మెతెలిత్సా పట్టుబడాల్సి వచ్చింది.

ఒక దళం సంగతి చూస్తే, తెల్లవార వస్తున్నా తమ దళం సైనికుడు, అతడెక్కడో దిట్టంగా తిని, ఏ గుడిశెలోన తొంగుంటాడని ఊహిస్తూ, నాయకుడు మెతెలిత్సా రాకపోడాన్ని గమనించిన కాపలా బాక్లనోవ్‌ని లేపి మరీ ఆ విషయాన్ని చెప్పాడు. అతడు కూడా గాభరాపడుతూ లెవిన్‌సన్‌కు ఆ కబురందించాడు. అయితే లెవిన్‌సన్ తాపీగా ఉపకమాండర్‌తోపాటు తనూ నదిలో మొహం కడిగారు. లెవిన్‌సన్ అయితే ఒళ్లు కూడా కడుక్కుంటూ, మనసులో మాత్రం మెతెలిత్సా గురించిన ఆందోళనతోనే గడిపాడు, తన ఆరోగ్యం బాగోలేకపోవడాన్ని అతడు బయటకు తెలియనివ్వలేదు. జీవంలేని మెతెలిత్సాని అతడు ఊహించుకోలేకపోతున్నాడు. అతడి పట్ల లెవిన్‌సన్‌కు ఒక ఆకర్షణ వుంది. అది అతడి సద్గుణాలను చూసికాదు. వాటిలో తనేమిన్న కానీ మెతెలిత్సాలో శారీరకమైన అనంతశక్తీ, ఓర్పూ ఉన్నాయి. ఈ గొల్లవానికి అసలు జీవనేదే

తెలీదు. అలాంటివాడికి తను నాయకత్వం వహిస్తున్నాడంటేనే ఒక విధమైన గర్వం కలుగుతోంది. అతడు శత్రువుల చేతుల్లో పడివుండడన్నభావాన్ని ప్రతిపార్టిజానూ ఊహించుకుని, భయపడి పోయారు. అందువల్ల వారంతా కాపలా సైనికుడిలా ఎక్కడో తిని తొంగుంటాడని ఊహించుకోసాగారు. నిజంగా అతడు పట్టుబడేవుంటే, ఇక తమముందు, ముసళ్లపండుగ ఉదన్నమాటే!

లెవిన్‌సన్ మాత్రం మామూలుగానే అన్నింటినీ జాగ్రత్తగా పరీక్షించి, ముందుకు కదలమని ఆజ్ఞాపించగానే, అంతా తమ కష్టాలన్నీ తొలగిపోయినట్లు భావిస్తూ సంతోషంతో కదిలారు. అయితే రెండు గంటలకు పైగా ప్రయాణించినా, వారి కెక్కడా మెతెలిత్సా జాడ కనబడలేదు. అప్పుడిక అతని పట్ల ఆందోళనతో, నిశ్శబ్దంగా దళం తైగా అంచుకు చేరింది.

ఇక అక్కడ మెతెలిత్సా విషయానికి వస్తే అతడొక ధాన్యపు కొట్టులో తేమగా ఉన్న నేలపై ఉన్నాడు. అతడికి కలిగిన మొదటి అనుభూతి చలే. జరిగిందంతా గుర్తు తెచ్చుకుని, పారిపోయేందుకేమన్నా అవకాశం వున్నదా అని నలువేపులా ప్రతి అంగుళమూ పరిశీలించి, లాభం లేదని అర్థమయ్యాక, చావు బతుకుల విషయాన్ని పట్టించుకోవడం మానేశాడు. ఇకతన శక్తియుక్తులన్నింటినీ ఒకే సమస్యపై కేంద్రీకరించాడు. తన జీవిత మంతట్లోనూ అతిముఖ్యమైన ఈ క్షణంలో, తాను ఏ మెతెలిత్సా ధైర్యవంతుడని అందరిచేతా అభినందించబడ్డాడో అట్టి తాను, తనను చంపబోయే వారంటే తాను భయపడటం లేదనీ, వారంటే తనకు పరమ అసహ్యం మాత్రమేనన్న సంగతి వారికి తెలియజెయ్యడం ఎలా అన్నదే అతని ఏకైక ఆలోచన! అతనింకా ఏదీ తేల్చుకోకముందే ఇద్దరు కొసక్కులు తలుపుతీసి, భయపడుతూనే అతణ్ణి రమ్మని పిలవగా, పెంకెగా అనుసరించాడు. నల్లటోపీగల ఆఫీసరు ఎవరు నువ్వు, ఏ ప్రాంతం వాడివి వంటి ప్రశ్నలు అడగడంతో, వాడి పీక పిసకాలన్న కోపం వచ్చింది గానీ ఆ ఆఫీసరు రివాల్వర్ చూపించడంతో వెనక్కి తగ్గి, మౌనంగా ఉన్నాడు. అతణ్ణి మళ్లీ చర్చి ఆవరణలోనికి తీసుకెళ్లగా, జనం అక్కడ గుంపులుగా చేరి ఉన్నారు.

అప్పటి దాకా అతడు జనమన్నా, వారి శుష్కమైన అలవాట్లన్నా అసహ్యించుకునేవాడు. వారు తనను గురించి ఏమన్నా, పట్టించుకునేవాడు కాడు. ఎవరితోనూ స్నేహమూ చేసేవాడు కాదు. అయినా, తనకు తెలీకుండానే.. ప్రతి పనీ ప్రజల కొరకు, ప్రజల తరపునే.. వారు తనను మెచ్చుకునేందుకు, గౌరవించేందుకే చేశాడు. ఇప్పుడూ అలాంటి ప్రజలు తన చుట్టూ నిలబడి వుండటం చూశాడు. పేదవారైన వారి అమాయకత్వాన్ని చూసి, గాలిలో తేలిపోతున్నట్లుగా ముందుకెళ్లాడు. రవటలాంటి ఆ వ్యక్తి నడకను చూసి, జనం కూడా అతని ధైర్య సాహసాల్ని గ్రహించారు.

కొసక్కు నాయకుడు ఇతడు మీకు తెలుసా? అని జనాన్ని ప్రశ్నించి, వారు తల తిప్పుకునే సరికి, రెట్టించాడు. ఎవరో వ్యక్తిని ఒకడు లాక్కుంటూ వచ్చాడు. లాక్కురాబడ్డవాడు గుర్రాల కాపరి అయిన కుర్రాడేనని మెతెలిత్సా గ్రహించాడు. లాకొచ్చిన వాడు అతడి యజమాని. తన పాలేరుని మెతెలిత్సా వంక చూపిస్తూ "అతడేనా?" అని ప్రశ్నించాడు. ఆ పాలేరు మెతెలిత్సావంక, కొసక్కు నాయకుని వంకా, తన యజమాని వంకా మార్చిమార్చి చూసి కాదని అడ్డంగా తల తిప్పాడు. అయినా ఆ రైతు ఒప్పుకొక, అంతకుముందు రోజు రాత్రి మెతెలిత్సా తన గుర్రాన్ని పాలేరుకి అప్పగించిన సంగతీ, ఆ గుర్రం జీనులో రివాల్వర్ ఉన్న సంగతీ చెప్పాడు. "అయితే ఆ కుర్రాడు ఆ విషయాన్ని ఒప్పుకోవడం లేదన్నమాట! సరే, మేం మా పద్ధతిలో విచారిస్తాం" అంటూ ఆఫీసరు ఆ కుర్రాణ్ణి లాకొచ్చేసరికి, ఆ కుర్రాడు భయంతో అరవసాగాడు. అంతలో హఠాత్తుగా మెట్లపై నుండి ఒక వ్యక్తి మెరుపులా కిందికురికి ఆ ఆఫీసరు పీకనొక్కి చంపేందుకు ప్రయత్నించడం, అయితే ఆ ఆఫీసరు ఎలాగో తప్పించుకుని తన రివాల్వర్‌తో ఆ వ్యక్తిని కాల్చడం, ఆపై కొందరు కొసక్కులు ఆ వ్యక్తిని లాక్కుపోతుండగా అతడు తిరగబడేందుకు ప్రయత్నించి చివరికి తల వాల్చెయ్యడం, చకచకా జరిగిపోయాయి. ఇతకీ ఆ వ్యక్తి ఎవరో పాఠకులు గ్రహించే ఉంటారు. ఆ వ్యక్తి మెతెలిత్సాయే. ఆ విధంగా అతడు బంధించబడి కూడా, ఒక వీరుడిలా మరణించాడు. ఈ సంఘటనా అనంతరం కొసక్కు దళం ఆ గ్రామాన్ని వదలివెళ్లింది.

ఇక ఇక్కడ దళం సంగతికి వస్తే, మెతెలిత్సాను తలుచుకుటూ బాధపడుతున్న వారిలో మొదట బయటపడ్డవాడు బాక్లనోవ్. "నే వెళ్లి కనుక్కు వస్తా" అంటూ అతడు లెవిన్‌సన్‌తో చెప్పి, ముందుకు దౌడు తీశాడు. పాడుబడ్డ ఇంటి వద్దకు చేరేసరికే, సమీప దూరంలో యాభై మంది అశ్వికులు వస్తూండటం చూశాడు. వారి దుస్తులను బట్టి, వారంతా రెగ్యులర్ సైనికులని గుర్తించి, ఆ సైన్యం వెనుక ఇంకా ఎవరైనా వస్తున్నారా అని చూసి, ఎవరూ రాకపోవడం గమనించి, ఆఘమేఘాలమీద పయనించి, ఆ సంగతి లెవినసన్‌కి తెలియజేశాడు. వెంటనే లెవిన్‌సన్ తన దళాన్ని రెండుగా విభజించి, వారిని మార్గానికి ఇరుపక్కలా గల పొదల్లో దాగుండ నియమించి వారు కాల్పులకు అందేంత దగ్గరకు వచ్చేదాకా నిరీక్షించాడు.

ఆ నిరీక్షణ సమయంలో లెవిన్‌సన్‌కి, తన సైనిక జీవితపు మొదటి రోజులు గుర్తొచ్చాయి. తన సైనిక జీవితాన్ని అతడు రెండు దశలుగా విభజించుకున్నాడు. మిలటరీ ఎత్తుగడలలో ఏ మాత్రం అనుభవంలేని మొదటి దశలోనే అతడికి ఎక్కువ మంది సైనికులపై పెత్తనం చెయ్యాల్సి వచ్చింది. అప్పుడతడు గ్రహించిందేమంటే, ఘటనలు తన ప్రసక్తి లేకుండానే వాటంతటవే జరుగుతున్నాయని. అంతమాత్రాన అతడు చేతులు ముడుచుకు కూర్చున్నాడని కాదు, తీవ్రంగానే శ్రమించాడు. యుద్ధం జరిగిన ప్రతి సందర్భంలోనూ తనకేర్పడ్డ ప్రాణభీతిని అణుచుకోవడానికే గాక, ఆ సంఘర్షణని ఇతరులకు తెలియనివ్వకుండా జాగ్రత్తపడటంలో కూడా అతడు తీవ్రంగా శ్రమించాడు. ఆపై ప్రమాదాలకు ఎదురొడ్డుతూ తన గురించిగాక, ఇతరుల రక్షణకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చే మానసిక స్థితికి చేరుకున్నాడు. ఘటనల క్రమాన్నీ, వాటిలో పాల్గొనే శత్రుల, మానవుల సంబంధాల్ని విస్పష్టంగా గుర్తించగలిగే కొద్దీ, వాటిని తన యిచ్ఛాశక్తికి లోబడే లా చేసే నైపుణ్యం అతడికి అలవడింది. మెతెలిత్సా పట్ల గల ఆకర్షణే ఇప్పుడు తనను ఉద్రేకపరుస్తూండడాన్ని గుర్తించి, అతడు తన మనస్సును కూడగట్టుకున్నాడు. ఆ విధంగా కొసక్కులు దళం తన పరిధిలోకి వచ్చేదాకా ఓపిక పట్టిన అతడు ఆపై ఒక్కసారిగా 'కాల్చండి' అని ఆజ్ఞాపించాడు.

కొసక్కు దళం చెల్లాచెదురైంది. కొద్దిసేపట్లోనే పడిపోయిన వారు పడిపోగా, మిగిలిన వారు పలాయనం సాగించాడు. అందర్నీ గుర్రాలెక్కమని లెవిన్‌సన్ ఆజ్ఞాపించి, పారిపోతున్న కొసక్కుల వెంటపడ్డాడు. ఆ ప్రవాహంలో పడి మెచిక్ తన గుర్రాన్ని కూడా దూకించాడు. కొసక్కు దళం బర్చి అడవిలో అదృశ్యంకాగా, కొద్దిసేపట్లోనే తిరిగి కాల్పుల శబ్దం వినవచ్చింది. కొంత మది ఒక పక్కకు దూకడం, తన గుర్రం ముందుకు దూకడం జరగ్గా, మెచిక్ దాన్ని ఎలాగో ఆపాడు గానీ, ఒంటరిగా మిగిలిపోయాడు. దాంతో భయపడి, వెనక్కి పారిపోయాడు. అతడు మళ్లీ బయలుదేరి వచ్చేసరికి, కొద్దిదూరంలో చనిపోయిన గుర్రం దగ్గర విచారంగా నిలబడ్డ మొరోజ్కా కనిపించాడు. మిష్కా పళ్లు గిట్టకరుచుకుని ఉన్నాయి. మొరోజ్కా పట్ల జాలి కలిగి, అతణ్ణి తన గుర్రంమీద వెళ్లమన్నాడు గానీ, మొరోజ్కా వినిపించుకోక, గుర్రం నుండి జీను వేరుజేసి, దాన్ని మోసుకుంటూ ముందుకు సాగాడు. కొద్ది దూరంలోనే

పలు కొసక్కుల శవాలు రోడ్డుమీద చూశాడు మెచిక్. మరి కొంత ముందుకెళ్లి, గ్రామంలోకి ప్రవేశించాడతడు. అప్పటికే దళంలోని వారంతా గ్రామంలోని ఇళ్లలో స్థావరాల్ని ఏర్పరచుకున్నారు. లెవిన్‌సన్ దుమ్ముకొట్టుకుపోయిన దుస్తుల్లో పెద్ద కుటీరం మెట్లపై నిలబడి ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. "ఇంతసేపూ తమరెక్కడున్నారు?" వ్యంగ్యంగా ప్రశ్నించిన అతడే తిరిగి, "గుడ్డి గుర్రానికి పళ్లుతోముతున్నట్లున్నారే?" అన్నాడు. "తోవ తప్పాను" మెల్లగా జవాబు చెప్పాడు మెచిక్.

ఇంతలో క్యుబ్రిక్ వెనుక ఇద్దరు వ్యక్తుల్ని చేతులు కట్టేసి జనం లాక్కువస్తున్నారు. అందులో ఒకడు కొసక్కు ముఠాలోని వాడు. ఇతడే మెటెలిత్సాను చంపేసిన వాడు. "వీడేనా" క్యుబ్రిక్ ప్రశ్నకు, జనమంతా అవునన్నారు వాడు వణికిపోతూ, దయ చూపమని వేడుకోసాగాడు. "వీణ్ణి కాల్చెయ్యండి" లెవిన్‌సన్ ఆజ్ఞాపించాడు. రెండో వాడు పూజారి. వాడు కొసక్కులకు బాగా మేపి సహకరించాడు. వాడిక్కూడా ఆ కొసక్కుకు పట్టినగతేపట్టింది. కొంతసేపటికి రైఫిల్ శబ్దాలు వినిపించాయి. వాళ్లకు శిక్షను అమలు చేసిన శబ్దాలు అవి. ఆ శబ్దాలకు మెచిక్ చేతులతో చెవుల్ని కప్పుకుని, "ఈ మారణకాండ ఎప్పటికి పూర్తవుతుందో" అన్నుకున్నాడు. అతనికా సమయంలో తను ప్రేమించిన యువతి ఫొటో జ్ఞాపకం వచ్చింది. "ఇక ఆమెను చూడలేనుకదా, వీళ్లు నన్ను ఎప్పుడో కాల్చేస్తారు" అనుకున్నాడు. ఆ సాయంకాలం మొరోజ్కా తప్పతాగి, మరికొందరు తాగుబోతులతో కలిసి ఫిడేలు వాయిస్తూండగా మెచిక్ చూశాడు. మొరోజ్కా కూడా మెచిక్‌ని చూసి "ఓహో నా ప్రియతమా, నువ్వూ మాతో కాస్తంత పుచ్చుకో! నిన్నేం చెయ్యంలే" అన్నాడు తాగుబోతు తుంటరి బుద్ధితో. కొందరు మెచిక్‌ని కౌగలించుకుని, ఎవడో సగం తిన్న కర్బూజాతాయా, సారా సీసా అందించారు. "నేను తాగను" మెచిక్ అంటున్నా వినిపించుకోక, "శవ సమాధి చేశాక తప్పక తాగాలి, ముగ్గురు దేవుళ్లపేరు మీద" అంటూ బలవంతం చేశారు. తాగనంటూనే మెచిక్ పడిపోయాడు. వాళ్లంతా హాస్యాలాడుకుంటూ, తూలుతూ, బూతు కూతలు కూస్తూ ముందుకు సాగారు.

ఇక వార్యా విషయానికి వస్తే, దాడి జరిగే సమయంలో ఆమె వెనక సామాను బళ్లలో ఉన్నది, గ్రామం చేరుకునేసరికే దళంలోని వారంతా చెల్లాచెదరైపోయి, ఎవరెక్కడున్నదీ తెలీడంలేదు. ఏ సైనికుడూ, తన ప్లటూన్ కమాండర్ మాట వినే పరిస్థితిలో లేరు. దారిలోనే ఆమె మొరోజ్కా గుర్రం శవాన్ని చూసింది. అతడికేమైందీ ఎవరూ చెప్పలేకపోయారు. కొందరు చనిపోయాడనీ, మరికొందరు గాయాలపాలయ్యాడనీ.. ఇలా పొంతనలేని మాటల్ని చెప్పారు. మెచిక్‌తోజత కట్టేందుకు చేసిన విఫలయత్నం తర్వాత మొరోజ్కా సంగతి ఆమెను మరింత కుంగదీసింది. ఇలాంటి స్థితిలో ఉన్న ఆమెను చూసి ద్యుబోవ్ సానుభూతిపూర్వకంగా చేసిన మందహాసం ఆమెలో ఒక విధమైన మధురవ్యథను కలిగించింది. వారంటే ప్రేమ, తనపై తనకు జాలి..దాంతో ఆమెకు తన పూర్వపు రోజులు గుర్తొచ్చాయి. తాను బొగ్గుబళ్లో తోసే రోజుల్లో, తన చుట్టూ విలక్షణమైన ఈ మోహాలే పరివేష్టించి ఉండేవి. మొరోజ్కాతో పొట్లాడిన తర్వాత, వీరందరికీ తాను దూరమైపోయింది. కానీ పూర్వం తన కటాక్ష వీక్షణాలకై పాకులాడిన ఈ బొగ్గుపనివారికన్నా తన మనసుకు దగ్గరైన వారింకెవరున్నారు? వీరిని తాను మర్చిపోయానే అనుకుని విచారించసాగిందామె.

దళం విషయానికొస్తే, ప్లటూన్ కమాండర్లలో ఒక ద్యుబోవ్ మాత్రమే తన సైనికులందర్నీ దగ్గర్లోనే మకాం చేయించగలిగాడు. గ్రామంలో కాపలా డ్యూటీ వారే చేస్తున్నారు. అంతేగాక, ఆహారపదార్థ సేకరణ కూడా వారే చేస్తున్నారు. ఇంతెందుకు, దళాన్ని కలిపి ఉంచింది ఆ ఒక్క ప్లటూనే అన్న సంగతి ఆరోజు స్పష్టమైంది. వారి వల్లనే మొరోజ్కా బతికున్న సంగతినీ, అతనికి మిష్కా బదులు, తెల్లసైనికుల్నించి పట్టుకున్న అందమైన గుర్రాన్ని కూడా వారే ఆమెకు చూపించడం జరిగింది. ఆ గుర్రం జిత్తులమారిదిగా అనిపించింది. దానికప్పుడే వారు 'జూడాస్' అని పేరుపెట్టారు కూడా. ఈ సంగతులన్నీ తెలుసుకున్న ఆమె, మొరోజ్కాను వెతుకుంటూ ఆ అర్ధరాత్రి చల్లని గాలిలో బలయులు దేరింది. ఊరంతా తిరిగి తిరిగి చివరికి ఎలాగైతేనేం అతన్ని పట్టుకుంది. తాగుడు ఎక్కువవడంతో అతడు వమనం చేసుకుని, నీరసంగా వివర్ణంగా కనిపించాడు. వార్యా ఆప్యాయంగా పలకరించేసరికి, "ఓహో నువ్వేనా.. నమస్కారం తమకు, నా అభినందనలు.." అన్నాడు అతని వ్యంగ్యాన్ని పట్టించుకోకుండా, అతన్ని అక్కణ్ణుంచి తీసుకెళ్లేందుకు లేవదియ్యబోయి, విఫలమైంది. అందువల్ల పక్కయింట్లోంచి సహాయం కోసం బయలుదేరబోయేసరికి, మొరోజ్కా వారించాడు.." అందులో గోంచరెంకో ఉన్నాడు. నేను మనిషినని అతని నమ్మకం. ఇప్పుడు నేనెలా ఉన్నానో చూడు.." అన్నాడు. "వానస్తోంది.. రేపు మనం వెళ్లిపోతాం.. రా" అందామె. అని మత్తువదిలింది. "నాపనైపోయింది.." నీరసంగా అన్నాడతడు. "నాకు ఇప్పుడేం మిగిలింది? లోకులు.." అంటూ కన్నీరు కార్చేసరికి, ఆమె అతణ్ణి కౌగలించుకుని, "ఏమిటి?" గుర్రం చనిపోయినదుకు విచారిస్తున్నావా? వాళ్లు మరో అందమైన దాన్నిచ్చారుగా" అంటూ అతణ్ణి బుజ్జగించింది. చివరికి అతణ్ణి ఎలాగోలేపి, ద్యుబోవ్ ఉన్న ఇంటికి తీసుకెళ్లింది. అతనామెను కౌగలించుకుని ముద్దాడాడు. గనుల్లో పనివాళ్లు తమ ప్రియురాళ్లను ముద్దాడారు. అది అతని రెండో ముద్దు మాత్రమే, పెళ్లైనకొత్తలో ఓసారి ఇలా చేశాడు. ఇక అతడు నిద్రపోయాడు.

కొద్దిసేపట్లోనే, గ్రామం వెలుపల 'హనీహెడ్జ్' హైరోడ్డు మొదట్లో కాపలా ఉన్న సెంట్రీలు హెచ్చరికగా మూడు సార్లు కాల్చేసరికి, వార్యా అతణ్ణి లేపింది. తిరిగి తుపాకీ గర్జనలు వినవచ్చాయి. దాంతో గ్రామంలో ఒక్కసారిగా అలజడి.. కాపలా సైనికులు అన్ని ఇళ్ల తులుపులూ తడుతూ పరుగెత్తుతున్నారు చాలా మంది కామ్రేడ్స్ తమ గుర్రాల్ని అప్పుడే నడిపిస్తూండగా, కొందరు గుర్రాలపై జీనులు వేసి సిద్ధం చేశారు. కానీ తన విషయంలో అన్నీ అస్తవ్యస్తంగా ఉన్నాయి అనుకున్నాడు మొరోజ్కా. జీనుకి కొన్ని పటకాలు తెగిపోయాయి. రైఫిలు గోంచరెంకో కుటీరంలో ఉండిపోయింది. పరుగెత్తుతున్న ద్యుబోవ్‌ని ఇతనకో పటకా ఇమ్మని బతిమిలాడాడు. "నీ దగ్గరింకోటుంది నాకు తెలుసు" అన్నాడు. "ఇంత సేపూ ఎక్కడ తగలడ్డావు?" అంటూ తిట్ల దండకంతో పటకాతోపాటు, మొహంమీద ఓ వేడి అట్టు కూడా ఒకటిచ్చాడు ద్యుబోవ్.

'తప్పులేదు. నన్నిప్పుడు కొట్టొచ్చు..' అనుకున్నాడు మొరోజ్కా. దెబ్బకొట్టినందుకు బాధలేదు గానీ, లోకమే అతనికి ఇప్పుడు శూన్యంగా కనబడింది.

ప్లటూను గుమికూడుతూండగా కాల్పుల శ్రేణి అర్ధచంద్రాకారం ధరించి, నదిదాకా వ్యాపించింది. బాంబులు గ్రామంపై ఎగురుతున్నాయి. అందర్నీ గుర్రాలు ఇగి ఒంటిబారున నిలబడమని బాక్లనోవ్ ఆజ్ఞాపించి, గుర్రాల దగ్గర కాపలా పెట్టాడు. తన వెంట రమ్మని అతడు చీకట్లోకి నడుస్తుండగా, అతడికి సెంట్రీలు ఎదురొచ్చి, శత్రువులు వేలాదిగా ఉన్నారని చెప్పారు. ఇంతలో ఫిరంగి గుళ్ల అగ్నివర్షాన్ని గ్రామం అంతటా గుప్పించారు. ఎక్కడో మంటలు చెలరేగాయి.

దళాన్నంతటినీ కూడగట్టేలోగా, శత్రువులను ఎదిరించే బాధ్యత బాక్లనోవ్‌పై ఉంచాడు లెవిన్‌సన్. దాంతో బాక్లనోవ్ తన ప్లటూన్‌ని గ్రామం బయటకు పరుగెత్తించేంతలో, బాంబుల మంటలతో శత్రువులే తమ పైకి

రావడం చూశాడు. కాల్పుల మోతబట్టి శత్రువు ఎడమవేపు నదిగట్టు నుండి తమను చుట్టుముడుతున్నట్లు గమనించాడు. వాళ్ళు ఏ క్షణంలోనైనా గ్రామంలోకి ప్రవేశించవచ్చు. జవాబుగా అతని ప్లటూన్ కాల్పులు జరుపుతూ గుంపులుగా కుడిపక్క సదుల్లోకి తప్పుకోసాగింది. ఫిరంగి శబ్దాలు క్రమంగా గ్రామం వైపుకి జరుగుతున్నాయి. ఇంతలో అకస్మాత్తుగా శత్రువుల అశ్వికదళం హైరోడ్డు వెంట పెద్ద శబ్దంతో పెద్ద ప్రవాహంలా రాసాగింది.

దాంతో శత్రువుని ఎదిరించే ప్రయత్నాన్ని మానుకుని, పదిమందిని కోల్పోయిన బాక్లనోవ్ తన ప్లటూన్‌ను, శత్రువులు లేని వైపు నుండి అరణ్యం వైపుకి పరుగు తీశాడు. గ్రదమంలో పొలిమేరలో అతడు లెవిన్‌సన్ కలుసుకున్నాడు. అప్పటికే దళం తీవ్రంగా నష్టపోయింది. అంతా కలిసి వాయు వేగాన అడవివైపుకి దూసుకెళ్లారు. లోయ అడుగునున్న అరణ్యంలో చీకటి వల్ల ఏమీ కనిపించడం లేదు. వారి వెనకే వారి తలలపై ఉక్కుపక్షులు జుమ్మున ఎగురుతూ రాసాగాయి. శత్రువుల కంట తాము పడ్డట్టు అర్థమవుతూనేవుంది.

అగ్ని గోళాలు మీద ఎగురుతూ, అంతెత్తు నుండి వెలుతురు తోకలతో నేలవాలి, గుర్రాల గిట్టల పక్కన బుసకొడుతూ, నేలలో దూరుతుంటే, గుర్రాలు ఉలిక్కిపడుతూ వెనుకంజవేసి, గిర్రున తిరుగుతూ నోళ్లు తెరుచుకుని కీచుగా అరుస్తున్నాయి. దుమ్ములు చుట్టుకుంటూ పడిపోయినవాటి శరీరాల్ని తప్పించుకుంటూ దళం గుమ్మికూడింది. లెవిన్‌సన్ వెనుదిరిగి చూశాడు. గ్రామంలో చాలా భాగం ఎర్రని మంటలతో మధ్య మధ్య నల్లని ఆకారాలు పరుగులు తీస్తూ కనిపించాయి.

అకస్మాత్తుగా లెవిన్‌సన్ పక్కన స్వారీ చేస్తున్న స్తాషింస్కి నేలకూలాడు. రౌతు లేకుండానే అతని గుర్రం దౌడు తీసింది. దళమంతా అతని శరీరాన్ని ముట్టకుండా వుండేందుకు గాను అది వైదొలిగి పరుగెత్తసాగింది.

వెనుకనేవస్తున్న బాక్లనోవ్ ఉద్రేకంగా కుడిపక్కకు చూపుతూ "లెవిన్‌సన్ అటు చూడు..' అంటూ చూపించాడు. దళం అప్పటికే లోయ అడుగుకు దిగి, అరణ్యాన్ని సమీపించింది. కానీ శత్రువుల అశ్వికదళం వారిదారిని అడ్డగించేందుకు పొలాలకు అడ్డంపడి వస్తూ కనిపించింది లెవిన్‌సన్‌కు. నల్లభూతాల్లా ఉన్నారు కొసక్కు సైనికులు. వారు అప్పుడే లోయలోకి దిగుతున్నారు. దాంతో లెవిన్‌సన్ వేగంగా దౌడుతీస్తూ, "త్వరగా.. త్వరగా..' అంటూ హెచ్చరించాడు. చివరికి వారు అరణ్యం అంచును సమీపించి గుర్రాల్ని దిగగా, బాక్లనోవ్, ద్యుబోవ్‌ల రెండుప్లటూన్లు శత్రువుల దాడిని అరికట్టి, తద్వారా దళం అడవిలోకి తప్పుకునే వీలును కలిగించేందుకు సమకట్టారు. దళంలోని మిగతా ప్లటూన్లు త్వరగా తమ గుర్రాల్ని నడిపిస్తూ అడవిలోకి పరుగులు తీశారు.

అడవి అంతా ప్రశాంతంగా ఉంది. తుపాకుల, రైఫిళ్ల, ఫిరంగి కాల్పుల శబ్దాలు వెనకే దిగబడి, వారి అస్తిత్వం సందేహాస్పదమైంది. ఆ శబ్దాలేవీ అడవి ప్రశాంతతను భంగపరచలేవని పిస్తోంది. మధ్య మధ్య పేలుళ్ల శబ్దాలు, చెట్లుకూలడం వినిపిస్తోంది. ఎండుపొదలు అక్కడక్కడా అంటుకుని కాంతివంతంగా కనిపిస్తోంది. లెవిన్‌సన్ తన గుర్రాన్ని 'ఏఫిమ్కా'కు అప్పగించి, క్యుబ్రిక్‌ని ముందు నడవమని నియమించాడు. దళం వెళ్లవలసిన మార్గాన్ని (ఏదో ఒక మార్గం చూపించాలి గనుక, ఒక దిక్కును చూపాడంతే) చూపి, జనాన్ని లెక్కించడానికి ఒక పక్కన నిలబడ్డాడు.

తడిసి, అణగారి, అతికష్టంమీద మోకాళ్ల మీద వంగి, చీకటిని చీల్చడానికి చూస్తూ జనం ముందుకు నడుస్తున్నారు. వరి కాళ్లకింద నీళ్లు తపతప లాడుతున్నాయి. నేలంతా బురదగా వుంది, గుర్రాలు ఒక్కోసారి పొట్టలదాకా దిగబడిపోతున్నాయి. ముఖ్యంగా ద్యుబోవ్ దళంలో ఒక్కొక్కరూ మూడేసి గుర్రాల్ని, వార్యా అయితే రెండింటిని- ఒకటి తనది, రెండోది మొరోజ్కాది- నడుపుతోంది. తైగా గుండా ఈ నిరసించిన గెరిల్లాల బారువెంట కంపుకొట్టే, మురికిదైన ఒక ఒంకర టింకర చార ఏర్పడి, దుర్గంధం ఎగజిమ్మే సర్పంలా వుంది. అయితే ఆ చార ఒకచోట ముందుకు కదలక ఆగిపోయింది.

"ఏం జరిగిందక్కడ?" ఆఖరున్న వాడు కుంటుకుంటూ ముందుకువెళ్లి అడిగాడు లెవిన్‌సన్.

"ఇక ముందుకు వెళ్లే అవకాశం లేదు. ముందు పెద్ద ఊబిగొయ్యి వుంది.."

వణుకుతున్న తన కాళ్లను అదుపులోకి తెచ్చుకుని లెవిన్‌సన్, క్యుబ్రిక్ దగ్గరకు పరుగెత్తాడు. అంతా చెల్లా చెదురుగా జనం తోసుకుని అన్ని వైపుల అక్కడికి వచ్చారు. అన్ని వైపులా దుస్తరమైన ఊబి గొయ్యి వారిని ఆవరించి వుంది. తైగా నుండి బయుకు పోవాలంటే వారు వచ్చిన వైపే వెనక్కి వెళ్లాలి. మరో మార్గం లేదు. ఆ మార్గంలో గనిపనివారి ప్లటూన్ శత్రువును నిరోధించి వీరోచితంగా పోరాడుతోంది. అరణ్యపు అంచునుండి ఆ కాల్పుల ధ్వని వినిపిస్తూనే వుంది. ఆ ధ్వని అంత కంతకూ సమీపిస్తోంది. ఇక పీకలమీదికి వచ్చినట్టే.

జనంలో కోపం నిరాశ తీవ్రమైంది. తమ ఈ దుస్థితికి కారణం లెవిన్‌సనే. ఇప్పుడుడతే తమనీ దుస్థితి నుండి బయట పడేసి తీరాలి. అతడి కోసం చూశారు వారు. అతడొక కాగడాపట్టుకుని కోపంతో రగులుతున్న వారి మధ్యకు వచ్చాడు. గిట్ట కరిచిన పళ్లతో, ఎర్రబడ్డ కళ్లతో, పెరిగిన గడ్డంతో, భయంకరంగా, బొంగురు, కీచు, నీరసస్వరంతో అతడు అరిచాడు. "లైను నుండి తప్పుకుంటున్న దెవరు? వెనక్కిరండి. చిన్నారి ఆడపిల్లలా కంగారుపడతారేం. ." తన రివ్వాలర్ తిప్పుతూ అతడు బుస కొట్టేసరికి, గెరిల్లాల అభ్యంతరాలన్నీ ఒక్కసారిగా కట్టుబడిపోయాయి. "వీరంతా కమాండెంటు ఆజ్ఞ వినండి.. ఊబిగొయ్యి మీద మనమొక వంతెన వెయ్యాలి. మరో మార్గం లేదు.." అతడు అధికార స్వరంతో తన ఆజ్ఞల్ని కొనసాగించాడు. ." ఒక ప్లటూన్ బాక్లనోవ్ సహాయానికి వెళ్లాలి. వెనక్కు తగ్గమని నేను ఆజ్ఞ జారీ చేసేవరకు అన్ని అక్కడే వుండి శత్రువులను నిలబెట్టమని చెప్పాలి. క్యుబ్రిక్‌ను బాక్లనోవ్‌తో సంబంధాలు కలిగి ఉండేందుకు ఇద్దరు సైనికుల్ని నియమించు.. మిగిలిన వారంతా వినండి. . మీ గుర్రాల్ని చెట్లకు కట్టెయ్యండి, రెండు ప్లటూన్లు కొమ్మల్ని నరికి, వాటిని చేరవెయ్యాలి. మిగిలిన వారంతా క్యుబ్రిక్ ఆజ్ఞల్ని వినాలి. క్యుబ్రిక్.. నువ్వునాతో రా.."

అతడినోటి నుండి ఆ ఆజ్ఞల అలా వెలువడ్డాయో లేదో అందరి అభ్యంతరాలు ఒక్కసారిగా కట్టుబడి, అతడి ఆజ్ఞల్ని నెరవేర్చేందుకు సిద్ధపడ్డారు. అంతకుముందు అతడు కనిపిస్తేచాలు, ఒక్క సారిగా మీదపడి చంపేద్దామన్నంత కోపం వచ్చిన ఆ జనసమూహం, ఇప్పుడు ఒక అమానుష శక్తితో అతడి ఆజ్ఞను సారం నడిచేందుకు సిద్ధమైంది.

కత్తుల, గొడ్డళ్ల దెబ్బలకు కొమ్మలూ, చెట్లూ పడిపోతున్నాయి. 'బోరిసోవ్' ప్లటూన్ మొదటిసారి తడికొమ్మల మోత తెచ్చి అందించింది ఇంతలో ఓ పెద్ద చెట్టు విరుచుకుపడి భయంకరమైన బురదలో పడిపోయింది. నల్లబురద బుసబుస పొంగడం వారు చూశారు. కొమ్మల, రెమ్మల మోపులు నీటిలో బురదలో గుట్టలు గుట్టలు పడిపతున్నాయి. ఓవర్ కోట్లు విప్పి, జనం చెమటట్టు ఓడుతూ, కొమ్మలు గీరుకొని రక్తాలు స్రవిస్తుండగా, లాగూ చిరుగులకు శరీరాంగాలు కనబడుతుండగా దేశ, కాల, శరీర స్పృహలు మరిచి, దాహానికి బురద నీటినే దోసిలతో ముంచుకుని తాగుతూ పనిచెయ్యసాగారు.

కాల్పులు అంతకంతకూ దగ్గరవుతుండగా, బాక్లనోవ్ కబుర్లపై కబుర్లు చేస్తున్నాడు. . "త్వరలో పూర్తవుతుందా.. ? త్వరలో.. ? అతడు సగం మందిని,

ద్యుబోవ్‌తో సహా.. కోల్పోయాడు. దాంతో అతడు వెనక్కి వెనక్కి తగ్గుతూ, తాత్కాలిక వంతెనలు మొదట పడేసిన చెట్టవద్దకు చేరుకున్నాడు. అయినా శత్రువుల గుళ్లు ఊబిగోతిపైకి దూసుకొసుతున్నాయి. వంతెన నిర్మాణంలో పనిచేస్తూనే పలువురు పార్టీజానులు నేలకొరుగుతున్నారు వార్యా వారి గాయాలకు కట్లు కడుతోంది. కట్టేసిన గుర్రాలు, కట్లు తెంపుకుని ఊబిగతిలో ఇగబడి జాలిగా విలపిస్తున్నాయి. చివరికి శత్రువులను నిలబెడతున్న పార్టీజానులు వంతెన నిర్మాణం పూర్తయినట్లు తెలుసుకుని దానిపైకి పరుగెత్తారు బాక్లనోవ్ కూడా ఖాళీ రివాల్వర్‌తో పరుగెత్తాడు. దళమంతా గుర్రాల్ని ఈడ్చుకుంటూ వంతెనపై నడిచారు. కొన్ని గుర్రాలు ముందుకెళ్ల నిరాకరిస్తూండగా మరికొన్ని వాటిని తోసుకుంటు వెడుతుండగా, వారు వంతెన దాటారు. చిట్ట చివర వంతెన దాటిన శాపర్ గోంచరెంకో చివరి క్షణాన వంతెన కింద అమర్చిన డైనమెట్‌ని ముట్టించాడు. శత్రువులు వంతెనపైకి వచ్చేసరికి, అది డైనమైట్ పేలుడుతో తుక్కుతుక్కై, పనికిరాకుండా పోయింది.

వంతెన దాటిన పార్టీజానులు కొద్దిసేపటిగానీ తాము దాన్ని దాటి వచ్చిన విషయాన్ని గ్రహించలేదు. అంతలోనే బాలభానుని కిరణాల్ని చూశారు. చెట్ల సందుల్లోంచి ఆకాశం కొంత భాగం ప్రకాశిస్తోంది. దాంతో వారు పైకెత్తి పట్టుకున్న కాగడాల్ని కిందపడేసి, కందిపోయి కొంగర్లుపోయిన తమ చేతుల వంక, అలసిపోయిన గుర్రాల వంక చూసి తాము రాత్రి చేసిన రాక్షసశ్రమను, చివరికి దానిలో తాము విజయాన్ని సాధించడాన్ని తలచుకుని వారు నివ్వెరపోయారు. కొద్ది దూరం ముందుకు నడిచేరికే వారికి ఒక మట్టిరోడ్డు కనబడింది. ఆదారి వెంటే అయిదు మైళ్లు మట్టిరోడ్డు గుండా వెడితే, అక్కడ 'త్యుదోవాక్' లోయకు పోయే హై రోడ్డు చేరుతారు. గత సాయంకాలం లెవిన్సన్ ఆ గ్రామంలో మకాం వెయ్యడనే ఉద్దేశంతో పెద్ద కొసక్కు సైన్యం మట్టి రోడ్డుకు ఎనిమిది మైళ్ల దూరంలో కాపలా కాసింది. రాత్రంతా వారు అక్కడే అడవిల్లో తుపాకుల శబ్దాలు వింటూ, దళం రాక కోసం వేచి ఉన్నారు. ఉదయానికి వార్తా హరుడు.. దళం ఊబిని దాటి వస్తోన్న విషయాన్ని చెప్పి అక్కడే వారిని ఉండమని సలహా ఇచ్చాడు. ఈ విషయం ఏమాత్రం తెలీని లెవిన్సన్ దళం వార్తాహరుడు వార్త తెచ్చిన పది నిమిషాలకు త్యుదోవాక్ హైరోడ్డు చేరింది.

నిర్మలంగా వెచ్చగా ఉన్న ఆ రోజు అలసిపోయిన లెవిన్సన్ తన దళం వంక పరిశీలనగా చూశాడు. నిస్సారంగా ఈడ్చుకుంటూ వస్తున్నారు వాళ్లు. విశ్వాసపాత్రులైన ఈ మనుషులు తన ప్రాణంకన్నామిన్న. ఇప్పుడుతాను వారిని నడిపించడం లేదు. వారితోపాటు తాను నడుస్తున్నాడు. పరిస్థితుల్ని తన చేతిలోకి తీసుకోవాలని ప్రయత్నిస్తూ, ఆలోచనల్ని కేంద్రీకరించాలని చూశాడు. గానీ, లాభం లేకపోయింది. పరిసరి విధాల ఆలోచనలు చెలరేగాయి. కాసేపు నిద్రపోతే బాగుండుననుకున్నాడు గానీ, ఇప్పుడు త్యుదోవాక్‌లోయను చేరాలి. స్కౌట్లను పంపాలన్న బాక్లనోవ్ మాటల్ని వెంటనే మనసుకు పట్టించుకోలేకపోయాడు. పట్టించుకున్నాక, ఆ సంగతి నువ్వే చూడమని బాక్లనోవ్‌కే అప్పజెప్పాడు. బాక్లనోవ్ మెచిక్‌ని వేగు పనికి నియమించాడు. మెచిక్ నియమించడం పొరపాటని లెవిన్సన్ అనుకున్నాడుగానీ, ఎందుకు పొరపాటో అతని మనసు అతనికి విడమరిచి చెప్పలేకపోయింది. అయితే బాక్లనోవే తర్వాత మొరోజ్కాను పిలిచి, ఏ ఒక్కరినీ తప్పిపోకుండా చూసుకొమ్మని, మెచిక్ వెనకే పంపించాడు.

మెచిక్ 'నివ్కా' గుర్రంపై ప్రయాణిస్తూ వెనుదిరిగి చూశాడు. వెనక 50గజాల్లో మొరోజ్కా ఉన్నాడు. దళం కనిపిస్తూనే వుంది. నివ్కా జోరుగా వెళ్లేందుకు ఇష్టపడటం లేదు. మెచిక్ దాన్ని యాంత్రికంగా పోనిస్తున్నాడు తనను ఎందుకు పంపారో అతనికి అర్థం కాలేదు. మెల్లగా వెళ్లమన్నారు. అంతే. రోడ్డు మలుపు తిరిగింది. దానికిరువైపులా చెట్ల గుబురులున్నాయి. నివ్కా బెదురుతూ కంపిస్తూ పొదల వారనే వెళుతోంది. మెచిక్ జీను మీద కులుకుతూ గుర్రాన్ని తోలడం మానేశాడు ఇంతలో నివ్కాబుసకొట్టి, మెచిక్, మెచిక్‌ని కుదేస్తూ పొదల్లోకి దూసుకుపోయింది. దాంతో మచిక్ తలెత్తిచూసి విస్తుపోయాడు. అతడిని నిద్రమత్తు వదిలి, దారుణంగా భయపడిపోయాడు. ఎందుకంటే అతనికి కొద్దిదూరంలో రోడ్డుపై కొసక్కు సైనికులున్నారు. వారిలో ఒకడు ధిగమని మెచిక్‌ని బెదిరించగా, మరోడు వచ్చి నివ్కా కళ్లాన్ని పట్టుకునేసరికి, పెద్దగా అరుస్తూ కిందికి జారి, పిరికిపదలాగా పారిపోసాగాడు. భయంతో ఎత్తుపల్లాల్లోకి జారి దొర్లుతూ ఆపై ఎలాగోలేచి, మళ్లీ పరుగెత్తసాగాడు. కొసక్కులు అతన్ని వెంబడించారు.

తన ముదర వేగు ఉన్నాడన్న ధీమాతో, అసిపోయిన మొరోజ్కా తన ముందేం జరుగుతోందీ పట్టించుకోకుండా, నిద్రపోవాలనీ, ఓ మంచి ప్రశాంతమైన గ్రామంలో రైరొట్టెను పాలలో ముంచుకుని తింటూ తన శేషజీవితాన్ని గడపాలనీ కలగంటూ వెళుతున్నాడు ఇంతలో ఎదురుగా కొసక్కులు కనిపించేసరికి, అతని గుర్రం జూడాస్ పొదల్లోకి ఉరికి, అతన్ని కింద పడగొట్టింది. దాంతో అతని కలలన్నీ కరిగిపోవడమేగాక, అంతకుముందు మెచిక్ నిశ్శబ్దంగా వెళ్లడంలోని మహాద్రోహాన్నీ గమనించాడు. వెంటనే అతడు తీవ్రమైన ద్వేషంతో మెచిక్‌ని తిట్టుకుటూ, అదే సమయంలో తన వెనుక వస్తున్న పార్టీజానుల పట్ల మహాజాలితో, మరుక్షణంలో తను చనిపోతానని గానీ, బాధపడలేననిగానీ.ఆలోచించక, ఇంకా తాను విషయాన్ని గ్రహించగలుగుతున్నదున, తన కలలోని గ్రామాన్ని చూడలేననీ, పార్టిజాలను కూడా మరిచిపోలేక, ఇంకా వ్యవధి ఉండగానే ఈ ప్రమాదాన్ని గురించి వారిని హెచ్చరించాలని నిర్ణయించుకుని, తన పిస్తోలు తీసుకుని, మరింత బాగా వినిపించేందుకు తలపైకి ఎత్తి పట్టుకుని మరీ, మూడుసార్లు కాల్చాడు. ఆ వెంటనే ఏదో భగ్గుమని పేలడం, ఆ పేలుడులో భూమి రెండు ముక్కలయినట్లు కంపించడం, ఆపై అతడూ, అతడి గుర్రమూ పొదల్లోకి విసిరెయ్యబడటమూ ఒక్కసారిగా జరిగిపోయాయి.

మొరోజ్కా కాల్చిన కాల్పుల్లోగల అర్థాన్ని లెవిన్సన్ తనదైన చిత్తవిచిత్తి వల్ల వెంటనే గ్రహించలేకపోయాడు. కానీ ఆ తర్వాత జరిగిన అనేక కాల్పుల్ని విన్నాక, గుర్రాలు నిలబడిపోయి చెవులు రిక్కించి వినసాగే సరికిగానీ అతడికి అసలు విషయం అర్థం కాలేదు. "నేను భయపడినంతా జరిగింది" అనుకున్నాడతడు. అప్రయత్నంగా ఆసా కోసం చేతిని జాచాడు. ఆ సమయంలో అతడికి అలసటతో గుంటలు పడి, మసి కొట్టుకుపోయిన బాక్లనోవ్ మొహం కనబడింది. కాల్పులు వినవచ్చిన వైపు అతడు ఒక చేతో రివాల్వార్, మరో చేత్తో గుర్రం కళ్లెంపట్టుకున, తీక్షణంగా చూస్తూ ముందుకు వంగి ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నాడు.

లెవిన్ ఒక్క మారుగా చలించిపోయి, ధైర్యం కూడగట్టుకున్నాడు. అతనిలో ఏదో తెలీని బాధ మెదిలింది. అయితే అకస్మాత్తుగా అతడు తనకత్తిని దూసి, మెరిసేకళ్లతో, ' ఏం, ముందుకు చొచ్చుకుపోదామా?" అని బొంగురు గొంతుతత బాక్లనోవనీ ప్రశ్నించి, ఆపై ఇంకేం ఆలోచనలూ రానివ్వకుండా తన కత్తిని పైకి ఎత్తాడు. సూర్యకాంతిలో ఆ కత్తి తళతళామెరిసింది. అది గమనించిన ప్రతి పార్టిజాను ఒక్కమారుగా జలదరించిపోయి, రికాబులపై లేచి నిలబడిపోయారు..

బాక్లనోవ్ లెవిన్సన్ కత్తివంశ క్రోధంగా చూశాడు. ఆ వెంటనే తన వెనకనున్న దళాన్ని ఉద్దేశించి ఏదో బిగ్గరగా అరిచిచెప్పాడు. ఆ మాట లేమిటో వినకుండానే, లెవిన్సన్ ముందుకురికి, కొద్దిసేపటికి వెనుదిరిగి చూశాడు.

దళమంతా అని వెనుక వస్తూ కనిపించింది. బాక్లనోవ్ లాగానే మిగిలిన దళ సభ్యులంతా మహోద్రేకంతో, అతులేని దీక్షతో తననను సరించి వస్తున్నారు. ఇంతలోనే ఏదో పెద్దశబ్దం పేలి, అతని చెవులకు గండ్లుపడ్డాయి. కళ్లు మిరుమిట్లుకమ్మాయి. నేలబద్దలై, మట్టిపెళ్లలు లేచి, దుమ్ము ఆ ప్రాంతానంతా కమ్మివేసింది.

ఇక్కడ మెచిక్ విషయానికొస్తే, తాను తరమబడుతున్నట్లు తెలిసినప్పటికీ, తన వెనుక ఎవరూ వస్తున్న శబ్దాన్ని అతడు వినలేదు. వరుసగా మూడు సార్లు తుపాకీ పేలిన తర్వాత వాటికి జవాబుగా ఒక్కుమ్మడిగా అనేక కాల్పులు వినిపించేసరికి, తనపైకే కాలుస్తున్నారని భ్రమించడంతో, మరింత వేగంగా పరుగులు తీశాడు. అతడు పరుగులు తీస్తున్న ఇరుకు తోవ ఒక్కసారిగా విశాలమైన చిన్నలోయలోకి దారితియ్యగా, అతడు గుడ్డిగా ఎడమకు, కుడికీ దొర్లసాగాడు. ఆ సమయంలో అవిరామంగా పెద్దపెట్టున చెవులు పగిలిపోయేలా కాల్పులు సాగుతూ, అడివంతా దద్దరిల్లసాగింది. దేవుణ్ణి తలుచుకుంటూ, ఏడుపుముఖంపెట్టి కూడా అతడు తన పరుగు ఆపలేదు. కొంతసేపటికి కాల్పులమోత తగ్గి, ఆపై ఆగిపోయింది. వెనుదిరిగి పదేపదే చూశాడు. కానీ ఎవరూ తనను తరుముతున్న జాడ కనబడలేదు. అందువల్ల కొంత సేపు ఒక పొద వెనుక పడుకుని ఉండిపోయాడు. ఆపై ఏడుస్తూ అటూ ఇటూ దొర్లాడు. అప్పటిగానీ అతడికి ఆ మూడు కాల్పుల మర్మం బోధపడింది కాదు. దాంతో సిగ్గుతో కుంగిపోయాడు. "నేనేం పని చేశాను? ఎలా చెయ్యగలిగాను'' అంటూ పదేపదే తనని తనే నిందించుకున్నాడు ఆ పనిలోని తన నైచ్యం మరింత బాగా అర్థమయ్యేసరికి, అంతకు పూర్వం తన ప్రవర్తన ఉన్నతంగా ఉన్నట్టు, ఈ ఘటన దానికి ఒక మాయమచ్చగా ఏర్పడినట్టూ భావిస్తూ బాధపడ్డాడు.

ఆపై అతడు తన రివాల్వర్ బయటకు తీశాడు. తాను ఆత్మహత్య చేసుకోలేనని అతనికి తెలుసు. ఎందుకంటే లోకంలో తాను అన్నింటికన్నా మిన్నగా ప్రేమించేది తననే. అందువల్ల అతడు తన రివాల్వర్‌కు అంటిన మరకల్ని కూడా తుడిచేందుకు భయపడ్డాడు. ఆపై జరిగిన సంఘటనలన్నింటినీ- సాహసకృత్యాలు చెయ్యాలనే తన కలలూ, పార్టిజానులతో కలవడం, తన మొదటి గాయం, మొరోజ్కా, ఆస్పత్రి, పీకా, వార్యా, ఫ్రొలోవ్, చివరగా ఊబిగోతిమీది భయంకర పోరాటం- అన్ని గుర్తొచ్చాయి. "ఇంక నేను సహించలేను. ఈ జంతు, నీచ భయంకర జీవితాన్ని సహించలేను'' అని తననను తాను నిందించుకుంటూనే, "ఇంక నేను పట్నానికి వెళ్లిపోతాను. వేరే గత్యంతరం లేదు." అనుకుంటూ, తన రివాల్వర్‌ని దూరంగా పొదల్లోకి విసిరేశాడు. ఆనక ఓ ఊటలో ఒళ్లంతా కడుక్కుని, రోడ్డు మీదికి బెదురుతూ వచ్చాడు. "ఎవరైనా తెల్లసైనికులు కనబడితేనే?'' అన్న ఆలోచన వచ్చి భయపడ్డాడు. కానీ వెంటనే, "ఫోనిద్దూ పెద్దతేడా ఏముంది గనుక?'' అన్న నిర్ధారణకొచ్చి, త్యుదోవాక్‌కిపోయే హై రోడ్డు దిశగా నడవసాగాడు.

ఇక లెవిన్‌సన్ విషయానికొస్తే, అతనికి తానెంతసేపు చైతన్య రాహిత్యంలో ఉన్నదీ ఎరుగడు. నిజానికి ఒక నిమిషమే అలా ఉన్నప్పటికీ, చాలాసేపు ఉన్నానని అతననుకున్నాడు. తన వంకే చూసుకుంటే, ఇంకా జీను మీద ఉన్నందుకు ఆశ్చర్యపడ్డాడు గానీ, చేతిలో కత్తిలేదు. గుర్రం చెవి తెగిపోయి రక్తం కారుతోంది. చిట్టచివరకి జరిగిన కాల్పుల సంగతి, అవి తన మీదనేనన్న సంగతీ అతడికిప్పుడు గుర్తొచ్చింది. ఇంకా కాల్పులు జరుగుతూనే ఉన్నాయి గానీ, అవి వెనక నుండి జరుగుతున్నాయని అతడు గుర్తించాడు. ఇంతలోనే ఇద్దరు అశ్వికులు వార్యా, గోంచరెంకోలు అతడి దగ్గరకు వచ్చారు. శాపం బుగ్గరక్తంతో తడిసివుంది. లెవిన్‌సన్ తన మిగిలిన దళం కోసం చూశాడు గానీ, అది అక్కడ లేదు. రోడ్డంతా మనుషుల, గుర్రాల శవాలతో నిండిపోయివుంది. క్యుబ్రక్, మరికొంత మంది అశ్వికులూ లెవిన్‌సన్‌ని కలుసుకునేందుకు గాను ప్రాణాలు తెగించి మరీ పోరాడుతున్నారు. వెనుక చిన్నచిన్న గుంపులు తిరోగమిస్తున్నాయి. ఇంతలో కుంటుతున్న గుర్రం మీదున్న ఒక వ్యక్తి అరుపులు వినబడ్డాయి. కొందరు కొసక్కులు అతణ్ణి చుట్టుముట్టి తమ రైఫిల్ మడమలతో.. చావ బాదేసరికి, అతడు కిందపడ్డాడు. లెవిన్ ఆ దృశ్యాన్ని చూడలేక, తల తిప్పేసుకున్నాడు. కొంతదూరం వెళ్లాక ఒక రోడ్డు ములుపులో లెవిన్‌సన్, వార్యా గోంఛరెంకోలు కలుసుకున్నారు. కాల్పులు తగ్గిపోయాయి. లెవిన్ తన గుర్రం కళ్లాన్ని లాటిపట్టి నిలబడి నిరీక్షించాడు. ఆ భయంకర పోరాటం నుండి బయటపడ్డ పార్టిజాన్లు ఒక్కొక్కరే అతన్ని కలుసుకోసాగారు. లెక్కిస్తే, మొత్తం 19 మంది లెక్క తేలారు. వారతా కలిసి కొంతదూరం వెళ్లారు. క్రమంగా గుర్రాలు ఓమోస్తరు పరుగులు తీస్తున్నాయి. కొంత సేపటకి ఇంకా వేగాన్ని తగ్గించి తాపీగా నడవసాగాయి. వారికి కొంత దూరంలో ముందు లెవిన్‌సన్ తలవంచుకుని వెడుతున్నాడు. తన వారిని ఏదో అడగాలనుకున్నట్టూ, కానీ అదేమిటో గుర్తుకురానట్లు వెనుదిరిగి చూసి, అకస్మాత్తుగా గుర్రం కళ్లెంలాగి వెనక్కితిరిగాడు. పరిస్థితి అప్పటికి బోధపడినట్లుగా అతడికళ్లు ప్రశాంతంగా ఉన్నాయి. అతడు ఆగడం తోటే మిగిలిన 18 మందీ ఆగిపోయారు.

"బాక్లనోవ్ ఏడీ?'' లెవిన్‌సన్ వారిని ప్రశ్నించాడు.

ఎవరూ మాట్లాడలేదు. చివరికి గోంచరెంకో "అతణ్ణి వాళ్లు పొట్టన పెట్టుకున్నారు.'' అంటూ తన చూపుల్ని దించుకున్నాడు. అతడి పక్కనే స్వారీ చేస్తున్న వార్యా, ఆ మాటలు విన్నంతనే, గుర్రం మెడపై వాలి ఏడవసాగింది.

లెవిన్‌సన్ కళ్లు తన వారిపై నిలిచాయి. ఒక సారి గుర్రంపై వాలి ముకుళించుకుపోయాడు. నీరసపడిపోయిన అతడిలో వయసు మళ్లిన స్థితి అందరికీ స్పష్టంగా కనబడింది. ఇప్పుడిక తన బలహీనత బయటపడిపోయిందని అతడు సందేహించినా, దాన్ని దాచిపెట్టాలని మాత్రం అతడిప్పుడు ప్రయత్నించలేదు. తన జీనుపై ముడుచుకునిపోయి కూర్చున్న అతడి కళ్ల వెంట ధారాపాతంగా కన్నీరు కారింది. దాంతో పార్టిజానులంతా తామెక్కడ బావురుమంటారోనని తమ మొహాలు తిప్పేసుకున్నారు. కంతసేపటికి లెనిన్‌సన్ తన యథాస్థితికి వచ్చి, గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు. అంతా అతన్ని అనుసరించారు.

గోంఛరెంకో ఏడుస్తున్న వార్యాను సముదాయించాడు. లెవిన్‌సన్ వెనక్కితిరిగి చూసుకున్నప్పుడల్లా బాక్లనోవ్ లేడన్న విషయం గుర్తొచ్చి, అతని కళ్లవెంట అప్రయత్నంగానే కన్నీరు ఉబికి వస్తున్నాయి. ఆ విధంగా ఆ పందొమ్మిదిమందీ ఆ అరణ్యం నుండి బయటపడ్డారు. అడవి అంతమై, వినీలాకాశం దర్శనమిచ్చింది. ఇరు వంకలా కోసిన చేలు.. మధ్య మధ్య మహా సర్పంలా నదీ ప్రవాహం, కొన్ని చోట్ల ఒరిగిన చేలు, మరికొన్ని చోట్ల పంట కోసి వెయ్యగా చేసిన కొండలంతేసి కుప్పలు.. పనుల్లో మునిగి ఉన్న యువతీయువకుల ఉత్సాహపూరిత కేరింతలు..

లెవిన్‌సన్ ఆ కృషిక జనం వంక నిశ్శబ్దంగా చూడసాగాడు. ఆ కర్షకులు ఆ 18 మంది పార్టిజానులవలెనే తన కత్యంత సన్నిహితులు. ఆపై అతడికి కన్నీరు రాలేదు. జీవించడం అవసరం. అలాగే మానవుడు తన విధిని నిర్వర్తించడమూ అవసరమే.. అంటూ రచయిత ప్రకృతి ధర్మాన్ని నిర్వచించడంలో నవలను అర్థవంతంగా ముగించాడు.

(అయిపోయింది)



# పాణి కథల పరిచయం
# వస్తు చిత్రణ - కథన పద్ధతులు

**వెంకటకృష్ణ**

*(కథల వర్క్‌షాపుల పరంపరలో భాగంగా విప్లవ రచయితల సంఘం 2015 ఏప్రిల్ నెలలో చిత్తూరు జిల్లా పాకాలలో ఒక సమావేశం నిర్వహించింది. గత కొన్నేళ్లుగా ఈ కథల వర్క్‌షాపులకు హాజరవుతున్న రచయితల కథల మీద సమగ్ర విమర్శనాత్మక విశ్లేషణ జరిపేలా ఈ సమావేశం జరిగింది. ఇందులో భాగంగా వచ్చిన వ్యాసాలు పేజీల కొరత వల్ల ఇంత కాలం అచ్చు కాలేదు. ఆలస్యంగానైనా వీలైనన్ని వ్యాసాలు ఇలా.. )*

వేరు వేరు పేర్లతో పాణి రాసిన కథలు నాకు 11 దొరికాయి. 1998ల నుండే రాస్తున్నట్లు తెలుస్తోంది. ఈ 15 సంవత్సరాల్లో 13-14 కథలు రాసినట్లుంది. మొదటి దశలో విత్తనాలు, సాలెగూడు, కొత్తదారి, సూరి లాంటి కథలూ మలిదశలో అంతర్వలయాలు, ఒక కడిచూపు, ప్యాపిలి వచ్చింది, నిర్ణయాలు లాంటి కథలూ రాశాడు.

ఇటీవలి కాలంలో అభాస, కార్వేటమ్మ - రాజకుమారుడు, '14 కథలు రాసాడు.

తొలి దశలో సామాజిక సమస్యల మీదా, మలిదశలో రాజ్య వ్యవస్థలూ, మనుషుల్లోని రాజ్యపు ఆధిపత్య భావనాలూ - ప్రత్యామ్నాయ రాజ్య భావనాలూ కథా వస్తువులైతే, ఇటీవలి కథలన్నీ నేరుగా బూర్జువా రాజకీయాల గురించి రాస్తున్నారు. ఇంకొంచెం మౌలికంగా చెప్పాలంటే పాణి కథలను రెండు రకాలుగా చూడొచ్చు (1) స్థానీయ కథలూ, (2) రాజకీయ కథలూ.

విత్తనాలు కథ - రాయలసీమ కరువూ, తద్వారా బసప్ప అనే రైతూ అతని కుటుంబమూ అతని పశువులూ పడే బాధలు. విత్తనాలు రైతు నుండీ మార్కెట్ సరుకవ్వడం మధ్య దళారుల చేతుల్లో ఉంటే అందకపోవడం, కళ్ళ ముందరే ఎదిగిన కోమటాయన విత్తనాల డీలరై - అప్పులిచ్చే వాడై నిలబడి రైతును బంధితున్ని చేయడమూ కన్పిస్తుంది. రాయలసీమలో ఉన్న రచయిత ఈ గడ్డ వాస్తవికతను తప్పించుకోలేడు. రైతులాగే కాలుతున్న మట్టిని చేతుల్లోకి తీసుకోకుండా ఉండలేడు.

సాలెగూడు కథ - గ్రామాల్లో పెత్తందార్లయిన రెడ్ల వద్ద పని చేసే మల్లయ్య మెల్లగా మల్లారెడ్డిగా మారడం, కింది కులం జయమ్మ మీద కన్నేసి, ఆమె భర్తను మరణించేలా చేసి, ఆమెను శాశ్వతంగా తాను ఉంచుకోవడం, నోరెత్తలేనట్లుగా చేసి జయమ్మనూ ఆమె (మద్దిలేటి) కొడుకునూ విడదీయడం. తల్లి ఒకరి ఆధీనంలో ఉండడాన్ని సహించని కొడుకును గ్రామంలోని ఇంకో రెడ్డి చేరదీసి ఉసిగొల్పడం అట్లా గ్రామంలోని పార్టీలనే సాలెగూట్లో చిక్కిన ఈగలవుతారు తల్లీకొడుకులు. గ్రామాధిపత్యంలో బడుగులు ఎదురెదురుగా నిలబడి తమను తాము అణచుకోవడం - రాయలసీమ స్థానీయ కథా చిత్రమే.

కొత్త దారి - ఒక దళిత కథ, దళితవాడలో నీళ్ళులేవు. ఎంతో దూరం నుంచీ తెచ్చుకోవాలి. రాముల్ని వాళ్ళమ్మ నీళ్ళు తెమ్మని పోరుకుంటుంది. రాములు ఊర్లు తిరిగొచ్చి (ఉద్యమం పనుల మీద) సోమరిగుంటాడు. ఒక్క క్షణంలో మాలవాడ అంటుకుంటుంది. రాములు ఆర్పడానికి పరుగులెత్తుతాడు, నీళ్ళు లేవు.. అప్పుడు ఊర్లో బావిలోకి జనాల్ని దింపి మంటల్ని అదుపు చేయిస్తాడు. ఊర్లో వాళ్ళు, మాల మాదిగలు బావిలో దిగినందుకు దాడి చేస్తారు. రాముల్ని తీవ్రంగా గాయపరుస్తారు. చాలామంది గాయపడతారు. పేట వాళ్ళు పోలీసు కేసు పెడ్తాం అనుకునే లోపే ఊర్లో రెడ్డి వీళ్ళ మీదకే పోలీసుల్ని ఉసిగొల్పుతాడు. ఈ వ్యవస్థలో న్యాయం దొరకదని నమ్మే రాములు కొత్తదారి పడతాడు.

వాస్తవ దళిత కథకు అక్కడే నిలబడి పోరాడాల్సిన అవగాహన ఉన్న శక్తిని రచయిత అడవి దారి పట్టిస్తాడు. కథంతా దళిత జీవిత ఘర్షణగా ఉన్న కథ, ఒక్క ఆఖరి వాక్యంతో విప్లవ బాట పడుతుంది.

సూరి - అభద్రత నిండిన మధ్య తరగతి దిగువ మధ్య తరగతి. తల్లిదండ్రులు చిన్నప్పట్నుంచే పిల్లల్ని బిగిబట్టి ఉంచుతారు, కట్టుబాట్లతో పెంచితేనే పిల్లలు ప్రయోజకులవుతారని అనుకుంటారు. అప్పుడు ఎంతో భయభక్తులతోనే ఉన్న పిల్లవాడు మెల్లగా చొరవ దొరికినప్పుడు సంకెళ్ళు తెంచుకొని అత్యుత్సాహంతో, ఎంతో ఆదర్శంతో ఆలోచిస్తే, ఆచరిస్తే ఏమవుతుందో సూరి కథ చెబుతుంది. చిన్నప్పుడు పలకరించినా పెద్దవాళ్ళను మాట్లాడించని వాడు, ఆ మౌనాన్ని బిడియాన్నీ బద్దలు చేసుకొని పనిగట్టుకొని గలగలా మాట్లాడ్డం, సరిహద్దులు లేని స్నేహాలు చేయడం, వయసుకు మించిన, తాహతుకు మించిన పనులు చేయడం, కష్టాల్లో పడ్డం. తల్లిదండ్రుల్ని ఆలోచింపజేసే కథది. పెంపకం పేరుతో బిగబట్టడం - అతిగా చెడును ఊహించుకోవడం - అంతిమంగా నష్టం జేస్తుందనీ కథ చెప్తుంది. కౌమార దశలో పొంగిపొర్లే ఉత్సాహానికి, దిశా నిర్దేశం అవసరమని చెప్తుంది కథ. కౌమార దశలోనే పిల్లల్లోని ఆదర్శం వైపు అడుగులేసే వ్యక్తిత్వం, ప్రమాదాల్లోకి నడిచిపోవడం కనిపిస్తుంది.

అంతర్వలయాలు- తండ్రి అధికార పీఠాన్ని కూల్చేసి, తల్లికీ చెల్లికీ స్వేచ్ఛనిచ్చాననుకుంటాడు రఘు. అది ఇంకోవైపు నుండి తల్లి ఆధిపత్యంగా మారటం తల్లిలోని అధికారం నిద్రలేవడం, ఆధిపత్య సంస్కృతిలో తల్లి కలిసిపోయి అందులో చెల్లీ కలిసిపోయి రఘుకు ఆవేదన మిగలడం ఈ కథ. కథంతా శారద అనే ఆమె (అబ్జర్వర్) వైపు నడపడం ద్వారా కుటుంబంలోనూ రఘులోనూ

వచ్చే పరిణామాల్ని చూపడానికి వీలైంది. కథాంశంలో శారదకు స్థానం లేకున్నా కథ చెప్పడానికి పనికొచ్చింది.

సూరి కథలోని ప్రకాశం ఎట్లా అయితే సూరికీ అతని తండ్రి నారాయణకీ మధ్య వారధిలా ఉన్నాడో ఈ కథలో శారద అట్లాంటి పాత్ర. రెండు కథల్లోనూ కుటుంబం బహుజన కుటుంబం.

ఒకతడి చూపు కథ - విప్లవోద్యమంలో కొద్దికాలం పని చేసి - ఆ కాలంలోనే జగదీశ్ అనే నాయకుడి సహచరిగా ఉండి ఆ జీవితంలో కొనసాగలేక వెనక్కు వచ్చిన జయ పురఫ్ సుధ, తండ్రితో తమ్ముడితో ఆదరణ లేకపోవడంతో స్వతంత్రంగా ఒక ప్రైవేట్ కాలేజీలో లెక్చరర్‌గా బతుకుతూ ఉంటుంది.

భార్య చనిపోయిన (ఒక్క కొడుకుతో) అదే కాలేజీలో ఉద్యోగం చేసుకుంటున్న మధు ఆమె వ్యక్తిత్వాన్ని ఇష్టపడి గతం పట్ల పెద్ద పట్టింపు లేకుండా పెళ్ళి చేసుకున్న కొద్ది రోజులకే, జగదీష్‌కు వలపన్నే యత్నంలో అతని రహస్యాల్ని ఛేదించే క్రమంలో పోలీసులు సుధను అరెస్టు చేయడం - చిత్రహింసలు పెట్టడం - కేసులేవీ పెద్దగా లేకపోవడంతో విడుదల చేయాల్సి వస్తుంది. ఇంత తాను దుష్ప్రచారం అయిన నేపథ్యంలో మధు ఎట్లా రిసీవ్ చేసుకుంటాడో అనే ఆందోళనలో కోర్టులో కలిసిన మధు ఆమెను అంతే ఆదరిస్తాడు. కథలో రచయిత చెప్పే ఆఖరి వాక్యం పాఠకుల్ని కదిలిస్తుంది. "ఆమె గాయాల మీద అతని మనసు కన్నీళ్ళను జలా జలా జార్చింది" అంటారు.

విప్లవోద్యమం ఇచ్చే జీవిత అవగాహనా, స్వేచ్ఛా వాటికి ఆసరాగా బయట సమాజంలో అరుదుగానైనా ఆదర్శవంతులు ఉంటారనే ఆశ ఈ కథలో ఉంది. వాస్తవమూ, కాల్పనిక వైభవమూ సమపాళ్ళలో ఉన్న కథ ఇది. విప్లవ రొమాంటిక్ లవ్‌స్టోరి ఇది.

నిర్ణయాలు - ఈ కథ ముగ్గురు తీసుకున్న నిర్ణయాలు. ముగ్గురు విప్లవోద్యమ కార్యకర్తలు - ఒక టౌన్‌లో క్రియాశీలకంగా ఉంటారు. శీనూ అనే యువకుడు మురళీ - ప్రమీల అనే జంట కార్యకర్తల ప్రభావంలోకి వెళ్ళి పని చేస్తూ (ఇంట్లో ఘర్షణ వొస్తుందని అనుమానపడుతూనే) మురళితో పాటు అరెస్టవుతాడు. జైల్లో మూడు నెలలు ఉంటాడు. జైల్లో మురళిలో మార్పు వచ్చి లొంగిపోవాలనే నిర్ణయంతో శీనూ కంటే ముందు బెయిల్ మీద బయటికొస్తాడు. తండ్రి, మామా ఎన్నో ఇబ్బందులు పడి శీనూకు బెయిల్ తెస్తారు. ఇంటికొచ్చాక ఇక ఆ పనులు మానేయమని, అలా మానేయని పక్షంలో ఇంట్లోంచి వెళ్ళిపోవాల్సి ఉంటుందనీ తండ్రి ప్రకటిస్తాడు. ప్రమీల తాను మురళీ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నాననీ, పార్టీతోనే ఉండాలని నిర్ణయించుకున్నాననీ శీనుకు ఫోన్ చేసి పిలిచి చెప్తుంది - శీనూలో స్ఫూర్తిని కల్గిస్తుంది. ఆ దారిలోనే ఉండాలన్న అతను నిర్ణయానికి ఆలంబనగా నిలుస్తుంది.

ప్రమీల తన సహచరుడంతటి వాణ్ణి కూడా వదులుకొని ఆ దారిలోనే స్థిరంగా ఉండాలనుకుంటుంది. శీను విషయంలో అతని కుటుంబం - అతన్ని మార్చాలని చూస్తుంది. ఒక వ్యవస్థలా పట్టి బంధించాలని చూస్తుంది. ఆ మేరకు ప్రేమనూ బాధ్యతనూ చూపుతుంది. అయినా శీను ఆ పట్టు నుండి బయట పడాలనే అనుకుంటాడు. "నీకు తప్పనిపించింది నాకు వొప్పే" అని తండ్రికి తెగేసి చెప్తాడు. ఈ కథలో సాంకేతికంగా ప్రమీలకు కుటుంబం ఉన్నట్లు కనబడదు - అయినా మురళితోటి అనుబంధం అలాంటిదే అనిపిస్తుంది. అట్లా చూస్తే విప్లవ రాజకీయాలతో ఉన్న వాడిలోని ఆధిపత్యాన్నీ, విప్లవ రాజకీయాలు తెలియని కుటుంబపు ఆధిపత్యాన్నీ రెండింటినీ అధిగమించే నిర్ణయాలు ఈ కథలో కన్పిస్తాయి. పైగా ప్రమీల మురళిని అర్థం చేసుకుంటుంది. అతనిలో వచ్చిన మార్పు పట్ల ఆమెలో ద్వేషం ఏమీ లేదు. నిర్వికల్పంగా ఆయన దారిలో ఆయన పోనీ అనుకుంటుంది. ఇలాంటి అంశమే ఒక తడి చూపు కథలోనూ కన్పిస్తుంది. విప్లవ రాజకీయ కార్యకర్తల్లో ప్రజాస్వామిక విలువల పట్లా గౌరవం, ఆ దృక్పథం వాళ్ళ నిర్ణయాల్లో కన్పిస్తుంది. శీనూ తండ్రి నీది అదే దారి అయితే ఇంట్లో స్థానం లేదు అన్నవాడు.. శీనూ ఆ మాటను ధిక్కరించి ప్రమీలను కలిసి వచ్చాడని తెలిసీ ఏమనడు. ఆ మౌనం అంగీకారమా? కొడుకును వదులుకోలేనితనమా? రచయిత చెప్పడు.

'అంతర్వలయాలు' కథ పేరుకు తగ్గట్లే - సమాజంలోని భిన్న భిన్న అధికార వలయాల అంతర్గత ఆధిపత్య వలయాల చుట్టూ తిరుగుతూ విశ్లేషిస్తుంది. సమాజంలోని ఆధిపత్య శక్తుల చేతుల్లో పనిముట్టై, కిరాయి హంతకుడిగా మారినవాడు - జిల్లా వ్యాప్తంగా ఎంతో మంది రాజకీయ నాయకుల చేతుల్లో పనిముట్టై పదహారు హత్యలు చేసిన వాడిని పోలీసులు ఎన్‌కౌంటర్‌లో చంపిన రోజే ఈ కథ జరుగుతుంది. ఆ ఎన్‌కౌంటర్‌ను నిరసిస్తూ ఒక ముసలి తల్లి వేదననూ చూస్తూ వొక పక్క, ఇంకో తల్లి (ఈ కథలోని సుగుణమ్మ) వేదననూ, పరిణామాలనూ పాఠకులకు వివరించే శారద కోణం ఇంకో పక్క. ఈ రెండు అంశాలూ జమిలిగా వస్తూ కథ నడుస్తుంది. ఈ ఎన్‌కౌంటర్ ద్వారా రాజ్య అధికార వలయం ఎట్లా ఉందో ఆధిపత్యమనేది ఎన్ని వికృత వేషాలు వేస్తుందో సూచిస్తాడు రచయిత. కథలో ప్రధానమైన చోట్ల ఎన్‌కౌంటర్ చుట్టూ ఉన్న ఆధిపత్య భావనలపై కామెంట్ చేయడం ద్వారా కుటుంబంలో కూడా ఆధిపత్యం ఏర్పడం, అది చేసే విధ్వంసం - అది కుటుంబంలో నింపుతున్న పరిణామాల్ని వివరిస్తారు కథకుడు.

ఆధిపత్య పోరులో ఆయుధాలయ్యే కిరాయి హంతకులూ అంతో ఇంతో పవర్‌ను చెలాయించిన వారేననీ, అట్లే కుటుంబంలో తండ్రి ఆధిపత్యాన్ని అంతం చేస్తే తల్లి ఆధిపత్యం చోటు చేసుకుంటుందనీ అది రఘులాంటి సున్నిత హృదయుల్ని విలువకు నిలబడి ధర్మపోరాటం చేద్దామనుకునేవాళ్ళను నిర్వీర్యం చేస్తుందనీ కథ చెబుతుంది. పురుషుడి ఆధిపత్యాల్ని చిత్రించిన ఎన్నో కథలూ, ఎంతో సాహిత్యముంది మనకు అయితే స్త్రీ కూడా ఆధిపత్య భావనలోకి అనివార్యంగా ప్రవేశిస్తుందనీ ఈ కథ కొత్తగా చెబుతుంది. అయితే ఆమె ప్రవేశించే ఆ ఆధిపత్యాన్ని కూడా తయారు చేసింది పురుష స్వామ్యమే కావడం గమనార్హం. స్త్రీవాదం వైపు నుంచీ ఎంతో చర్చ జరగాల్సిన ఈ కథ చరిత్రలో నిశ్శబ్దంగా కలిసిపోయింది.

ఈ కథలోని సుగుణమ్మ అధికార వలయంలోకి ఎలా వచ్చింది - భర్త రామసుబ్బయ్య తక్కువ రేట్లలో కొన్న రెండు ప్లాట్లు రియల్ ఎస్టేట్ బూమ్‌లో లక్షలకు అమ్ముడయ్యాయి. వచ్చిన

డబ్బును అమ్మ పేర వేయాలంటాడు రఘు. దాని మీద తండ్రితో పెద్ద యుద్ధమే చేస్తాడు. అంతకు ముందు తండ్రంటే వణికినోడే, ఇంట్లో తల్లీ చెల్లీతో పాటు ఆయన ముందు నోరెత్తనివాడే, మొదట చెల్లెలికి కొంచెం స్వేచ్ఛ కోసం, రాత్రి రెండో ఆట సినిమాకు పోయినందుకు, తండ్రి, ఆడపిల్లల్ని చెడిపేస్తున్నావు గదరా అంటాడు. అక్కడ ఎదిరించడం ప్రారంభించినోడు, ఈ ప్లాట్ల అమ్మకపు డబ్బు అమ్మ పేర పడ్డానికి యుద్ధంలో నిలబడి తండ్రిని బిత్తరపోయేలా చేస్తాడు. మిధ్యా ఆధిపత్యంతో ఇంట్లో అందరినీ భయపెడుతున్న రామసుబ్బయ్య కొడుకు ఎదురించేప్పటికి భిన్నుడయి షాక్ గురవుతాడు. ఆ బలహీన క్షణాల్లోనే రామసుబ్బయ్య ఓడిపోయి సుగుణమ్మ పది లక్షలకు అధిపతి అవుతుంది. అప్పుడే రామసుబ్బయ్య ప్రమోషన్తో హోదా పెరుగుతుంది. ఇంటికి అటెండర్లూ గుమాస్తాలు హాజరవడంతో, సుగుణమ్మకు అసలైన హోదా వచ్చినట్టవుతుంది. ఇంట్లోకి వస్తు సంపద చేరుతుంది. పని మనుషులు రావడం జరుగుతుంది. సుగుణమ్మ తాను స్వయాన సేవక కులాల నుండీ వచ్చినదాన్ననే ఎరుకమరచి అధికారం చెలాయించడం రఘులో ఘర్షణకు కారణమవుతుంది.

అంతకు ముందు ఎట్లా బతికినామో మరచిపోతే యెట్లా అంటాడు రఘు. 'ఎప్పుడో అట్ల బతికినాం అని ఎల్లకాలం అట్నే బతకాల్నా, నలుగురిలో అబ్బా అనేతట్లు ఉండాలి గానీ' అంటుంది ఆమె. దాంతో ఆమె స్వకులస్థుల్నే 'అలగాజనం' అంటుంది. పని మనిషికి వేరే ప్లేటూ గ్లాసూ వాడుతుంది. హోదా కోసం అవసరం లేకున్నా పెద్ద ఇంటికి మారుతుంది. సంపద మీద హక్కు అంటే ఆధిపత్యమే అని రఘుకు అర్థమవుతుంది.

అయితే ఈ కథలో ఇంత ఆరోగ్యంగా సమాజం పట్ల ఆలోచించే పాత్రలైన రఘు, శారద అలా ఎలా ఆలోచించగలుగుతున్నారో, ఏ అవగాహన వాళ్ళను ఆలోచింపజేసిందో సూచనగానైన లేదు. శారదకు కుటుంబంలోని ఆధిపత్యాన్ని అర్థం చేసుకోవడానికి వనరుగా ఆమె భర్త నుండి విడిపోవడానికున్న మౌలికంశాల్ని చెప్పిన రచయిత, రఘు ఎందుకంత ప్రజాస్వామికంగా ఉన్నాడో, అతన్ని ఏ ఆలోచనలు అలా పురికొల్పాయో అనేది ఈ కథలోని ఖాళీ. ఈ ఖాళీ పూరించి ఉంటే - సుగుణమ్మలో ఆధిపత్యం రాకుండా ఉండాలంటే ఏం జరగాలో పాఠకులకు తెలిసేది. తల్లిని ద్వేషించటంలోనే రఘు తల్లి అలా ప్రవర్తించకుండా ఉండడానికి కావాల్సిన వాతావరణాన్ని, ఉపాయాల్నీ గురించి కూడా ఆలోచించి ఉండేవాడు.

సాలెగూడు కథలో - కథ అభ్యుదయపు అడుగు వేయలేదు. కథ ప్రారంభించిన స్థితికి అంతమైన స్థితికీ కథలో పురోగతి ఉండాలి అనే సూత్రంతో అంచనా వేస్తే, సాలెగూటిలోని జయమ్మ - తాను అలా ఉండిపోవడంతో పాటు తన కొడుకు ఇంకో సాలె గూడులోకి వెళ్లడానికీ కారణమవుతుంది. కఠిన వాస్తవమైనా, కథ ఆశా జనకంగా ముగిసింది. సరిగ్గా దీనికి వ్యతిరేక దిశలో కొత్తదారి కథలో ఆశాజనకంగా విప్లవాత్మకంగా ముగింపు ఉండాలనుకొని కథకుడు ఆ కథని ముగింపు, ఆ కథని ఒక వాక్యం ద్వారా కథ తేలిక చేసాడు. అంతే నాటకీయమైన వాక్యం పాఠకుడికి అతికినట్లుగానే కన్పిస్తుంది గానీ సహజమైన అనుభూతినివ్వదు. ఆ కథలో రాములు పోలీసులు నుండీ తప్పించుకోవడానికి కొత్తదారి పట్టి అడవి యుద్ధంలో తేలితే - ఊర్లో అతను కల్పించిపోయిన సమస్యను ఎవరు ఎదుర్కోవాలా?, ఆయనొక్కడు కొత్తదారిలో జారుకుంటే పేటలోని వాళ్లకు నిర్దేశం ఎవరు చేయాలా? ఇలాంటి ప్రశ్నలన్నీ పాఠకులకు వస్తాయి.

అట్లాగే నిర్ణయాలు కథలో తండ్రి ప్రకటించిన నిర్ణయం నీరుగారిపోయినట్లు రాయడం వల్ల తండ్రిలోని బిగువు తగ్గింది. తాను చేయొద్దన్న పనిని కొడుకు చేస్తే అంతకు ముందు ప్రకటించినట్లు తండ్రి యుద్ధం చేస్తేనే - ఆ యుద్ధంలో కొడుకు నిలబడితేనే - కొడుకు నిర్ణయంలోని సంభావ్యత మెరుస్తుంది. లోకమంతా అట్లానే జరుగుతుంది. ఘర్షణ చాలా కాలం జరుగుతుంది. అదే వాస్తవికత.

ఈ కథల్లో కొన్ని పోలికలున్నాయి. పాత్రలరీత్యా చూసినప్పుడు అది కనిపిస్తుంది. సూరి కథలోని పాత్రలు అంతర్వలయాలు కథలో కొనసాగుతాయి. సూరి పాత్రకు రఘూ కొనసాగింపు. ప్రకాశం పోషించిన పాత్రే శారదది. నారాయణా, రామసుబ్బయ్యా అనే తరహా తండ్రులు. అలాగే అంతర్వలయాలలోని శారద, నిర్ణయాలు కథలోని ప్రమీలతో కొన్ని పోలికలున్నాయి. ఇదే ప్రమీల దూరంలో దగ్గర కథలో సుధగానూ మారిపోవడానికి అవకాశాలున్నాయి. కొత్తదారి కథలోని రాములు, నిర్ణయాలు కథలోని శీనుగా పరిణామం చెందవచ్చు. ఈ పాత్రలన్నీ అతి సహజంగానే ఆదర్శంగా ప్రవర్తించే పాత్రలు. అలా ప్రవర్తించడానికి వాళ్ళను పురికొల్పిన జీవిత అనుభవమేమిటి? అనేవి గొప్ప కథా వస్తువు. అది ఇతని కథలో రాలేదు. అంతర్వలయాలు కథలో శారద భర్తతో విడిపోవడాన్ని అస్పష్టమైన వాక్యాలతో రచయిత చెప్తాడు. ఆ విషయం ఆ కథకు ప్రధానం కాదు కాబట్టి రామసుబ్బయ్య కుటుంబ ఘర్షణ పాఠకుణ్ణి వెంట తీసుకెళ్తుంది కాబట్టి అటువైపు ఆలోచించడం గానీ, నిజానికి శారద భర్తతో విడిపోవడమే ఒక వేరే కథ. ప్రస్తుత కథ మేరకైనా అవసరమైందేమిటంటే శారద అట్లా ఎట్లా ఉంది, రఘును అతని ఆదర్శవంతమైన నేపథ్యం నుండీ అర్థం చేసుకోవడానికున్న ఆమె నేపథ్యం ఏమిటీ. ప్రమీల మురళిని వొదులుకోగల్గినంత ప్రభావం వేసిన విప్లవకర్తృత్వం ఏమిటో, అది ఎట్లా వచ్చిందో. శీనుకి ఎట్లా ఆ రాజకీయాలు గురి కుదిర్చాయో, చేసినా పనులేమిటో, గ్రామాలు ఎట్లా కొత్తదారిలో అంతకుముందే పడి ఇంటికి రాకుండా తల్లితో తిట్లు తింటున్నాడో, ఆ గతం ఏమిటో, రఘు అంత అవగాహనతో ఆదర్శంతో ఎందువల్ల ఉన్నాడో, మధుసూధన్ అంత గొప్ప ప్రవర్తనతో ఎలా, ఏ భౌతిక పునాది మీద ఉన్నాడో, మధుసూదన్ అంత అవగాహనతో ఆదర్శంతో ఎందువల్ల ఉన్నాడో. . ఇవన్నీ కథల్లోని ఖాళీలు. వివరాలు లేకుంటే మానె కనీసం సూచనగానైనా రావాల్సినవి. అవి పాఠకుణ్ణి తప్పక చైతన్యం చేసేవి. సాహిత్యమెంత గడ్డ వాస్తవికతను చిత్రించినా అందులో ఉండాల్సిన కల్పనా స్థితి ఒక మెట్టు తగ్గినా లోటు తెలిసిపోతుంది. వర్తమాన చరిత్రలో జరిగే ఎన్నో ఘటనలు, కేవలం ఘటనలుగానే లోకం చూస్తుంది. నలిగిన విషయంలోని వాస్తవికత కల్గించే వెగటుకు లోకం ఎప్పుడో గురి అయి ఉంటుంది. ఆ రీత్యా ఆయా ఘటనలపై నేరుగా కథలు

వచ్చినపుడు రచయిత దాన్ని కొత్త కథలా అన్పించడానికి కొత్త వ్యూహాలు అనుసరించాల్సి ఉంటుంది. అలా చేసిన ఆ కథలు పండకపోవచ్చు. ఈ కథకుడు రాసిన ప్యాపిలి వచ్చింది, అభాస, ఎ4, కార్పేటమ్మ- రాజకుమారుడు అనే నాలుగు కథల్లో వాస్తవిక ఘటనలు వాస్తవికంగానే నమోదయ్యాయి. దాంతో పాటు కల్పన చేయడానికి రచయిత కృషి వాస్తవికంగానే కనిపిస్తుంది. కథ చెప్పడానికి రచయిత ఎన్నుకొన్న కంఠస్వరం కథను ఒక మెట్టు కిందనే ఆపేసింది.

నిజానికి 'ఎ4' కథలో నిడివి వల్ల రచయితకు ఉదారభావాలున్నాయనిపిస్తుంది. కొన్ని చోట్ల విషయం పునరావృతం అవుతుంది. అంతకుముందే నెలల పాటు తెలుగు పాఠకులు వేలాది కథనాలుగా టీవీ / పేపర్లలో చూసీ వినీ ఉండిన విషయం. సబితా ఇంద్రారెడ్డి అనే రాజకీయ నాయకురాలు చేవెళ్ళ చెల్లెమ్మగా వైఎస్ఆర్ ముద్రతో అధికార దస్తావేజుల మీద ముద్రలు వేలి అక్రమ భూపందేరంలో ముద్దాయి అవడం గత వర్తమానాలైన యితివృత్తం. ఇంత నలిగిన విషయాన్ని చెప్పేటప్పుడు తాజాదనాన్ని పులమడానికి గొప్ప శిల్పప్రయోగం అవసరమవుతుంది. అప్పుడుగానీ విశ్వసనీయత సాధించలేం.

ఈ నాలుగు కథలూ రాజకీయ కథలవడం - బాగా కలసిన (స్థానికంగానైనా) వ్యక్తుల / సంఘటనల విశేషాలవడం గమనార్హం. ఇలాంటి విషయాలు కథా వస్తువులు చేయడమే పెద్ద సాహసం.

కార్పేటమ్మా - రాజకుమారుడు కథ మూడు కథల కథ. మొదటి కథ కథకుడు, రాజకుమారుడుగా పేర్కొనబడిన పేరు మోసిన యువ రాజకీయకుడని జైల్లో కలవడం అనే ఘట్టం.

రెండవది ఒక రాయలసీమ గ్రామంలో నీళ్ళ కోసం ఎండిపోయిన బావిలో తవ్వకం చేస్తుండగా నీళ్ళ బదులు రక్తం పారాడం, ఆ రక్తం తనదేననీ, తనకు శాంతి జేయాలనీ, సముద్రం అవతల పడమటి గడ్డన తనకో గుడి కట్టాలనీ ప్రతి రోజు ఇంత భూమిని నైవేద్యం పెట్టాలనీ కార్పొరేటమ్మ అనే అశరీరవాణి ప్రకటించడం. దానిచుట్టూ అలజడి మొదలవడం. జైల్లో రాజకుమారుడ్ని కలసిన విలేఖరిది ఈ ఊరే అవడం.

మూడో కథ కొన్ని అంతర్జాతీయ జాతీయ సదస్సులు హైదరాబాద్‌లో నిర్వహించే పర్యావరణ సదస్సు, పశ్చిమ దేశాలకు అనుకూలంగా అవి తీసే తీర్మానాలు. కార్పేటమ్మలాంటి శక్తులు వెలసి ఆ చుట్టు పక్కల చేస్తున్న విధ్వంసాలకి ఈ సదస్సు ఏ పరిష్కారమూ కనుగొనకపోవడంతో, ప్రజలు ఈ సదస్సుల ఎదుట ధర్నాలు చేయడం. ఆ ధర్నాల్లో విప్లవకారులున్నారని పోలీసులు దాడులు చేయడం. ఆ అలజడుల్లో మన విలేఖరి ఉండడంగా కథ ముగుస్తుంది.

దేశీయంగా గనుల పేరుతోనో, సెజ్‌ల పేర్లతోనో ఇండస్ట్రీల పేరుతోనో స్థానిక ప్రభువులు రాజాలై / యువరాజాలై భూమిని ఆక్రమించుకుంటున్నారనీ, పాశ్చాత్య గ్లోబలైజేషన్ కూడా భూపందేరంలో తనకూ భాగం కావలంటూ, పర్యావరణ కలుషితానికి కారణం అవుతున్నదనీ, ఏ పర్యావరణ సదస్సులూ వీటిని తప్పు పట్టడం లేదని కథ తెలియజేస్తున్నట్టు అర్థం చేసుకోవచ్చు. కథ పేరు మాంత్రికవాద స్పర్శతో ఉన్నా, రెండో భాగంలో మాత్రికవాదంతో కార్పొరేటమ్మను రక్తంతోనూ, అశరీరవాణితోనూ ప్రత్యక్ష్యం చేయించి, ఉన్నదున్నట్టుగా గడ్డివాములు కాలిపోవడం, ఊళ్ళు ఊళ్ళు మాయం అవడం లాంటివి జరపడం ద్వారా మాజిక్ రియలిజమ్ శిల్పాన్ని అనుసరించాడు. అయితే దాని ప్రభావం కథ మొత్తం లేదు. మూడు భాగాల మధ్య ఇంకొంచెం బలమైన అంతర్గత బంధం ఉంటే ఇంకా బాగుండేది. రాజకుమారుడితో ఇంటర్వ్యూ వల్ల కొత్తగా ఇంకా చెప్పించి ఉండాల్సింది. ములాఖత్ కోసం వెళ్లిన వ్యక్తిని బెయిల్ ఇప్పించమని రాజకుమారుడు అడగడం, ఇతనితో ములాఖత్ వల్ల అతనికేదో వొనగూరుతుందనుకునేలా కథనం ఉండటం విశ్వాసనీయతను బలహీనపరుస్తోంది. అంతకన్నా జైల్లో రాజకుమారుడికి జరుగుతున్న వైభోగాన్ని వాడి అంతరంగాన్నీ కథనం చేసినట్లు రాసినా అర్థవంతంగా ఉండేది. ఎట్లాగూ మ్యాజిక్ రియలిజమే కాబట్టి, ఎంతోమంది ములాఖత్ అవడానికి వచ్చారు, ఏవేవో మాట్లాడారు, అవి చెప్పడం ద్వారా రాజకుమారుడి దొమ్మపొగురూ / వైభవం / అవినీతి చక్కగా చూపి ఉండవచ్చు. అలాంటి శిల్పపరమైన పనితనాన్ని, తర్వాతి కథ భాగంలో చూపించాడు. రెండూ మూడూ భాగాల్లో గనులూ పర్యావరణం సామాన్య అంశంగా నిలబడతాయి. రాజకుమారుడి భాగంలో రాజకీయాలూ, అవినీతి ఎక్కువైంది. అందుకే, మూడూ కలవడం లేదు. లేదు ఇట్లా మూడు విడి భాగాలు ఒక కథగా ఉంచడం కూడా కొత్త శిల్పమే అని అనుకుంటేనూ, వచ్చే నష్టమూ లేదు. ఈ కథకుడు తీర్చిదిద్దిన ప్రయోగాత్మక కథ ఇది.

'అభాస' ఒక సంఘటనా చిత్రమే. కథ అనేందుకు కథా లక్షణాలు లేవు. జీవితం లేదు. సామాజికంగా వ్యవహరించే ఖాకీలో ఉన్న అధికారి (ఎస్. పి.) క్యాపిటలిజమ్ మీద విమర్శలు చేయడం. పక్కనే ఉన్న మంత్రి (వృత్తిరీత్యా ఇండస్ట్రియలిస్ట్) దాని మీద వివరణలు ఇచ్చుకోవడం. మంచి నాటికగా, పాత్రల నిజ స్వభావాల వెలుగులో అభాసగా ఉండటం గమనించవచ్చు. ఇందులో రాజకీయ వాదిని (మంత్రిని) కథకుడు మార్కెంటైల్ కాపిటలిస్టు అంటాడు గానీ నిజానికి అతను పూర్తిగా పెద్ద స్థాయి ఇండస్ట్రియలిస్టు - బూర్జువా రాజకీయనాయకుడు.

'ప్యాపిలి వచ్చింది' అనే కథ ప్యాపిలి గ్రామంలో మాదిగలు వినాయక ఊరేగింపు సందర్భంగా జరిగిన దాడి నేపథ్యంలో కథ రాస్తూ, ఆ సంఘటనలో ప్రధానంగా భాగస్వామ్యమైన బోయ, మాదిగ కులాల మధ్య ఒక ప్రేమ పెళ్ళిని కల్పించి రాసిన కథ. గుర్రమ్మ, బోయ యర్రమద్ది ఎల్లప్పనాయుడి కూతురు, వాళ్ళది ప్యాపిలికోటను ఏలిన వంశం. అట్లాంటి వంశంలో పుట్టి మాదిగ మాదన్న ప్రేమలో తండ్రిని ఎదురించి ఇల్లు ఐశ్వర్యం వదిలేసి వెళ్ళిపోయి, మాదిగ మాదన్నతో ఊరికి నాలుగు కిలో మీటర్ల దూరంలో ఒక చెరువు గట్టు మీద బతుకుతుంది. వాళ్ళకు పుట్టిన నాగేంద్ర మాదిగపేటలోనే ఉంటాడు. మాదిగల వినాయకున్ని ధ్వంసం చేసి, పేటపై దాడి చేసారని తెలుసుకుని ఊర్లోకి వచ్చిన గుర్రమ్మకు 40 ఏళ్ళ క్రితం బోయలు ఏ ఆధిపత్యంతో ఏ

మత్సారంతో ఉన్నారో ఇప్పుడు అట్లనే ఉన్నారని అర్థమవుతుంది.

ఈ కథ ఒక వాస్తవ రాజకీయ సామాజిక సంఘటన చుట్టూ అల్లిన కథ - ఆ సంఘటన వెనుక తక్షణ విషయాలు, చర్చించాల్సిన విషయాలు చాలా ఉన్నప్పుడు వాటిని వదిలేసి, లేచిపోయిన ప్రేమజంట ఆసరాగా కథ చెప్పడమే రచయిత ఉద్దేశ్యం.

ప్యాపిలి కథకు అమరే అంశాలు చాలు ఉన్నాయి. మాదిగ వాడలో చర్చి వెలసి నాలుగైదు కుటుంబాలు అటు మొగ్గగానే, ఊర్లోని (కోమటి / చాకలి కులాల్లోని) హిందూత్వశక్తులు మాదిగవాడలోని యువకులను వినాయక చవితికి విగ్రహాలు పెట్టించే ప్రయత్నాలు చేయడం ఒక అంశం. మాదిగలు / బోయలూ పక్కపక్కనే జీవిస్తూ ఉండటం. ఇద్దరూ వ్యవసాయ కూలీలుగా, కంకర కొట్టే కూలీలుగా ఉండటం. చాలా ఎక్కువ మంది ఆ కంకర కాంట్రాక్టులో మాదిగలు ఉండటం, బోయలను రెచ్చగొట్టే అంశం.

మాదిగ దండోరా ఉద్యమం వాడను నిద్ర లేపింది, మామూలుగా ఊర్లోకి రావాలంటే బోయవాడను దాటే వెళ్తారు. పెళ్ళి / దేవత ఊరేగింపులకు మాత్రం పోనీరు. చాలా కాలంగా ఆ అసంతృప్తి మాదిగల్లో ఉండటం. ఇన్ని అంశాల చుట్టూ ఓట్ల రాజకీయం ఉండనే ఉంది. ఇన్ని ఘర్షణలకు / కథకు అనువయ్యే వాటిని వదలి, వైవిధ్యత కోసం ప్రేమ పెళ్ళి చుట్టూ కథను చూపుతాడు కథకుడు.

ఈ కథలన్నీ చదివాక - ఈ కథకుని కంఠ స్వరాన్ని గురించి మాట్లాడాలనిపించింది. అంతర్వలయాలూ, నిర్ణయాలూ, ప్యాపిలి వచ్చింది, ఎ4 కథల్లో ఒకే తీవ్రతలో ఉండే కంఠస్వరంతో కథ చెబుతాడీ రచయిత. సంభాషణలకు చోరవలేని, సంభాషణలైనా అవి కూడా రచయితే రెండు వైపులా పలుకుతూ - ఒక గంభీరమైన సంవిధానంలో కథ చెప్పడం, ఒక తాత్విక శృతిలో కథను చెప్పడానికి చేసే ప్రయత్నంగా ఈ కంఠస్వరం వినిపిస్తుంది. మిగిలిన అన్ని కథల్లోనూ ఇదే కంఠస్వరం మధ్య మధ్యలో వస్తూ ఉంటుంది. దగ్గర్లో దూరం కథలోనూ, కార్పోటమ్మా - రాజకుమారుడు కథల్లోని కంఠస్వరపు సొంపు 'ఎ4'లో ఎందుకో లేదు. అందువల్ల ఈ కంఠస్వరం ఇతని కథలకు బలమూ, బలహీనత కూడా. అంతర్వలయాలు కథలో వస్తుగాఢతరీత్యా, వస్తువు మీదున్న రచయిత పట్టురీత్యా కంఠస్వరం చాలా గొప్పగా వొప్పింది.

ఈ 11 కథల్లో ఒక కథ కూడా సంభాషణ ఆధిక్యంతో నడిచింది కాదు. అట్లని కథల్లో సంభాషణలే లేవని కాదు. నాటకీయత శిల్పంగా కథను నడపడం, కథల్లో భాగాన్ని నడపడం అరుదుగా కూడా కాదు, అసలు కన్పించదు. అయితే సంభాషణలుగా వొకటీ అరా వ్యాక్యాలు నడిచిన చోటైనా స్థానీయ కర్నూలు నుడికారాన్ని వాడడం, కథకుడి కథనంలో కూడా స్థానీయ యాసతో పదాలు వాడటం కన్పిస్తుంది. ఆ మేరకు ఇది అతని బలం, అపురూపమైన కర్నూలు జిల్లా పద సంపద ఈ కథల్లో అందంగా వొదిగింది 'పుర్సొత్తు', 'యీవారప్పుడు', 'మాట్లాడవాకు', 'పీక్కొనొచ్చినా', 'ఏదారుజేయడం', 'చేసిలేమా', 'ఏందోడు', లాంటి కర్నూలు జిల్లా పదాలు వాడటం బాధ్యతగా తీసుకున్నాడు రచయిత. అట్లా స్థానికత సంస్కృతి పట్ల దాని వ్యక్తీకరణల పట్లా మమకారం చూపుతాడు. కథకు స్థానీయ పరిమళం అద్దాడు.

పాత్రల లోపలి ఆలోచనల ఆధారంగా కథనం నడపడం ఈ కథకుని లక్షణం - అందువల్లనే కథనంలో సంభాషణ కింద సంభాషణ ఉండేది కాకుండా వ్యాఖ్యానానికీ, విశ్లేషణకూ ప్రాధాన్యముండే 'కంఠస్వరపు' కథనం అబ్బింది. ఆ మేరకు నిర్ణయాలు కథలో, కథకుడూ కథలోని పాత్రా వొక్కటేనా అన్నట్లు కథనం ఉంది. సర్వసాక్షి కథనంగా ప్రారంభమైన కథ మొదటి పేజీలోనే ప్రథమ పురుషలోకి మళ్ళుతుంది. మళ్ళీ వెనక్కి వస్తుంది. అట్లా జిగ్ జాగ్ ఆత్మకథానాత్మక కథనంగా సాగుతుంది. తమాషా ఏమిటంటే ఎవరి వైపు కథ చెబుతున్నపుడు వాళ్ళలోకి దూరి వాళ్ళలో నుండీ కథ చెప్పడం ఉంది. కథలో శీను వచ్చినప్పుడు శీనూలో నుండీ శీనూనే కథ చెబుతున్నట్లూ, ప్రమీల దగ్గరకు వచ్చినప్పుడు ఆమెలో నుండీ కథ చెప్పడం. ఇది కొన్నిచోట్ల బాగు ఉండొచ్చుగానీ అన్ని చోట్ల బలాన్ని ఇవ్వదు.

ఇట్లా మనుషుల మనసుల్లోకి చొరబడి వాళ్ళను చదవడం గురించి ఆ కథలోనే అది 'కళ' అంటాడు కథకుడు. "మనిషికి ఈ కళ ఎందుకు పట్టుబడుతుందో బైటికీ లోపలకీ ఉండే తేడాలు చదవాలనుకోవడం" అంటాడు.

ఇతని కథల్లో సర్వసాక్షి కథనం ఎక్కువగా కనిపిస్తుంది. ప్రథమ పురుషలో వాడే గొంతుతో సర్వసాక్షి కథనం చేస్తాడు. అదే ఇతని కంఠస్వరం. పురుషుని వైపు నుండీ జరిగే ప్రథమ పురుష కథనాలు నిర్ణయాలు కథలోనూ, అభాసలోనూ ఉంది. స్త్రీ వైపు నుండీ ప్రథమ పురుష కథనం 'ఎ4' కథలో నడిచింది. సాలెగూడు, అంతర్వాలయాలూ, ఒక తడిచూపు కథలు స్త్రీలవైపు నుండీ నడిచిన సర్వసాక్షి కథనాలు.

ఇతని కథల కాన్వాస్ కథ కథకూ పెద్దది. వ్యవస్థాగతమైన పెద్ద స్థాయి చిత్రణలూ చేస్తూనే వాటి అతి సూక్ష్మస్థాయి విశ్లేషణలూ చేస్తాడు. రాయలసీమ సాహిత్యంలో రక్తగతమైన కరువూ, ఆధిపత్యం, దళిత సమస్య లాంటి వాటిని కథలుగా (విత్తనాలు - కరువు మీద, సాలెగూడు - ఆధిపత్య గ్రామీణ శక్తుల మీద, కొత్తదారి - దళిత సమస్య మీద) పెద్ద కాన్వాస్ మీద చిత్రించిన కథకుడే, సూక్ష్మ అంశాలైన పిల్లల పెంపకం (సూరి), కుటుంబంలోని ఆధిపత్యం (అంతర్వలయాలు) మీద కూడా చిత్రించాడు. అట్లే సంక్లిష్టమైన సామాజికాంశాలు దళిత సమస్యా-హిందూత్వ (ప్యాపిలి వచ్చింది), అవినీతి - పర్యావరణం - గ్లోబలైజేషన్ (కార్పోరేటమ్మా - రాజకుమారుడు) కూడా ఇతని కథా వస్తువులైనాయి. వ్యవస్థాగతమైన సంక్లిష్ట భౌతిక స్థితిని చెప్పిన కథల నుండే వ్యక్తిగత మానసిక స్థితిని విశ్లేషించే కథనం దాకా ఇతని ప్రయాణం నడిచింది.

విలువల రీత్యా ఈ కథలను పరిశీలించినప్పుడు నేడు చలామణిలో ఉన్న వ్యవస్థాగత విలువలు ఎలా ఉన్నాయి. ప్రత్యామ్నాయ వ్యవస్థల విలువలు ఎలా ఉంటాయి అనే తారతమ్యాన్ని గురించి కూడా ఈ కథలు మాట్లాడతాయి.

విత్తనాలు కథలో - ప్రకృతే / దుష్ట ప్రత్యర్థి, లేదూ దళారీగా మారిన కోమటాయన, సాలెగూడులో - ఆధిపత్య వ్యవస్థకు ప్రతినిధులైన మల్లారెడ్డిగా మారిన మల్లయ్య అతన్ని పెంచి పోషించే

# నదీ మూలం లాంటి ఆ ఇల్లు కనబడిందా!

**అరసవిల్లి కృష్ణ**

చాలా రోజులుగా యాకూబ్ కవిత్వం చదువుతున్నాను. చదివింది జీర్ణం కావడానికి కవిత్వాన్ని వ్యాఖ్యానించడానికీ నా పరికరాలను సిద్ధం చేసుకోవడానికి చాలా సమయం తీసుకుంది. యాకూబ్ అనే వ్యక్తి అతని కవిత్వం నా పరిచయంలోకి వచ్చి రెండున్నర దశాబ్దాల కాలం గడిచింది. ఈ గడిచిన కాలం కూడా చాలా విలువయినది. కారణం ఈ కాలానికి ఓ ప్రత్యేకత ఉన్నది. మతం - మార్కెట్ అనేవి మనుషుల మధ్య అసమానతలను ప్రోది చేస్తున్న కాలం. మనుషులు జీవిస్తున్నా ఏదో వెలితి వెంటాడుతున్న కాలం. ఈ రెండున్నర దశాబ్దాలు (1991-2015) రాజకీయార్థిక, సామాజిక జీవనం మనుషుల్ని బొమ్మలుగా మార్చింది. లేదా యాంత్రీకరణగా రక్తమాంసాలు లేని చలనరహితంగా మార్చింది. మతం, మార్కెట్ కలగలసి నూతన మానవ ఆవిష్కరణను ధ్వంసం చేశాయి. ఏవయినా సరిదిద్దవలసిన అంశాలు, ఇలా జరుగు తున్నదేమిటి? అనుకునే సమయంలో ఆలోచనలకు పరిష్కారాలకు సమయం ఇవ్వకుండా ఉక్కిరి బిక్కిరి అయిన కాలం. గుంపు మనస్తత్వంలో ఒంటరితనం, దిగులు, సమూహంలో ఏకాకితనం. రహదారులు, కుటుంబాలు, బహిరంగ ప్రదేశాలు, దేశాలు, ప్రాంతాలు మనిషిని వంటరిని చేశాయి. మార్కెట్‌కు ఆ శక్తి ఉన్నది. మనిషిని ఏకాకిని చేయడమంటే మనిషిని వస్తువు లోబంధించడమే. ఈ సూత్రం మార్కెట్‌కి తెలిసినంతగా మానవ జీవన సమాజానికి తెలియదు. లేదా దాని లోతులను చూడగలిగితే సృజనశీలురు కాగలరు. ఒంటరితనం మిగిల్చిన సమయాల నుండి ఆలోచనాపరులు కాలం నడుమ, మనుషుల తండ్లాటను చూడగలరు వ్యాఖ్యానించగలరు. బహుశా దాన్ని స్వీకరించిన వాడు యాకూబ్. నిరంతరం మనుషుల ఉద్వేగాల మధ్య నిలబడినవాడు. యాకూబ్ కవిగా విస్తరిస్తున్న కాలం తనని తాను కవితావరణలో నిలబెట్టుకుంటున్న కాలం. యాకూబ్ ఈ దశను కవిత్వంలోకి తీసుకురాగలిగాడు. సకలం వ్యాపారీకరణమే



నదీమూలం లాంటి ఆ ఇల్లు
యాకూబ్ కవిత్వం
ప్రచురణ కాలం : 2014
వెల : రు. 100/-

---

రెడ్డి విలన్లు.

కొత్తదారి కథలో అంటరానితనాన్ని అమలుపరిచే ఊరి వాళ్ళందరూ పేదల పాలిట విలన్లే. అట్లా మొదటి దశ కథల్లోని పాత్రల్లో బాధితులూ బాధలకు కారణమయ్యే వ్యవస్థ ప్రతినిధులు ఇద్దరూ ఉంటారు. తర్వాతి కథలైన సూరి, అంతర్వలయాలులో అదృశ్యమైన జీవితాలను నడిపించే వ్యవస్థ మాయా యుద్ధంలో కుటుంబంలోని అందరూ బాధితులే - 11. ఒక తడి చూపు కథలో రాజ్యమే ప్రత్యర్థి కార్పేటమ్మ -రాజకుమారుడు దగ్గరకు వచ్చేప్పటికి దేశీయ దుర్మార్గ స్వార్థ వ్యవస్థకు పాశ్చాత్య గ్లోబలీకరణ తోడవుతుంది. 'ఎ4'లో ఈ వ్యవస్థ ఒక సాధారణ గృహిణిని రాజకీయాల్లోకి లాగి పతనం చేస్తుంది.

దీనికి ప్రత్యర్థిగా ఈ కథకుడు ప్రత్యామ్నాయ రాజకీయ విలువల్ని, ఆ విలువలకు ప్రతినిధులైన పాత్రలు, రఘు, శారద, శీను, రాములు, ప్రమీలా లాంటివారిని చిత్రిస్తాడు. పేట తగలబడిపోతూంటే సాహసంతో ఊరి బావిలోకి నీళ్ళ కోసం దిగే రాములులో ఎట్టి స్వార్థమూ లేదు. ఇంట్లో ప్రజాస్వామిక విలువల కోసం తండ్రిని ఎదురించి, తల్లికి అధికారమొచ్చేలా చేసే రఘుకు అధికారం మీద వ్యామోహం లేదు. నమ్మిన విలువల కోసం ఇంటినైనా, సహచర్యానైనా వదులుకొనే శీనూ, ప్రమీల సాహసం సమాజానికి మేలు చేయడం కోసమే. 'ఎ4' కథలోని స్త్రీకి ప్రత్యామ్నాయం శారదా ప్రమీలలే. ఈ పాత్రలేవీ ఆధిపత్యాన్ని సహించని ప్రజాస్వామిక పాత్రలు. ఒక తడిచూపు కథలో మధూ, సుధ వ్యక్తిత్వాన్ని గౌరవించి దగ్గరవుతాడు, చివరకు ఆమె గతం తెలిసీ కూడా అక్కున చేర్చుకుంటాడు; ప్రేమా పెళ్ళీ అంటే పరస్పర గౌరవమని అతని అర్థం. ఇదే కథలో జగదీష్ జయను అతన్నుండీ ఉద్యమం నుండీ బయటకు పోతాను అంటే పోనిస్తాడు. ఆమె అభీష్టాన్ని గౌరవిస్తాడు. నిర్ణయాలు కథలో ప్రమీల మురళి లొంగిపోవడాన్ని మౌనంగా అంగీకరిస్తుంది. అతని దారిలో అతన్ని పోనీ అనుకుంటుంది. ఇట్లా గొప్ప ప్రజాస్వామిక విలువల్నీ కనబరుస్తారు.

మొత్తానికి ఇతని కథలేమిటి అనుకుంటే - మౌలికమైన మార్పులు కోరే ఎత్తులో నుండి ఈ వ్యవస్థను పరిశీలించడం, విమర్శించడం. అనుభూతి వాదమో, మానవతా వాదమో. . అలాంటి ప్రతిపాదనలో లేని మావోయిజాన్ని జీర్ణించుకున్న ప్రత్యామ్నాయ కలల్ని కథనం చేయడం.



కాదు, మతం లేదా హిందుత్వం విస్తరిస్తున్న దశ. విస్తరణ మాత్రమే కాదు, గాయాలను తరచి తరచి చేస్తున్న కాలం. ఈ దశకు సాక్షి యాకూబ్. తన అస్తిత్వ స్పృహను వదులుకొని ప్రపంచ వ్యాప్త పరిణామాలను గమనిస్తూ స్థానీయత నుండి గొంతు విప్పిన వాడు. మతం - మార్కెట్ చాచిన కోరలు, ఆ ప్రభావం నుండి తప్పించుకోలేని మానవ సమాజం, గుత్తులుగా రాలుతున్న శవాల ఆర్తనాదాలు, ఈ నోరు పెగలని నిశ్శబ్దం, కనురెప్ప తెరిచేంతలో కాటు వేసిన సర్పాలు, శవాల మధ్య మిగిలిన నిస్సహాయ కంఠాలు. యాకూబ్ ఈ దశలలో ప్రయాణం చేసినవాడు. జీవితం ఎదిగి వచ్చిన దశ తెలంగాణ గ్రామీణ జీవితంలో ఆనాటి కాలం చేసిన గాయం. బతుకు ముందు భవిష్యత్ ప్రశ్నలు. జీవిక కోసం చెమట చిందించిన బాల్యం. రేపటి బతుకు రాగం ఏమవుతుందో అనే ఆందోళన. వీటన్నిటి మధ్య జీవితాన్ని దొర్లించిన మనిషి కవిగానే మిగులుతాడు. లేదా నిరంతర బతుకు యావలో జీవితాన్ని మననం చేసుకుంటాడు. యాకూబ్‌ది మొదటి దశ. వామపక్ష ప్రగతిశీల వాదం, తన జీవన భౌతిక అస్తిత్వం, ఈ రెండిటి కలయికగా యాకూబ్ కవిత్వాన్ని పరిశీలించవచ్చు. నిజానికి యాకు బ్ కవిత్వాన్ని మొత్తంగా చూచినప్పుడు మనిషి అస్తిత్వం కేంద్ర బిందువు. మనిషి దగ్గర మొదలు పెట్టి ప్రపంచం వైపు నిలబడినవాడు. కవి అంతరంగ ప్రపంచం దాని వ్యక్తీకరణ ఏ బిందువు దగ్గర నిలబడి ఏ బిందువు దగ్గరకు దారి చేస్కుంటున్నాడు అనేది ప్రధానం.

యాకూబ్ ప్రవహించే జ్ఞాపకం (1992), సరిహద్దు రేఖ (2002), ఎడతెగని ప్రయాణం (2009), నదీ మూలంలాంటి ఆ ఇల్లు (2014) ఈ కాలంలో నాలుగు కవితా సంపుటాలు. ఎక్కడా విరామం చెందని వాడు. ఒక నిలువనీయని కవితా స్పర్శ. అది సమాజ గాయాల ముఖచిత్రం నుండి తోడుకున్నది. తన జీవితాన్ని కవిత్వంతో మమేకం చెందిన కవి. కవితా వాక్యం కోసం ఎదురు చూచిన కవి. తనని స్థిరంగా ఉండనీయని కాలం మాత్రమే కాదు, మనుషుల్ని విడదీసే కుట్రల సారాంశాన్ని ఎరిగి కవిత్వంగా ప్రవహించినవాడు. తను కవి, తన అస్తిత్వం కవిత అనే ఎరుకను ధ్వంసం చేసుకొని లేదా నిర్మూలించుకొని మనుషుల పట్ల ఆర్తితో కవితావరణలో స్థిరంగా నిలిచినవాడు. ఈ స్థిరత్వానికి గల కారణాలను వెతకకపోతే స్థిరత్వ నేపథ్య రంగాన్ని గమనించకపోతే యాకూబ్ కవిత్వం పట్ల ఓ అంచనాకు రాలేం.

యాకూబ్‌కి జ్ఞాపకాల పలవరింత ఉన్నది. దానిక్కారణం అతని జీవిత గతం ఈనాటికి వెంటాడుతున్నది. ఆ గతం రాపిడిని వర్తమానంలో సజీవంగా నిలుపుకున్నవాడు. కవికి గతంతో సంబంధమేమిటి? వర్తమానం భవిష్యత్ ముఖ్యం కదా! అని కొట్టి పారేయవచ్చు. కవి గత జ్ఞాపకాల నుండి బయటకు రాలేదు అనవచ్చు. కాని జీవితం ముఖ్యం కదా! నడిచిన జీవితం రొట్టమాక నుండి విడివడి హైదరాబాద్ వంటి నగర ప్రవాసం. గ్రామ జీవితం నుండి మహానగర జీవితంలోకి ప్రవేశించడం ఏటి కాల్వ నుండి సముద్రంలో నిలదొక్కుకోవడమే. ఇది ఎంత మానసిక ప్రయాస. జీవితం విస్థాపనకు గురికావడం ఆధునిక అభివృద్ధి విధ్వంసంలో జరుగుతున్న మామూలు సంఘటన కావొచ్చు గానీ ఆ విస్థాపన ఎలాంటి మానసిక ఉద్వేగాన్ని జీవితాంతం కొనసాగిస్తుందో హృదయం పనిచేస్తున్న వారికి తెలుస్తు. యాకూబ్‌కి అవగతమే దారిని విశాలం చేసుకునే క్రమంలో తనలోని స్పందనల నీడై పరచుకోవాలనే తపన యాకూబ్ కవిత్వం. మతం, మార్కెట్ తన కేంద్ర స్థానం నుండి పరాయికరణకు లోను కావడం. ఇవన్నీ కలగలస్తేనే పచ్చి కుండలాంటి యాకూబ్ కవితావరణను అర్థం చేసుకోగలుగుతాం. ఈ స్పష్టతలో నుండి కవితా రీతిని పరిశీలించి నప్పుడు కవితా రచనలో అస్పష్టత, సంక్లిష్టతల గందరగోళాల నుండి భాష యొక్క తాజాదానాన్ని తాటిముంజు మృదుత్వాన్ని పలికించడమే కాదు, గంభీరమయిన అర్థం కాని పండిత భాషను వదిలేసి ప్రజల భాషను కూడా కవిత్వం చేయగలనన్న ధీమా కలిగినవాడు. శిల్పపరంగా వ్యక్తీకరణ పరంగా తన దగ్గర కవిత్వ పరికరాలును కాపాడుకున్న కవి.

ప్రగతిశీల ప్రజా ఉద్యమాల వైపు నిలబడుతూనే అంతరంగిక మానవుణ్ని చూచిన కవి యాకూబ్. రాజకీయార్థిక విషయాలను కవిత్వం చేస్తూనే, నదీ మూలం లాంటి ఆ ఇల్లును వెతికి వెతికి చివరకు కనుగొన్నవాడు. మళ్ళీ తన ఇంటిని కనుగొనడానికి అంత దాకా ఎడతెగని ప్రయాణం చేసి నదీ మూలం లాంటి ఆ ఇల్లును చేరడానికి చేసిన మానసిక భావోద్వేగాల జీవితం మాత్రమేనా! ఆ జీవితం చుట్టూ వేసిన వల. ఆ వల అల్లిక చేసిన రాజ్యం ఆర్థిక, మత రాజకీయాలు పన్నిన వల. మనిషి మనిషి పక్షం వహించడం, మనిషి పక్షాన ఉండటం మాత్రమేనా! రగలడం, జ్వలించడం, ఆగ్రహించడం, ప్రేమించడం, కరుణ చూపడం, దయను ప్రకటించడం. అంత మాత్రమేనా! రాత్రుల్ని కరిగించడం. కవితా వాక్యం పురుడు పోసుకున్నదీ అంటే ఆ వాక్యం వెనుక మానవ జీవన ఘర్షణ ఉన్నది. ఆ ఘర్షణను చూడ నిరాకరించకపోవడమే కవిత్వం. తొలగిపోకుండా హృదయం లోపల సున్నిత జ్వాలను నిలుపుకున్న కవి. యాకూబ్ కవితా వాక్యాలను రాయడం, ఉటంకించడం ఎందుకో నాకిష్టం లేదు. యాకూబ్ కవితా సారాంశాన్ని పట్టుకోవాలి. కవి తయారయిన కాలం విస్తరిస్తున్న కాలం. నిలబడి వ్యాఖ్యానిస్తున్న కాలం ఏ కవికైనా ముఖ్యమైనవి. ఆ కాలం మనిషిని అంకెగా మార్చింది. ఉరితాడుగా మార్చింది. ఓడిపోయిన మనిషిని చేసింది. జీవితం చేతుల నుండి రాలి మరణ రుతువులు దగ్గర నిలబడింది. మతం ఊపిరిని చించింది. మసీదులు కూలాయి. హిందుత్వం కరవాలం ధరించి పీకలను కోసింది. అగ్ని రాజుకొని శరీరాలను బుగ్గిచేసింది. హిందుత్వం సంఘ పరివార్ చంకలో చేరి భిన్నత్వాన్ని ఏకత్వం చేస్తుంది. దారి ఎక్కడ కవీ! చీకటి ద్వారాల నుండి కాంతి రేఖను గీసుకొని తెరలను తొలగించే ప్రయత్నం చేస్తున్నాడు. యాకూబ్ కాలంపై సంచరిస్తున్నాడు. జీవితం జ్ఞాపకాల పెట్టె. నిజానికి ఆ పెట్టెను తెరిస్తే గత కాలపు బూజు వాసనే కాదు. రక్తం శరీరం మరిగిన పరిమళం వీస్తుంది. ఈ రెండున్నర దశాబ్దాల కాలంలో ఓ చిరుగుల బొంత. మనిషి హృదయాన్ని శరీరాన్ని ముక్కలు ముక్కలు చేసింది. హిందుత్వం రాజ్యం నీడపై కూర్చుంది. ఈ పరిణామాల వెనుక నడిచిన దారి. ఆ దారి నిండా పరుచుకున్న జీవన విధ్వంసం. అందుకే యాకూబ్ కవిత్వం రక్తమాంసాల భాష మాట్లాడింది. తన పల్లె, తన జీవితం గొంతుకై నినదించినది. కవిత్వం సున్నిత స్పందనలతో కూడుకున్నదయినా ఆ స్పందనల వెనుక దాగిన

కఠోర జీవితాన్ని చెప్పేటప్పుడు, దాని తీవ్రత మొత్తంగా ఆగ్రహంగా మారుతుంది. కవి సున్నితుడే కాని అతని భావజాల ఘర్షణ సున్నితమయినది కాదు. అది మొత్తంగా నిర్మూలన దశకు చేరినప్పుడు కవి గొంతు సున్నితత్వం పలకదు. తన చుట్టూ ఆవరించిన అనేకానేక ఘటనల నుండి ఆ సున్నితత్వం పోయి ఓ ధిక్కారం కవితలో వొదుగుతుంది.

పొద్దుటి మంచును దాటి వచ్చాను
మనసును వొత్తిన ఈ దిగులును మాత్రం
వెంట తెచ్చాను
ఇక మిగిలేందుకు - నాతో, నాతో
కొంత మిగిలి
ఉండేందుకు

నిజానికి యాకూబ్‌లో వెలితి అది వ్యక్తిగతమయిన వెలితి కాదు. సామూహిక వెలితి. గుంపులో వెలితి ఉంటుందా. కలయికలో వెలితికి స్థానమెక్కడ? కవి వెలితి దగ్గర ఆగాడేమిటి? తనుగా మిగలడానికి కొంచెం వెలితిని మిగుల్చుకుంటానని చెప్పడంతో హృదయంలో ఇంకిన పరాయీకరణ భావాల కొసన మార్కెట్ మతం మిగిల్చిన అంతిమ దశ యాకూబ్ కవిత్వం. పరాయికరణ మాత్రమే కాదు, ఆ దశను దాటిన మార్కెట్ సంస్కృతి హిందుత్వం విసురుతున్న వల. కవి ఎక్కడ నిలబడ్డాడు. ఎలా స్పందనలకు లోను అయినాడు చాలా చోట్లకు చాలా సందర్భాల్లో.

అసందర్భాల్లో వెళ్ళలేకపోయాను. వెళ్ళినందువలన, వెళ్ళలేక పోయినందున.

అంతే.. అంతేలేని.. చింతే వీడని జ్ఞాపకం - చివరకు జీవన కాలమంతా ప్రయాణం చేసి తను చేరాల్సిన చోటు గురించి తలపోత పోసినవాడు. ఏం మర్చిపోయాను?.. ఇంట్లో ఆ మరిచిపోవడం జీవన ఘర్షణలో భౌగోళిక అంశాలు చోటు చేసుకున్న దశ యాకూబ్ కవిత్వం.

యాకూబ్ కవితా ప్రయాణం విలక్షణమైనదే కాదు, ఒక బాధ్యత నుండి నిబద్ధతాసారం నుండి ముడిపడి ఉన్నది. ముందే చెప్పినట్లుగా యాకూబ్ మనుషుల పట్ల ఆర్ద్రత కలిగి ఉండటమే కాదు. మారుతున్న ప్రపంచ పోకడలను, ధ్వంసమవుతున్న మానవ విలువ పట్ల ఆర్తి ఉన్న కవి. 90ల తర్వాత వచ్చిన కవులు విప్లవోద్యమ ప్రభావం నుండి వచ్చినవారు. నిలకడగా, నిర్భయంగా కవితా రచనను స్వీకరించినవారు. అంతేనా, కవితావరణ నుండి వైదొలగకుండా. నిబద్ధతగా కవిత్వం రాయడమే కాదు ప్రజా సాంస్కృతిక ఉద్యమాలతో మమేకమయినవారు. అలాంటి తరానికి చెందిన యాకూబ్ తన కవితా నిర్మాణ శిల్పరీతులను ఎప్పటికప్పుడు అధ్యయనం ద్వారా నూత్న కవితాభివ్యక్తిని స్వీకరించిన కవి యాకూబ్. రెండున్నర దశాబ్దాల తెలుగు సమాజం రెండు పాయలుగా విడిపోయిన దశ కూడా ఉన్నది. ఆ దశలో యాకూబ్ కవితా స్పందనలు ఆహ్వానించదగినవి. సంయమన కవిగా యాకూబ్‌ను తెలుగు నేల స్వీకరించింది. యాకూబ్ అసహన దశ తీవ్రరూపం దాల్చి ప్రగతిశీల ఉద్యమ కారులను చంపుతున్న దశలో యాకూబ్ నుండి లేదా కవి వ్యక్తిత్వం నుండి ఈ అసహన దుందుడుకుగా నిరసనగా చర్యలు వేగవంతమవుతున్నప్పుడు, యాకూబ్ కవితా క్షేత్రం ప్రజల పక్షాన ఉండటం అవసరం. కవిగానే కాదు యాకూబ్‌గా అణగారిన ప్రజల పక్షాన నిలవగలిగితే రెండున్నర దశాబ్దాల ఎడతెగని ప్రయాణానికి కవిత్వ మలుపు ఇచ్చిన కవిగా మిగులుతాడు.

దున్ని దున్ని అలిసిపోయి,
నెర్రలిచ్చిన రైతు స్వప్నంలోనే
మిగిలి ఉన్న భూమితో సంభాషిస్తున్నాను
మంతనాలు, విప్లవాలు ఆయుధాలు
నన్నో ఆయుధంలా చేబూనిన కాలంతో చర్చలు
జరుపుతున్నాను

* * *

ఇక చర్చించుకుందాం రండి!
ఇప్పటికయినా నాతో మాట్లాడాలనే ఆలోచన రావడమే
నా విజయం ప్రత్యామ్నాయ కల అది నెరవేరాలనే ఆకాంక్ష బలంగా ఉన్నప్పుడు కలలు సాయుధ మవుతాయి అని అనగలిగిన కవి, విప్లవోద్యమ దాని తీరుతెన్నుల పట్ల సానుభూతి ఉండటమే కాదు. కవిగా స్వీకరించినవాడు. యాకూబ్ అనే హృదయం దగ్గరగా వచ్చే కవి గురించి ఇంతకన్నా ఏం రాయగలను.



## కవులకు విజ్ఞప్తి

అరుణతార విప్లవసాహిత్యానికి వేదిక. గత నలభై ఏళ్లుగా ఎందరో రచయితలు తమ రచనను ఈ పత్రిక ద్వారా మెరుగు పర్చుకున్నారు. తెలుగునేలలో విప్లవ కవిత్వం, పాట, కథ, నవల, వ్యాసం, నాటిక మొదలైన ప్రక్రియలలో లబ్ద ప్రతిష్ఠులైన వారందరికి ఇది వేదికగా ఉంది. ఈ ప్రక్రియలలో కవిత్వం తక్షణ స్పందనగా వ్యక్తమవుతుంది. నలభై ఏళ్ల విప్లవ సాహిత్య చరిత్రలో కవిత్వం వస్తు-రూప పరిణతి ఎంతో సాధించింది. ఈ క్రమంలోనే ఎన్నో వైవిధ్యం గల కవితలు-పాటలు అరుణతారకు విరివిగా వస్తున్నాయి. కేవలం కవిత్వానికే పరిమితం చేసి అరుణతారను ప్రచురిస్తే ఆరునెలలకు సరిపడ కవితలు స్టాక్ ఉన్నాయి. కనుక వచ్చిన వాటిలో నుంచి సమకాలిత కలిగిన వైవిధ్య భరితమైన వాటిని ప్రచురిస్తూ పోతున్నాము. కొన్ని సమకాలితను కోల్పోవటం వలన ప్రచురించలేకపోవచ్చు. ఈ విషయాన్ని పాఠకులు గమనించాలి.

పత్రిక ఒక ఆర్గనైజర్ లాంటిది. ఆర్గనైజర్స్ ఎలాగైతే కార్యకర్తలను, రచయితలను తయారు చేస్తారో, పత్రిక అదే పనిని చేయాలి. కనుక కవులు తమ పాటలను, కవితలను రాసిన తర్వాత కొన్నాళ్లు మాగపెట్టి రెండో సారి తమ రచనను చదువుకొని, తగిన మార్పులు చేసి ప్రచురణ కోసం పంపిస్తే బాగుంటుందని కవులకు విజ్ఞప్తి. అలాంటి రచనలను సమయానుకూలంగా ప్రచురించగలం. అరుణతారకు వచ్చే చాలా రచనలకు చిరునామాలుండవు. కనుక ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

సంపాదకవర్గం

# ఎవరు జాతి వ్యతిరేకి?

జి. సంపత్

తెలుగు: సి. ఎస్. ఆర్. ప్రసాద్

మిగిలిన ప్రపంచమంతటా చరిత్ర పునరావృతమవుతుంది. మొదట దుఃఖ పూరితంగానూ, రెండోసారి వేళాకోళంగాను. 21వ శతాబ్దపు భారతదేశంలో చరిత్ర మొదట వేళాకోళంగానూ రెండవసారి టి. వి. ఛానళ్ళలో కీలక సమయంలోనూ పునరావృతమవుతుంది. దేశంలోని ఒక అత్యున్నత విశ్వవిద్యాలయంలోని తెలివైన విద్యార్థులు 'జాతి వ్యతిరేకులని' వాళ్ళ మీద దాడులు చేసిన దుర్మార్గులు జాతీయవాదులని పిచ్చెక్కినట్లు ప్రవర్తించిన కొందరు టి. వి. యాంకర్లు నమ్మించగలరా? జాతి వ్యతిరేకుల పేరిట మనుష్యుల్ని వేటాడే కాలం చెల్లిన పాత క్రీడకు లోబడకుండా ఈ దేశంలోని ప్రఖ్యాతి చెందిన వైవిధ్యం భారతదేశాన్ని కాపాడగలదా? పాలకులు దీనికి వ్యతిరేకంగా జూదం ఆడుతున్నట్టు కనబడుతున్నది.

కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ జాతి వ్యతిరేకి అనే మాట భాజపా అధ్యక్షుని నోటి వెంట విన్నాం. ఎందుకని? ఎందుకంటే, ఆయన జె. ఎన్. యూ. లో జాతి వ్యతిరేక విద్యార్థుల పక్షాన నిలబడ్డాడు కాబట్టి. ఈ ఆరోపణ వెనుక ఉన్న రాజకీయ ఉద్దేశ్యాన్ని ఎవ్వరూ తప్పుగా అర్థం చేసుకోరు. దురదృష్టం ఏమిటంటే రాహుల్‌గాంధీ జాతి వ్యతిరేకి అని 'షా' ఉద్దేశం. అయితే హాస్యస్ఫోరకం, కాదంటే ఊహాశక్తికి చెంపదెబ్బ.

సంఘ పరివార్ జాతీయవాదుల భావన ప్రకారం ఇప్పటికే మధ్య భారతంలోని ఆదివాసులు, దళిత విద్యార్థులు వామపక్ష మేధావులు, మానవ హక్కుల కార్యకర్తలు ఒక నిశ్చిత మత మైనారిటీలు, అణు వ్యతిరేక కార్యకర్తలు, బీఫ్ తినేవాళ్ళు, పాకిస్థాన్‌ను అసహ్యించుకోని వాళ్ళు, మతాంతర జంటలు, స్వలింగ సంపర్కులు, కార్మికవర్గ కార్యకర్తలు వీళ్ళందరూ జాతి వ్యతిరేకులే. న్యూఢిల్లీలోని పాటియాల కోర్టులో సోమవారం (15-02-2016) నాడు జరిగిన గూండా జాతీయవాద సంఘటనను పరిగణనలోనికి తీసుకుంటే విలేఖరులను జె. ఎన్. యు. విద్యార్థుల్లాగా దుస్తులు ధరించిన వారిని, గుర్తింపు కార్డులు లేనివారిని, గూండా జాతీయవాదుల చర్యలను రికార్డు చేస్తున్న వాళ్లని, గూండా జాతీయవాదుల్ని వ్యతిరేకించే వాళ్ళని కూడా ఈ జాబితాలో తప్పక చేర్చాల్సి ఉంటుంది.

ఇలా చేస్తే ఎన్. డి. ఎ. ప్రభుత్వం పదవీకాలం పూర్తయ్యేసరికి మెజారిటీ భారతీయులు జాతి వ్యతిరేకులుగా మారిపోయే అవకాశముంది. ఎ. బి. వి. పి. , భజరంగ్‌దళ్‌ల దౌర్జన్యపు గుంపు అమలు పరిచే జాతీయవాద పాశవికత (భారతదేశ జాతీయవాద పోలీసు అధికారి ఆ తతంగాన్నంతటినీ శాంతియుతంగా నడిపిస్తుండగా) మాత్రమే వీళ్ళందరి జాతి వ్యతిరేకతకు ఏకైక నివారణోపాయం.

గూండా జాతీయవాదం అంటే ఖచ్చితంగా ఏమిటి? పౌరులను జాతి వ్యతిరేకులుగా ముద్ర వేసే పనిని పొగరుబోతు తనంతో తనకు తాను కేటాయించుకున్న వాడే గూండా జాతీయవాది.

## గూండా జాతీయవాదం వైపు ప్రయాణం:-

గూండా జాతీయవాదం కొత్త ధోరణేమీ కాదు. జర్మన్ చరిత్రకారుడు ఆర్థర్ రోవెన్బర్గ్ తన "ప్రజా ఉద్యమంగా ఫాసిజం" (ఫాసిజం యాజ్ ఎ మాస్‌మూవ్‌మెంట్) అనే పుస్తకంలో ఫాసిజం తలెత్తడానికి ముందున్న రెండు పరిస్థితులను ప్రస్తావించారు. అవి మితవాద జాతీయవాదం తలెత్తటం, ప్రభుత్వానికి దౌర్జన్యకారులకు మధ్య లాలూచీ ఏర్పడటం! గత నెలరోజులుగా ముందు హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలోనూ, ఇప్పుడు జె. ఎన్. యు లోనూ జరిగిన సంఘటనలు ఒక ఎజెండాను ముందుకు తీసుకుపోవడానికి అవసరమైన ఈ రెండు పరిస్థితులను సంఘటితం చేయటానికే జరిగాయి. ఆ ఎజెండా ఫాసిస్టు ఎజెండా అని మనం పిలవకూడదు. ఎందుకంటే భారతదేశం వైవిధ్యభరితమైన దేశమని, భారత ప్రజాస్వామ్యం చాలా పరిణితి చెందిందని ఫాసిజం అనే పదాన్ని వాడాల్సిన అవసరమే ఉండదని ప్రఖ్యాత భారత ఉదారవాదులు పదే, పదే మనకు అభయమిస్తూ వచ్చారు.

కానీ, ఈ రెండు సంఘటనల తీరు కొట్టొచ్చినట్లు కనబడుతోంది. హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో ఒక విద్యార్థి సంఘం యాకూబ్ మెమన్ పట్ల సానుభూతి వ్యక్తీకరించటంతో సంక్షోభం రగుల్కొంది. అతడి ఉరిని ప్రముఖ న్యాయ నిపుణులు చాలా మంది కూడా ప్రశ్నించారు. ఆ విశ్వవిద్యాలయంలోని ఎ.బి.వి.పి. శాఖ ఈ విద్యార్థి సంఘాన్ని "జాతి వ్యతిరేకి"గా ప్రకటించి వాళ్ళను శిక్షించ పూనుకున్నది. వాళ్ళ తరపున వకాల్తా పుచ్చుకున్న భా. జ. పా. పార్లమెంటు సభ్యుడు బండారు దత్తాత్రేయ కేంద్రానికి ఫిర్యాదు పంపారు. ఫలితంగా అధికారానికి తలొగ్గిన వైస్ ఛాన్సలర్ పోలీసులు ఎ.బి.వి.పి ని దాని హింసాత్మక ఆధిపత్యవాదాన్ని విమర్శిస్తోన్న రోహిత్ వేముల ఆత్మహత్యతో ఈ కథ జాతీయ స్థాయిలో పతాక శీర్షికలకెక్కింది.

అఫ్జల్‌గురుకు మద్దతుగా ఒక విద్యార్థి బృందం నిరసన సభను నిర్వహించటంతో జె. ఎన్. యు. లో సంక్షోభం రగిలింది. అతడి ఉరిని కూడా న్యాయకోవిదులనేకమంది ప్రశ్నించారు. ఆ బృందంలోని విద్యార్థుల మీద "జాతి వ్యతిరేక" ముద్ర వేసి ఎ. బి.

వి. పి. వేధింపులు ప్రారంభించింది. దీనికి మహేశ్‌గిరి అనే భా. జ. పా. పార్లమెంటు సభ్యుడు వకాల్తా పుచ్చుకొన్నాడు. అతడి ఫిర్యాదు కారణంగా కేసు నమోదయ్యింది. ఫలితం అధికారానికి తలొగ్గిన వైస్‌ఛాన్సలర్, పోలీసులు ఎ. బి. వి. పి. లక్ష్యంగా పెట్టుకున్న విద్యార్థులపై చర్యలు తీసుకున్నారు. ఎ. బి. వి. పి. ని, దాని హింసాత్మక ఆధిపత్యవాదాన్ని విమర్శిస్తున్న జె. ఎన్. యు. విద్యార్థి సంఘం అధ్యక్షుడు కన్హయ్యకుమార్ నిర్బంధంతో కథ జాతీయస్థాయిలో పతాక శీర్షికలకెక్కింది.

ఈ రెండు సంఘటనల్లోనూ, విద్యార్థులపై దాడికి ఉపయోగించబడింది. జాతీయవాదం-నిర్దిష్టంగా మితవాద జాతీయవాదం- అనబడే ఆయుధం. రోజన్‌బర్గ్ చెప్పినట్లుగా ఈ ఆయుధాన్ని తమ ఇష్టారాజ్యంగా ప్రవర్తించటానికి గూండాల ముఠా అయిన ఎ. బి. వి. పి. కి రాజ్యం అవకాశం కలిగించింది.

సహనాన్ని కాపాడటం పట్ల అయిష్టంగా ఎన్. డి. ఎ. ప్రభుత్వం ప్రవర్తిస్తున్న తీరు పట్ల ప్రజలు అవమానానికి గురైన తరువాతనే జె. ఎన్. యు. లో నిరసన గళాలపైన విరుచుకుపడటం, పాటియాలా కోర్టులో విలేఖరులపై దాడి జరగటం గమనార్హమైన విషయాలు. ఇదంతా చూస్తే గత కొద్ది నెలలుగా అసహనం పట్ల ఉదారవాదుల నిరసనలు, ఎన్. డి. ఎ. పైన కించిత్తు ప్రభావం కూడా అర్థమవుతోంది.

హిందుత్వ శక్తులకు ఆర్థిక ఉదారవాదానికి (నయా ఉదారవాదం) మధ్య ఒక ఒడంబడిక ఉందన్న అంశాన్ని అంగీకరించటంలో తమని తాము "రాజ్యాంగబద్ధ" ఉదారవాదుల వైఫల్యం దేశానికి ఒక శాపం! ఈ వైఫల్యం కారణంగానే ఇలాంటి హింస జరిగినప్పుడల్లా వాళ్ళు దాన్ని కేవలం వాక్ స్వాతంత్ర్యం పై దాడిగా మాత్రమే గుర్తిస్తున్నారు. అణచివేత నేపథ్యంలో ఉన్న రాజకీయార్థికాంశాన్ని దానిలో తమ పాత్రను గుర్తించటం పట్ల వాళ్ళు అంధత్వాన్ని ప్రదర్శిస్తున్నారు.

**ఉదారవాదుల మోసం:-**

కార్మికుల, నగర పేదల, రైతుల, భూమిహీనుల, భూమి ఉన్న పేదల వీళ్ళలో అత్యధికులు సాంఘికంగా నిర్లక్ష్యం చేయబడ్డ కులాల వాళ్ళు. వీళ్ల ప్రయోజనాలను పట్టించుకొనని, లేదా వాటికి వ్యతిరేకంగా రాజ్యం ప్రవర్తించినప్పుడల్లా ఆర్థిక ఉదారవాదాన్ని కావలించుకున్న భారతదేశ ఉదారవాద శిష్యులు మొహం పక్కకు తిప్పుకొని చూస్తూ వచ్చారు. ఇప్పుడు తమ ఉదార స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై రాజ్య ఆమోదిత ఉదార వ్యతిరేక శక్తుల ఉచ్చు బిగుస్తున్న సమయంలో రాజ్యం పట్టించుకోకుండా తల పక్కకు తిప్పుకోవడాన్ని వీళ్ళు చూస్తున్నారు.

ఇలాంటి ఉదారవాదుల భ్రమలన్నీ వారి స్వార్థానికి మాత్రమే ఉపయోగపడేవనే సత్యాన్ని రోహిత్ వేముల, కన్హయ్యకుమార్‌లు స్పష్టంగా అర్థం చేసుకున్నారు. హైదరాబాదు విశ్వవిద్యాలయంలోని దళితుల, ముస్లిముల మధ్య ఐక్యత సాధించడానికి వేముల ప్రయత్నించాడు. జె. ఎన్. యు. లో ఎ. బి. వి. పి. విచ్ఛిన్నకర రాజకీయాలకు, వెలుపల నయా ఉదారవాద ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా విద్యార్థుల్నీ, అసంఘటిత కార్మికుల్ని ఐక్యం చేయడాన్ని కుమార్ తన లక్ష్యంగా పెట్టుకున్నాడు. వాళ్ళ రాజకీయ దృష్టిలోని ఈ తీక్షణత కారణంగానే గూండా జాతీయవాదుల దృష్టిలో వాళ్ళు ప్రమాదకారులుగా పరిణమించారు. వారిద్దరి రాజకీయ దృష్టి తీవ్రతకు ఎటువంటి ప్రత్యేక హోదాలు, స్థాయిలు లేని వారి పుట్టుక, పెరుగుదల ప్రధాన కారణమని మనం గుర్తించాలి.

జాతీయవాదం అంటే భారత ప్రజల సంక్షేమమా? లేక భారత రాజ్య సంక్షేమమా? రాజ్య సంక్షేమం ఎట్లాగూ భారత శ్రమశక్తి కంటే విదేశీ పెట్టుబడికే అమ్ముడుపోయింది కదా? ఒకళ్ళను జాతి వ్యతిరేకి అని ముద్ర వేసే హక్కు ఎవరికుంది? జాతి వ్యతిరేకి అనే ముద్ర పట్ల ఒక సాధారణ భారత పౌరుడు ఎలా స్పందించాలి?

నేను జాతి వ్యతిరేకిని కాదు అని నిరూపించుకోవటం కోసం ప్రయత్నించడమంటే, ఆ ఆరోపణకు సమాధానం చెప్పాలని ప్రయత్నించటమంటే యుద్ధంలో ఓడిపోయినట్లే! సోషల్ మీడియాలో విపరీతంగా ప్రచారంలోకి వచ్చిన అద్భుతమైన తన ప్రసంగం ద్వారా కన్హయ్ కుమార్ ఇలాంటి ఆరోపణ పట్ల ఎలా స్పందించాలో మనకు నిరూపించాడు. అదేమంటే ఎదురుదాడి! జాతీయవాదులనే సర్టిఫికెట్లు జారీ చేయటానికి గూండా జాతీయవాదులకు ఉన్న అర్హతలేమిటని ప్రశ్నించటం, వాళ్ళు అట్లా చేయటానికి అవకాశమిచ్చిన ప్రభుత్వం దురుద్దేశాలని ప్రశ్నించటం.



## చలసాని ప్రసాద్ పాతాలు, ప్రసంగాలు, లేఖలు పంపించండి

జూలై 25న చనిపోయిన విరసం నాయకుడు చలసాని ప్రసాద్ గత నలభై ఏళ్లలో వివిధ సందర్భాల్లో ఎన్నో అంశాలపై పాతాలు చెప్పారు. ప్రసంగాలు చేశారు. మీ దగ్గర నోట్స్ ఏ రూపంలో ఉన్నా పంపించండి. ఆడియోలు ఉన్నా ఇవ్వండి. ప్రసాద్‌తో వ్యక్తిగత సంభాషణల రికార్డులు ఉన్నా పంపించండి. అలాగే గత అరవై ఏళ్లలో చలసాని తన మిత్రులకు విరివిగా ఉత్తరాలు రాశారు. చలసాని పాతాలు, లేఖలు, ప్రసాద్ ఉన్న ఫోటోలు విరసం సేకరిస్తోంది. మీ దగ్గర ఏవి, ఏ రూపంలో ఉన్నా ఈ కింది చిరునామాకు పంపించండి. ఒరిజినల్స్ అయితే కాపీ చేసుకొని భద్రంగా తిరిగి ఇస్తాం.

చిరునామా : పి. వరలక్ష్మి, 5-1820, గీతాశ్రమం వీధి, ప్రొద్దుటూరు, కడపజిల్లా, పిన్ - 516360
ఈమెయిల్ : varalurwa@gmail. com, arunatara1977@gmail. com ఫోన్ : 8179913123

- సం.

# బస్తర్, చత్తీస్‌ఘడ్: భారతదేశంలో "ముల్లయ్‌తీవు" గా మారిపోతుందా?

శ్రీకుమార్ కొడియాతు

తెలుగు: ఆర్. శశికళ

2009 సంవత్సరంలో శ్రీలంక ప్రభుత్వం, ఎల్.టి.టి.ఇ. మధ్య జరిగిన నాల్గో దశ చివరి యుద్ధం ఒక పద్ధతి ప్రకారం జరిగిందని, ఇదొక ప్రైవేటు వ్యవహారమని ప్రభుత్వం ముద్ర వేసి ప్రచారం చేసింది. మానవతావాద సంస్థలు, అంతర్జాతీయ సంస్థలు, రిపోర్టర్లు, మానవ హక్కుల కార్యకర్తలు ఆ పోరాట ప్రాంతాల నుండి ఒకరి తర్వాత మరొకరు వెళ్ళిపోవాలని ప్రభుత్వం ఆదేశించింది. బలవంతంగా వారిని పంపివేసింది. మొండిగా అక్కడే ఉండిపోయిన కార్యకర్తలు, రిపోర్టర్లను మాయం చేసింది. లేదా భద్రతా బలగాలు తమ అధీనంలో ఉంచుకున్నాయి. వాళ్ళంతా ఈ యుద్ధాన్ని "సాక్ష్యులు లేని యుద్ధం" అని పిలుస్తారు. రణరంగంలోని అరాచకాలను శుభ్రంగా తుడిచిపెట్టడానికి సాయుధ బలగాలకు ఈ భావన సమర్థవంతంగా ఉపయోగపడింది. కానీ ఎన్నో వీడియోలు, ఫొటోలు బయటికొచ్చాయి. అందులో ఆర్మీ అరాచకాలు, చిత్రహింసలు, మృతదేహాలను ధ్వంసం చేయటం, మరణశిక్షలు విధించటం లాంటివి, అత్యాచారాలు సాక్ష్యాలుగా ఉన్నాయి. చివరగా జరిగిన ఈ యుద్ధంలో 20 వేల మంది పౌరులు మరణించగా రెండు లక్షల మంది క్షతగాత్రులయ్యారు. శ్రీలంక నార్తన్ ప్రావిన్స్‌లోని 'ములాయ్‌తీవు' జిల్లా ఈ దుర్ఘటనలకు, దుర్మార్గాలకు సాక్షి. అంతర్జాతీయ సమాజంలో ఆ మచ్చలు అలాగే ఉన్నాయి. ప్రభుత్వం గాయాలను మాన్పుతూ, పునరావాసం కల్పిస్తున్నానంటూ తన నిబద్ధతను చాటుకొనే వైపుగా ప్రయత్నాలు కొనసాగిస్తోంది. ఇదొక కేస్ స్టడీ లాంటిది. యుద్ధ ప్రాంతాల్లో మానవ హక్కుల కార్యకర్తలను, స్వతంత్ర జర్నలిస్ట్‌లను భద్రతా బలగాలు పెద్ద ఆటంకంగా భావిస్తాయి. వాళ్ళకు కావాల్సింది ఎటువంటి సాక్ష్యాధారాలు లేని యుద్ధం. అది వాళ్ళు అనుసరించే నమూనా. ఆకలి గొన్న పౌరులు, నిరసనలు తెలిపే విద్యార్థులు, సాయుధ మిలిటెంట్లు ఎవరైనా కావచ్చును. వీరందరినీ అణచివేయటమే లక్ష్యం.

ఈ సందర్భంలో మధ్య భారతదేశంలోని చత్తీస్‌ఘడ్ పరిణామాలను విశ్లేషించాలి. ఆ ప్రాంతం 40% అటవీ ప్రాంతంలో ఉన్నది. రెండు రకాల దోపిడీకి గురవుతోంది. అత్యంత విలువైన ఖనిజ సంపద, కట్టు బానిసల్లాంటి ఆదివాసీలు. బొగ్గు నుండి, వజ్రాల వరకూ స్వర్గం లాంటి భూతలం వేటగాళ్ళకు లక్ష్యంగా మారింది. మైనింగ్ కంపెనీలకు స్నేహ హస్తం అందించే ప్రభుత్వం చట్టాలను, అవసరమైతే సుప్రీంకోర్టు ఆజ్ఞలను ధిక్కరించి అయినా మైనింగ్ కార్యకలాపాలు సజావుగా సాగేందుకు అన్ని ఏర్పాట్లు చేస్తుంది. అందులో వచ్చే లాభాలకు ఎటువంటి లెక్కా పత్రం బయటికి తెలియదు. ఇటువంటి అక్రమాలను అడ్డుకుంటున్న వామపక్ష తీవ్రవాదులను 'నక్సలైట్లు' అని పిలుస్తారు. మధ్య భారతదేశంలోని కొన్ని ప్రాంతాలకు 'రెడ్ కారిడార్' అని నామకరణం చేసారు. ఈ ప్రాంతాల్లో జరుగుతున్న పోరాటాలను అంతర్గత భద్రతకు పెను ముప్పు అని ప్రభుత్వాలు ప్రకటించాయి.

మైనింగ్ కంపెనీలు కాంట్రాక్టులు మిలియన్ల కొద్దీ రూపాయలు పెండింగ్‌లో ఉన్నాయి. లేకుంటే ఈ పాటికి స్థానిక రాజకీయ నాయకుల నుండి బడా రాజకీయ పార్టీల వరకూ ఎన్నికల నిధులు సమకూరేవి. ఏ ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చినా, కొత్త ఎత్తుగడలను అనుసరిస్తూ ఆదివాసులకు వ్యతిరేకంగా ప్రైవేటు సైన్యాలను తయారు చేసి వారి జీవితాలను అల్లకల్లోలం చేస్తున్నాయి. ప్రభుత్వాల సృష్టి 'సల్వాజుడుం' చేసిన అత్యాచారాలు, దాడులు, వర్ణనాతీతం. 2011లో ఇటువంటి కార్యకలాపాలు చట్ట వ్యతిరేకమని, 'సల్వాజుడుం' చట్ట వ్యతిరేకమని సుప్రీంకోర్టు చెప్పింది.

ఇటువంటి కార్యకలాపాలు మానవ హక్కుల సంఘాల, జర్నలిస్ట్‌ల దృష్టిని ఆకర్షించాయి. ఘర్షణలు తీవ్రమవుతున్నాయి. అనేకమంది ఆదివాసీలు మాయమవుతున్నారు. ఒకవేళ కన్పించని నక్సలైట్ల పేరుతో మృతదేహాలును ప్రెస్ కాన్ఫరెన్స్‌లలో ప్రకటిస్తున్నారు. సాయుధ గ్రూపులను వేసామని పోలీసులు చెప్పుకుంటున్నారు. ఈ ఘటనలను తరువాత గ్రామస్తులు ఖండించి నిరాయుధులైన పౌరులను చంపారని, పెద్ద ఎత్తున మహిళలపై అత్యాచారాలు చేసారని, గ్రామాలను తగలబెట్టారని చెబుతున్నారు. ఇలా చెప్పటం నిరంతరాయంగా జరిగతోంది. అనేక ఆదివాసీ హక్కుల సంఘాల వత్తిడితో వచ్చిన "అటవీ హక్కు చట్టం 2006" ప్రకారం ఆదివాసీలకు అటవీ భూములపై యాజమాన్యం హక్కును కల్పిస్తోంది. కానీ మధ్య భారతదేశంలో అత్యంత విలువైన ఖనిజ సంపదను బడా మైనింగ్ కంపెనీలకు అప్పగించాలంటే ప్రభుత్వాలకు ఈ చట్టమే పెద్ద అవరోధం. ప్రస్తుత రాజకీయ వాతావరణంలో ఈ హక్కును బదిలీ చేయాలి. దేశభక్తి, పౌర స్వేచ్ఛలు బదిలీ కావాలి. అటువంటి కుటిల ఎత్తుగడలతో ఏకీభావం సాధించాలి. పాత ఎత్తుగడలను పునఃసమీక్షించాలి. రాష్ట్రమంతటా పోలీసులు నియమింపబడ్డారు. ఒక సీనియర్ పోలీస్ అధికారి ఎస్. ఆర్. పి. కల్లూరి ఒక గిరిజన మహిళపై అత్యాచారం కేసులో ముద్దాయి. ఎన్‌కౌంటర్ కథలు సృష్టించడంలో ఇతను నిపుణుడు. ఇతడు బస్తర్ ప్రాంతంలో ఇన్‌చార్జి. ప్రభుత్వ ప్రేరేపిత సాయుధ

(మిగతా 60వ పేజీలో.. )

# కృష్ణానది నీళ్ళు మహబూబ్‌నగర్ విషాదగాథ

## ఎం. రాఘవాచారి

(గత సంచిక తరువాయి. . )

(2)

ఈ ప్రజల మధ్యన సాగునీటి ఉద్యమం వెంట తెలంగాణ ఉద్యమ వేదికల సభలు, సమావేశాలు, కళాప్రదర్శనలు తోడునిలిచి పెద్ద విశ్వాసం ఇచ్చాయి. పాలకులకు ఈపథకం వెంట కదలక తప్పని పరిస్థితి కల్పించాయి. తెలంగాణ తెచ్చుకుంటే ఈ పథకం మనమే అమలు చేసుకుంటామని కె. సి. ఆర్ భరోసా ఇచ్చారు. అనివార్యంగా 2003 లనాటి చర్చ ఒక రూపం తీసుకుని 2009 నాటికి ఎన్నికల అంశమై వై. ఎస్. రాజశేఖర్‌రెడ్డి కొడంగల్ ఎన్నికల సభలో, ఈ పథకం చేపడతామని ప్రకటించాడు. ఇది బాగా ప్రచారమైంది. ఎన్నికల హామీ అమలు పోరాటం మొదలైంది. ఇది ఫలితం సాధనలో తొలి అడుగు.

వై. ఎస్. రాజశేఖర్‌రెడ్డి మరణంతో ఏర్పడిన కాంగ్రెస్ మార్కు సీల్డ్‌కవర్ ముఖ్యమంత్రులకు తెలంగాణ ఉద్యమం ఒక పెనుసవాలు అయింది. కృష్ణా పరీవాహక జిల్లాలలో తీవ్రంగాను, ఇతర తెలంగాణ ఉద్యమ వేదికల నుంచి సాధారణ స్థాయిలోనే అయినా ప్రతినిత్యం విమర్శనాస్త్రాలు సంధించింది. ఈ పథకాన్ని డిమాండ్ చేయని వ్యక్తులు, సంస్థలు లేవంటే అతిశయోక్తి కాదు. తెలంగాణ ఉద్యమంలో ఈ స్థాయిలో ప్రజాదరణ పొందిన పథకం కూడా మరొకటి లేదేమో? కాలం నెట్టుక రాలేకపోయిన కొణిజేటి రోశయ్య తన పదవినే వదిలిపోగా, కాలం చెల్లిన వితండవాదనలతో మొండిగా కాలం గడిపిన నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి ఎట్టకేలకు 8 ఆగస్టు 2013లో 72 జీ. ఓ. విడుదల చేస్తూ సర్వేకు నిధులూ కేటాయించవలసి వచ్చింది. ఇది ఈపథకం సాధనలో మరో పెద్దముందడుగు.

తొలిదశ ప్రాతినిధ్యాలతోనే వై. ఎస్. ఆర్. ఈ పథకాన్ని జలయజ్ఞంలో భాగం చేసి ఉండి ఉంటే ఈ రెండు జిల్లాలకు ఎంతో మేలు జరిగివుండేది. పాలమూరు అధ్యయన వేదిక ఈపథకం సాధనను ఒక సవాలుగానే తీసుకుని జిల్లా కేంద్రంలోను, హైదరాబాద్ సచివాలయం ముందర 30 గంటల జలసాధన దీక్షాశిబిరాలను నడిపింది. అనేక సభలు జరిపింది. మనుషులు పిట్టల్లా రాలిపోతున్న మండే ఎండలలో 38 మండలాలలోని 11 నియోజకవర్గాల గ్రామాలలో 8రోజులు వేలాది కరపత్రాలు పంచుతూ ప్రజల్ని కదిలిస్తూ వత్తిడి పెంచింది. దీనికి అనేక సంఘాల కృషి మద్దతు తోడై ఈ పథకం ఫలించింది. టి. ఎన్. జి. ఓల సంఘం, డి. టి. ఎఫ్, స్థానిక జెఏసిలు, రచయితలు, కళాకారులు, పత్రికా రచయితలు, ఇతర ఉద్యోగ కార్మిక సంఘాలు అందించిన తోడ్పాటు, పల్లెలలో ప్రజల స్పందన ప్రత్యేకంగా గుర్తించదగినవి. కలలు కనడానికి ధైర్యం కావాలన్నాడు రాజశేఖర్‌రెడ్డి. అధికారం చేతిలో వున్న పాలకులు ప్రజల కలల్ని చిదిమేస్తుంటే ఏ స్థాయిలో పోరాడవలసి వస్తుందో దానికి తెలంగాణ పోరాటం ప్రబలమైన ఉదాహరణ అయితే పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకం కూడా అలాంటి ఉదాహరణే.

### సరికొత్త సమస్యలు ..

పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకం అమలుకు సంబంధించి అసలు కష్టాలు జీవో సాధించుకున్నాక మొదలయ్యాయి. తెలంగాణ రాష్ట్రం వచ్చినతరువాత మొదలయ్యాయి. ఎలా అమలు చేయాలనే చర్చలో పథకరచన దగ్గర, ప్రచారం దగ్గర, జీవోసాధించిన దగ్గర ఉండిన పారదర్శకత లోపించింది. ఇది పూర్తిగా ప్రభుత్వం, రిటైర్డ్ ఇంజనీర్లు, సర్వే కంపెనీల వ్యవహారంగా మారిపోయింది. డెబ్బై టి.ఎం.సిలకు మించి నీరు లిఫ్ట్ చేయాలనే ఆలోచన, హైదరాబాద్ నగరానికి తాగునీటికి నీరు తరలించాలనే ఆలోచన తోడయ్యాయి. ప్రజలలో ప్రచారమైన పాత పథకానికి మెరుగులు దిద్దేపని పథకం మొత్తాన్నే పడమటి నుంచి తూర్పుకు, జూరాలనించి శ్రీశైలానికి మార్చేదిగా పరిణమించింది.

తొలి అడుగులోనే కోయిల్‌కొండ దగ్గర ఒక్కసారే డెబ్బై టి.ఎం.సి. ల ప్రాజెక్టు నిర్మించాలని, అనేక గ్రామాలు మునిగిపోయే విధంగా పథకాన్ని తిరగరాయటంతో కోయిల్‌కొండ, మద్దూరు, ధన్వాడ మండలాలలో ఆందోళన మొదలైంది. ప్రజాందోళనలు గుర్తించి ప్రచారంలో ఉండిన చిన్న చిన్న జలాశయాలతో కూడిన పాత పథకం నిర్మాణం చేపట్టకుండా ఏకంగా స్థలమే మార్చేశారు. తొందరపడ్డారు. నారాయణపేట, కొడంగల్ ప్రాంత ప్రజలు అన్ని రకాలుగా, అన్ని రంగాలలో వెనుకబడి ఉన్న పరిస్థితిని పరిగణించకుండా, చిన్నచిన్న కారణాలు ముందర పెట్టి తక్కువ వ్యయంతో ఎక్కువ ప్రయోజనం సాధించగల పథకాన్ని ఎక్కువ వ్యయం కొత్త సమస్యలు ముందుకువచ్చే రకంగా స్థలం మార్చి ప్రజలను మరింత ఆందోళనకు నెట్టారు. ఆగమేఘాల మీద కొత్తదారులు, కొత్త నిర్మాణాలు, ప్లాన్ చేశారు. 2014 జూన్ 2న తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడినా, వివిధ రూపాలలో వత్తిడి మొదలైన తర్వాతనే 11 జూన్ 2015న ముఖ్యమంత్రి భూత్పూర్ మండలంలో కరివెన దగ్గర శంకుస్థాపన చేశారు. ప్రజలు చాలా సంబరపడ్డారు. ఇది మరొక ముందడుగు.

తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావం తర్వాత కృష్ణానది నీటి వినియోగానికి సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం ఉద్దేశ్య పూర్వకంగా పారదర్శకత, చర్చలేకుండా ముందుకు తెచ్చిన సవాళ్ళు జిల్లాకు చాలా నష్టం చేసేవి కావటం వల్ల చాలా ఆందోళన చెందవలసి వచ్చింది. తెలంగాణ ఉద్యమ సందర్భంలో రాయల తెలంగాణ అనే ఒక వదంతి లేచింది. పత్రికలలో వచ్చిన ఆ వార్తల మీద ప్రజలు ఆగ్రహం వ్యక్త

పరిచారు. జిల్లాలో ఉద్యమ కాలంలోను, ఎన్నికల ప్రచార సభలలోను కె. సి. ఆర్ జూరాల-పాకాల పథకంతో పాలమూరు జిల్లా ఒక వెలుగు వెలిగిపోతుందని గొప్ప ప్రచారానికి తెరతీశారు. ఎప్పటికప్పుడు దీనిని ఖండించినా పెద్ద ప్రచారం రాలేదు. అయితే ప్రభుత్వం ఏర్పడిన తర్వాత కూడా జూరాల- పాకాలను పదేపదే చర్చకు తేవటంతో ఉద్యమ స్థాయిలో వ్యతిరేకించి విస్తృతంగా ప్రచారం చేసి జరిగే నష్టమేమిటో ప్రజలకు వివరించవలసి వచ్చింది.

జూరాల పాకాల పథకాన్ని జూరాల ఎడమ కాలువ వెంట ప్రారంభించి పదకొండు కిలోమీటర్ల తర్వాత ఒక పెద్ద టన్నెల్ ద్వారా డిండి దిగువదాకా నీరు తరలిస్తారు. ఆసారంగం ఎక్కడ ఓపెన్ అవుతుందో అక్కడ మిడ్ డిండి నిర్మాణాన్ని ప్రతిపాదించారు. ఇంకోవైపు శ్రీశైలం ఎడమగట్టు కాలువ పనులు పూర్తయితే ఆనీటికై మన్నెవారిపల్లి దగ్గర నక్కల గండిలో ఒక రిజర్వాయర్ నిర్మిస్తారు. అక్కడి నుండి ఎత్తి సిద్దాపురం దగ్గర నిర్మించే మిడ్ డిండిలో పోస్తారు. ఇది జూరాల - పాకాల, ఎస్. ఎల్. బి. సి. నీరు నింపటానికి బహుళ ప్రయోజన ప్రాజెక్టు. దీని నుండి ఎత్తి ప్రస్తుతం దుందుభి నదిమీద నిర్మాణమై వున్న డిండి ప్రాజెక్టులో పోస్తారు. డిండి స్థాయి పెంచుతారు. విశేషమేమంటే ఒకసారి డిండిలో ముంచిన గ్రామాలను మరోసారి ముంచుతారు. ప్రస్తుత డిండి అప్పర్ డిండి కాగా మధ్యలో ఒక డిండి, దిగువన ఒక డిండి ఇలా మూడు పెద్ద ప్రాజెక్టులు నిర్మాణం అవుతాయి. భూములు, పల్లెలు జిల్లాలో మునిగి నీళ్ళు నల్లగొండలో పారుతాయి. ఈ రెండు ప్రాజెక్టులతో జిల్లాకు కలిగే మేలు లేనేలేదు. ఈ విషయం చర్చించవచ్చు, వాదించవచ్చు, నిరూపించవచ్చు.

పూర్వపు డిండిలో మునిగిన గ్రామాలలోను, మిడ్ డిండి నిర్మాణమైతే మునిగే గ్రామాలలలోను పాలమూరు అధ్యయన వేదిక పర్యటించింది. అప్పుడు మరుగున వుంచిన అనేక విషయాలు, వ్యక్తులు, మోసకారితనం అవగాహనలోకి వచ్చాయి. నైజాం పాలనలోనే డిండి ప్రాజెక్టు ముంపు బారిన పడిన నిజాంబాద్ తదితర గ్రామాల ప్రజలు నిర్వాసితులై చెల్లాచెదురై అనుభవించిన దైన్యం, ప్రభుత్వాల దుర్మార్గం మాటలతో చెప్పలేం. లేత వయస్సులో నిర్వాసితత్వం అనుభవించిన వారు వృద్ధులై కూడా మరోసారి విస్థాపన అంటే గొల్లుమని ఏడ్చి కంటతడి పెట్టించారు.

## మెడల మీద కత్తులు..

జూరాల-పాకాలకు, డిండి ఎత్తిపోతలకు వ్యతిరేకత వస్తుందని ఆ పథక రచయితలు ముందే ఊహించారు. అందుకే మిడ్ డిండిని అటు జూరాల-పాకాలకు, ఇటు డిండి ఎత్తిపోతలకు ఉపయోగపడే విధంగా ప్లాన్ చేశారు. ఇది బెడిసికొట్టకుండా ఈ పథకానికి మహబూబ్‌నగర్ జిల్లా నించే డిమాండ్ రావటానికి అనుకూలంగా అమ్రాబాద్ ఎత్తిపోతల పథకానికి మిడ్ డిండి నుంచి రూపకల్పన చేశారు. ఈ ఇంజనీర్ల బృందమే లేదా వీరి మిత్రులే ఇదివరలో కల్వకుర్తి ఎత్తిపోతల పథకం ఆయకట్టును రెండున్నర నుండి మూడున్నర లక్షలకు పెంచినపుడు చిన్నచిన్న సాకులతో అచ్చంపేట నియోజకవర్గానికి చాలా అన్యాయం జరిగే విధంగా ఆయకట్టు తగ్గించారు. ఇతర నియోజకవర్గాలకు పెంచారు. ఏ ఇతర సాగునీటి పథకాలకు నోచుకోని, ధారవాగు, మానువడ్డవాగు పథకాలు కూడా అమలుకాని అమ్రాబాద్ ప్రాంతానికి కల్వకుర్తి ఎత్తిపోతల కాలువను చంద్రసాగర్‌కు లింక్ చేసి నీరిచ్చే అవకాశమున్నా ప్రతిపాదించలేదు. లేదా నేరుగా నక్కలగండి దగ్గర లోయర్ డిండి నుండి లేదా ప్రస్తుత డిండి నుండి ప్రతిపాదించకుండా ఒక అంతర్గత వైరుధ్యానికి తెరతీసే విధంగా మిడ్ డిండి నుండి ప్రతిపాదించారు. ఈ సందర్భంలోనే గత ప్రభుత్వాల దుర్మార్గాన్ని తీవ్రంగా ప్రశ్నించవలసి ఉంది.

మహబూబ్‌నగర్ సాగునీటి కోసం నిరంతరం పోరాడినా పట్టించుకోని కాంగ్రెస్ ప్రభుత్వం కాగితాల మీద ప్రతిపాదనలకే డిండి ఎత్తిపోతలకు డి. పి. ఆర్. రూపొందించటానికి, సర్వేలు చేయించటానికి ఎందుకు పూనుకున్నది. ? మహబూబ్‌నగర్ జిల్లాను వలసల నించి కాపాడే పాలమూరు పథకానికి డి. పి. ఆర్ చేయించే ఉత్తర్వు లివ్వటంలో ఎందుకు జాప్యం చేసింది? ప్రజల న్యాయమైన ఆకాంక్షను గుర్తించి ఈ ఎత్తిపోతల పథకం పనులు ప్రారంభించివుంటే పరమ అన్యాయమైన సరికొత్త సవాళ్ళు ఈ పథకాన్ని ముందుకు కదలనీయకుండా చేసేవి కావు. పారదర్శకతగానీ, న్యాయంగానీ లేకుండా ఎప్పటికప్పుడు ముందుకు తెస్తున్న మెలికల వల్లనే ఏ ప్రభుత్వ పాలనవున్నా పాలమూరు -రంగారెడ్డి ఎత్తిపోతల పథకం పనులు సకాలంలో ముందుకు సాగటం లేదు. ఎందుకీ వివక్ష?

పాలమూరు -రంగారెడ్డి ఎత్తిపోతల పథకం పనులు పడమర నుండి తూర్పుకు మారిన తరువాత అనేక కొత్త సవాళ్ళు, మెలికలు ముందుకు వచ్చాయి. మొదట శ్రీశైలం రిజర్వాయర్ నుండి నీరు ఎత్తి నార్లాపూర్ రిజర్వాయర్లో పోస్తారు. అట్నుండి ఏదుల, వట్టెం, కరివెన, లోకిరేవుల నుండి కె. పి. లక్ష్మీదేవిపల్లి రిజర్వాయర్ దాకా లిఫ్ట్ చేస్తారు. దీనిలో వట్టెం రిజర్వాయర్ పూర్తిగా సమతలమైన నేలమీద నిర్మాణమవుతుంది. నేలమీద గుండ్రటి కట్ట. మధ్యలో నీళ్ళు. మరికొద్దిరోజులకు ఈ ప్లాన్ మరికొంత మారిపోయింది. లోకిరేవు లోతట్టు చెరువు దగ్గర కాకుండా వట్టెం లాగా ఉదండాపూర్ దగ్గర మరో గుండ్రటి కట్ట నిర్మాణాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఎప్పటికి తుదిరూపురాగలదో..

లోతట్టు లేని నేలమీద కట్టలు అనేక సమస్యలు కలిగిస్తాయి. నీటి జాలు చాలావుంటుంది. జాలు పట్టిన నేలంతా చౌటబారి సాగుకు పనికి రాకుండాపోతుంది. నీరూ నిష్ప్రయోజనంగా పోతుంది. కట్టలకు ప్రమాదం కానీ కలిగితే చుట్టూ గ్రామాలను వరద ముంచెత్తుతుంది. ఒక టి.ఎం.సి నీరు అంటే వంద ఎకరాలు పారే నీరుండే అరవై చెరువులతో సమానం. అలాంటిది 14 టి.ఎం.సిల ప్రాజెక్టుకు సమస్య ఎదురైతే ప్రజలేమవుతారు. పైకి చెప్పలేకపోతున్న ఇంజనీర్లు ఇలాంటి భద్రతాపరమైన చాలా ప్రశ్నలు లేవనెత్తుతున్నారు. ఇవేవీ సమాన్య ప్రజల దృష్టికి రావు. ప్రాజెక్టు వల్ల ముంపుకు గురయ్యే ప్రజలు తీవ్రమైన ఆందోళనతో వుండగా ఇతరులు ప్రాజెక్టు నిర్మాణంలో ఎదురవుతున్న మెలికల వల్ల ఆందోళనకు గురవుతున్నారు.

లోకిరేవు స్థానంలో ముందుకొచ్చిన ఉదండాపూర్ తర్వాత అంతారం దగ్గర రిజర్వాయర్ నిర్మాణానికి ప్లాన్ జరుగుతున్నది.

చివరగా కె. పి. లక్ష్మిదేవిపల్లి దగ్గర పది టి.ఎం.సిల రిజర్వాయర్ కాకుండా కేవలం రెండు టి.ఎం.సిల రిజర్వాయర్ నిర్మాణమే జరుగుతుందని, దీనితో రంగారెడ్డి జిల్లాకు కేటాయించాలని ప్రతిపాదించిన రెండు లక్షల డెబ్బైవేల ఎకరాలకు నీరందుతుందా అనే ఆందోళన ఆ జిల్లా ప్రజలను వేధిస్తున్నది. ఈ మధ్యలో హన్వాడ మండలంలో హేమసముద్రం రిజర్వాయర్ ప్రతిపాదనకు వచ్చింది. హామీ కూడాలభించిన ఆరిజర్వాయర్ ఏమైందో వున్నంతలో అదోక బ్యాలెన్సింగ్ రిజర్వాయర్‌గా కనీస స్థాయిలో నిర్మాణం కాగలదా అని ఆ ప్రజలు ఆందోళన చెందుతున్నారు. ఏక్షణంలో ఏమి జరుగుతుందో తెలియకపోవడం వల్ల సాఫీగా పనులు సాగుతూ ఉండవలసిన కాలమంతా చిక్కులు కల్పించు కోవటంలోనే చెల్లిపోతున్నది.

పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని నిర్దేశించిన రెండు జిల్లాలకు మాత్రమే కాకుండా అదనంగా నల్లగొండ జిల్లాకు రంగారెడ్డి జిల్లాను మించి ముప్పై టి.ఎం.సి నీరు తరలించటానికి వేస్తున్న ప్రణాళికల వల్లనే వృథాగా రెండేండ్ల కాలం గడిచింది. నార్లాపూర్ రిజర్వాయర్ నుండి కాలువ, టన్నెల్ ద్వారా గ్రావిటీతో నీరు డిండికి తరలించి తీసుకుపోవాలని ఒకసారి ఆలోచించారు. ఇప్పుడు ఏదుల రిజర్వాయర్ నుండి మేడిపూర్ దాకా తరలించి దుందుభి మీద మరో రిజర్వాయర్ నిర్మించి, అటు నుండి జేపల్లి దగ్గర ఒకటి, ఆ తరువాత ఇర్విన్ దగ్గర మరొకటి రిజర్వాయర్లు నిర్మించి దానిలోకి అటు నుండి నల్లగొండ తరలించాలని ప్లాన్ చేస్తున్నారు. ఇవి కుదరకపోవచ్చునని యాపట్ల నుండి నీరు తరలిస్తే బాగుంటుంది కదా అని మరో ప్రతిపాదన తెస్తున్నారు. అన్యాయమైన ఈ "పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల డిండి లింక్" ప్రణాళికకు నీటికి నోచుకోని రెండు జిల్లాలను, రెండు పథకాలను బలిచేస్తున్నారు. ఇది పూర్తిగా అన్యాయమైన పథకం. ఏదో ఒక రాయితో తల బాదే ప్రయత్నం.

డిండి లింక్ పథకం వల్ల కల్వకుర్తి ఎత్తిపోతల ఆయకట్టు కొల్లాపూర్, నాగర్‌కర్నూల్, కల్వకుర్తి నియోజకవర్గాలలో పెద్ద మొత్తంలో దెబ్బ తింటుంది. కల్వకుర్తి పథకం కాలువల నిర్మాణానికి భూములు కోల్పోయిన రైతులు మిగిలిన భూమికి నీరందుతుందనే ఊరటతో ఉన్నారు. అలాంటి భూములన్నీ డిండి లింక్ కాలువల కోసం మరోసారి కోల్పోవలసి వస్తుంది. పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం ద్వారా పొలాలకు నీరు అందటం మొదలుకాక ముందే నార్లాపూర్ లేదా ఏదుల నుండి మేడిపూర్, ఇర్విన్‌ల ద్వారా రోజుకు ఒక టి.ఎం.సి నీరు తరలిస్తే ఈ పథకం లక్ష్యమే దెబ్బ తింటుంది. కల్వకుర్తి ఎత్తిపోతల ఆయకట్టు, కాలువల వ్యవస్థ దెబ్బతింటాయి. ఈ కాలువలపై స్పిల్‌వేలు, కాజ్‌వేలు నిరించవలసి వస్తుంది. వ్యయం బాగా పెరిగిపోతుంది. సగం పనులు చేసి కాంట్రాక్టర్లు అదనపు నిధులకోసం పనులు ఆపేస్తారు. నక్కలగండి నుండి కావలసినంత నీరు నేరుగా తీసుకునే అవకాశం ఉన్నా ఎందుకు ఒక లింక్ పథకం కోసం రెండు సాగునీటి పథకాలు దెబ్బతీస్తున్నారు. జూరాల-పాకాల అన్నారు. ప్రస్తుతానికి అది ఆగింది. డిండి ఎత్తిపోతల అన్నారు. తాత్కాలికంగా అదీ ఆగింది. డిండి లింక్ పథకంతో తెగబడివస్తున్నారు. ఇవి మెడమీద వేలాడుతున్నకత్తులు. అన్యాయంగా, బలవంతంగా వేలాడదీసిన కత్తులు. ఇవి ఎట్లా అన్యాయమో అసలు నిజాలు పరిశీలిస్తే తప్ప తెలియవు.

## నల్లగొండ జిల్లా ..

నల్లగొండ జిల్లాను తీవ్రమైన ఫ్లోరైడ్ సమస్య వేధిస్తున్నది. శరీరాలు స్వాధీనం లేక, కాళ్ళు, చేతులు స్వాధీనం లేక, వయసు పెరిగినా శరీరాలు పెరగక, నడిచి తిరగలేక శరీర అవయవాలన్నీ స్వాధీనం తప్పి రెండు, మూడు నియోజకవర్గాల ప్రజలు నానా అగచాట్లు పడుతున్నారు. ఈ విషయం కేంద్ర రాష్ట్రప్రభుత్వాలకు బాగా తెలుసు. ఈ ప్రభుత్వాలను ప్రభావితం చేయగలిగిన, శాసించి పనులు చేసుకోగలిగిన రాజకీయ అనుభవం, పోరాటాల అనుభవం నల్లగొండ జిల్లాకు ఉంది. నల్లగొండ జలసాధన ఉద్యమం నుంచి పూర్వపు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే పెద్ద స్ఫూర్తి పొందింది. అంత మాత్రమే కాక రాష్ట్రంలో తొలి భారీ ఎత్తిపోతల పథకం ఎ.ఎం.ఆర్ నాగార్జునసాగర్ నీటి నుండి ముప్పై టి.ఎం.సిల నీరు తీసుకునే విధంగా నల్లగొండ జిల్లాలోనే ఆవిష్కృతమైంది. మహబూబ్‌నగర్ వంటి జిల్లాలు విశ్వాసంతో పోరాడటానికి అది ప్రేరణ అయింది. అదీకాక నల్లగొండ జిల్లా కోసమే శ్రీశైలం ఎడమ గట్టు కాలువకు సంబంధించిన సొరంగం తవ్వకం 45 కి. మి. కు గాను 29 కి. మి. దాకా పూర్తయింది.

ఈ సొరంగం నుండి బయటికి వచ్చిన నీరు పారవలసిన కాల్వలలోనే ఎ.ఎం.ఆర్ ఎత్తిపోతల నీరు పారుతున్నది. రేపు సొరంగం పనులు పూర్తయితే ఈ 30 టి.ఎం.సి నీరుకానీ, ఎ.ఎం.ఆర్ నీరుకానీ అదనంగా ఉంటాయి. ఆనీటిని ఫ్లోరైడ్ ప్రాంతానికి మళ్ళించవచ్చు ఇర్విన్ దాక ఎత్తిపోసి నీరందని భూములకు నీరివ్వవచ్చు. సాగర్ ఎడమ కాలువ నుండి నీరు తీసుకునే ప్రతిపాదనలను ఇంజనీర్లు రూపొందించారు. అలా కాకుండా ఏవిధంగానైనా అదనపు నీటిని మహబూబ్ నగర్‌లోని పథకాల నుండి లేదా జూరాల నుండి తరలించాలనుకోవటంలోని ఆంతర్యం ఏమిటి? దీనిలో న్యాయం ఉందా? ఇది రాజ్యాంగ బద్ధమైన చర్య అవుతుందా?

మరింత లోతుగా కూడా ఈ సమస్యను పరిశీలించవచ్చు నిజానికి ఇది బలం చూపించడమే కానీ న్యాయంకాదు. కృష్ణానదీ జలాల పంపకంలో, వాడకంలో తెలంగాణకు అన్యాయం జరిగిందని పెద్దపోరాటమే చేశాం. తెలంగాణ రాష్ట్రం సాధించుకున్నాం. తెలంగాణ అనేది ఒక ముద్దకాదు కదా! తెలంగాణ జిల్లాల మధ్య, తెలంగాణలోని ప్రాంతాల మధ్య, జిల్లాలలోను అంతర్గతంగా అనేక అసమానతలు, సమస్యలు వైరుధ్యాలు ఉన్నాయి కదా! ఇవన్నీ న్యాయమైన పద్ధతిలో పరిష్కారం కోరుతాయి కదా! వైరుధ్యాలు, అసమానతలు చర్చకు తేరాదు అనటం, హెచ్చరికలు జారీ చేయటం నియంతృత్వం అవుతుంది కానీ, న్యాయమవుతుందా? ఒక్క నీటి విషయమే కాదు. విద్య, ఆరోగ్యం తదితర మౌలికమైన అన్నివిషయాలలోను ప్రబలంగా ఉన్న అసమానతలను తెలంగాణ పరిష్కరించుకోవాలి.

## ఏది అవగాహన? ఏది జలన్యాయం .. ?

అన్ని విషయాలలోను తెలంగాణ ప్రభుత్వం అసమానతలకు గురైన ప్రజల వైపునించి, జిల్లాల వైపునించి పని చేసి న్యాయం చేయాలి. ముందుగా కృష్ణానది నీటిలో జస్టిస్ బచావత్ కేటాయించిన నీరు ఏయే జిల్లాలలో ఎంతెంత పారుతున్నదో తెలంగాణ ప్రభుత్వం లెక్కలు ప్రకటించాలి. డిండి, మూసీ, నాగార్జునసాగర్ ఎడమ కాలువ ఎ.ఎం.ఆర్ ఎత్తిపోతల పథకాలతో నల్లగొండ జిల్లా ఎక్కువ నీరు వాడుకుంటున్నది అనేది తెలంగాణ ప్రజలందరికీ తెలిసిన రహస్యం. జూరాలవల్ల, ఆర్డీఎస్ వల్ల మహబూబ్‌నగర్ జిల్లా మొత్తంగానే 25 టి. ఎం. సీలకు మించి వాడుకోవడం లేదు. బచావత్ ఇచ్చిన తీర్పు మేరకు కూడా నీరు ఉపయోగించుకునే నిర్మాణాలు చేపట్టకుండా, తీర్పు అమలును సమీక్షించకుండా దిక్కుమాలిన ప్రభుత్వాలు మహబూబ్‌నగర్ జిల్లాను దేశం మీదికి తరిమేశాయి.

హైదరాబాద్ మింగేయగా మిగిలిన రంగారెడ్డి జిల్లా పరిస్థితి నీటి వినియోగంలో మహబూబ్‌నగర్ కన్నా ఘోరం. ఈ పరిస్థితుల కారణంగానే నల్లగొండ జిల్లా న్యాయంగా తన వాటా నీరు తీసుకోవాలి కానీ లోపాయకారీ శక్తి వుంది కదా అని ఇతరుల వాటా జోలికి రాకూడదు. నిజంగా నల్లగొండకు నీరు అవసరమే అయితే వివిధ పథకాలతో గోదావరి ద్వారా ఇవ్వవచ్చు. ఇంతగా వత్తిడి ఉన్న, నీటి కొరత ఉన్న కృష్ణానది నీరే కావలసి వచ్చిందా? దీనిని ఆవేశంతో కాకుండా ఓపికతో అర్థం చేసుకోవాలి. జూరాల-పాకాల ప్రతిపాదన, డిండి ఎత్తిపోతల ప్రతిపాదన, డిండి లింక్ ప్రతిపాదన పాత కాలువల కింది భూములకు అదనపు నీటి గ్యారంటీ కోసమని, సిమెంటు ఇండస్ట్రీ కోసమని చర్చ వినపడుతున్నది. ప్రభుత్వం దీనిని లోతుగా పరిశీలించి నిజాలు చెప్పగలదా?

కృష్ణానదీ జలాల పునఃపంపిణీ ఉద్యమం రాష్ట్రంలోపల కూడా జిల్లాల మధ్య నీటి పంపిణీకి ప్రాతిపదికలను చర్చించింది. శాస్త్రీయమైన ప్రతిపాదనలు ముందుకు తెచ్చింది. అవి 1. సాగుయోగ్యమైన భూమి,.2. భూమిలో తేమశాతం, 3. వర్షపాతం, 4. జనాభా, 5. భూగర్భ జలాలభ్యత, 6. వెనుక బాటుతనం 7. ఉపయోగంలో ఉన్న నీటి లెక్కలు ఇవి పరిశీలనలో ఉంచుకుని జలవనరుల వినియోగానికి అవకాశాలను ప్రభుత్వాలు కల్పించాలని డిమాండ్ చేసింది. క్రితం వాడిన నీరు తెచ్చివ్వలేరు. కానీ మునుముందు అన్యాయం జరుగకుండా చూడాలికదా ! నికర జలాలను సమదృష్టితో నిష్పక్షపాతంగా ఏవిధంగా వినియోగంలోకి తెస్తారో మిగులు జలాలను అదేవిధంగా వాడుకలోకి తెచ్చినపుడుజరిగే చర్చ, కలిగే అవగాహన నీటికి సంబంధించి రాబోయే రోజుల్లో ఎదురయ్యే సమస్యలను తట్టుకోవటానికి, ఎదుర్కోవటానికి తోడ్పడుతుంది.

లేకపోతే సామాజిక, రాజకీయార్థిక విశ్లేషకులు హెచ్చరిస్తున్నట్టు రాబోయేరోజులు జలయుద్ధాల రోజులుగా పరిణమిస్తాయి. రాజకీయనాయకులు విచక్షణ కోల్పోయినపుడు ఇంజనీర్లు సమగ్రమైన దృష్టితో న్యాయాన్యాయాలు వివరించగలగాలి. లేదా ఇంజనీర్లు బాధ్యతా రహితంగా ప్రతిపాదనలు ముందుకు తెచ్చినపుడు రాజకీయనాయకులు న్యాయంగా వ్యవహరించాలి. ఈరెండు కొరవడిన పూర్వపు ఆంధ్రప్రదేశ్‌పాలనను, రాష్ట్రాన్ని తెలంగాణ ప్రజలు వదిలించుకున్నారు. దీనిని నిత్యపాఠంగా తెలంగాణ ప్రభుత్వం గుర్తుంచుకోవాలి. అన్ని విషయాలకు న్యాయం ప్రాతిపదిక కావాలి. ఇది మార్గదర్శకం కాగలదు.

రంగారెడ్డి జిల్లాకు తెస్తామని ప్రకటించిన ప్రాణహిత చేవెళ్ళ పథకం అనేక వివాదాలకు, సమీక్షలకు గురవుతున్నది. మంచి జరిగితే మంచిదే. కానీ, ఆనీరు తమదాకా రాదేమోనని రంగారెడ్డి ప్రజలు ఆందోళన పడుతున్నారు. ఆపథకంలో మహబూబ్‌నగర్ మాటలేదు. కానీ ఈ రాష్ట్రంలో గోదావరి మీద, కృష్ణమీద రూపొందించిన అనేక నీటి పథకాలు నల్లగొండకు లింక్ చేయబడి ఉన్నాయి. ఇలాంటి అనేక కారణాల వల్లనే డిండి లింక్ పథకాన్ని బలంగా వ్యతిరేకించ వలసి వస్తున్నది. పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకానికి సాగుతూ వచ్చిన ఈ పన్నెండేండ్ల ఉద్యమ కాలంలో ఏనాడు డిండి లింక్ పథకం ఊసేలేదని గుర్తు చేయవలసి వస్తున్నది. అయినా టెండర్లతో ముందుకు వస్తే నిలువరించటానికి జిల్లా ప్రజలు పార్టీలు ఐక్యంగా పూనుకోవాలి.

## ప్రొ. కొత్తపల్లి జయశంకర్ చొరవ

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో తెలంగాణలో తీవ్రంగా నష్టపోయింది, అన్యాయానికి గురైంది మహబూబ్‌నగర్ జిల్లా యేనని అమరుడు ప్రొ. కొత్తపల్లి జయశంకర్ ప్రతినిధ్యం ఏదో ఒక సభలో మాట్లాడుతూనే వుండేవారు. గద్వాలలో జరిగిన "కృష్ణానదీ జలాల పునఃపంపిణీ ఉద్యమం" సభను ప్రారంభిస్తు తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత మొదటి ప్రాధాన్యత మహబూబ్‌నగర్ జిల్లాకే ఇవ్వాలన్నారు. ఆసభలోను ఇంకా అనేక సభల్లోను కేంద్రజలవనరుల సంఘం మాజీ సభ్యులు ఆర్. విద్యాసాగర్ రావు ఆవేదనతో మాట్లాడుతూ 'మహబూబ్‌నగర్ ప్రజలు 'అమాయకులు', 'గొర్రెలు' తమకు జరిగే అన్యాయాన్నిమౌనంగా సహించే మంచివాళ్ళు' అన్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే తప్ప ఈ అన్యాయం ఆగదు అన్నారు. ఆ సభ తరువాత కృష్ణానదీ జలాల పునఃపంపిణీ విషయమై అన్ని పార్టీల నేతలకు లేఖలు ఇవ్వటమైంది. కన్వీనర్లుగా అమరుడు డా. కె. బాలగోపాల్, ప్రొ.జి. హరగోపాల్ ఈ కృషి చేశారు. ప్రతిపక్ష నేతగా వై.ఎస్.ఆర్‌ను కలిసినపుడు కృష్ణాజలాల పంపిణీ ముగిసిపోయిన ప్రశ్న అన్నాడు. అంతకు మించి మాట్లాడేది ఏమీ లేదన్నాడు. దీనికి ప్రతిస్పందనగా ప్రొ. జి. హరగోపాల్ ఇక మేము తెలంగాణ ఉద్యమం తీవ్రతరం చేస్తామన్నారు. ఈ విషయాన్ని విస్తృతంగా ప్రచారం చేశారు.

వై.ఎస్.ఆర్. ప్రజా ప్రస్థానం పాదయాత్రతో వరంగల్ చేరినపుడు కృష్ణానది నీటి విషయమై స్థానిక ప్రజా సంఘాలతో కలిసి ప్రొ.కె. జయశంకర్ మహబూబ్‌నగర్ పక్షాన నిలదీశారు. వై.ఎస్.ఆర్. తాను ఆడిన మాటను దాటవేసి నీటిపథకాలు మహబూబ్‌నగర్ హక్కు అన్నాడు. ఇదంతాపత్రికలు నమోదు చేశాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పాడి, తెలంగాణ ప్రభుత్వం కూడా ఏర్పడి నీటి పథకాలు చేపడుతున్నపుడు, అనేక మెలికలు, సవాళ్ళు

మహబూబ్‌నగర్‌కు నష్టం చేసేవిగా ముందుకు వస్తున్నపుడు జయశంకర్ లేరు. మహబూబ్‌నగర్ ప్రయోజనాలను దెబ్బతీసే విధంగా వరంగల్లు నించి, పాకాలనించి జూరాల-పాకాల పథకాన్ని ఏ ప్రజాస్వామ్య ప్రియులు డిమాండ్ చేస్తున్నారో?

## ఎవరికోసం పాలన.. ?

ప్రభుత్వంలో భాగమైపనిచేస్తున్న ఇంజనీరింగ్ నిపుణులకు మహబూబ్‌నగర్ ప్రజల మంచితనం, నేతల నైజం తెలుసు. ఉద్యమకాలంలో, నీటి విషయమై నిరంతర కృషి చేసిన తెలంగాణ రిటైర్డ్ ఇంజనీర్స్ ఫోరమ్ న్యాయమైన 'తెలంగాణ జలవిధాన' రూపకల్పన మీద కాకుండా ఇతరేతర పనులలో తలమునకలైవుంది. బహుశా వ్యక్తులుగా కలుసుకోవటం తప్ప ఈ కాలంలో సంఘంగా ఒక్కసారి కూడా ఫోరమ్ సమావేశమై చేసిన తీర్మానాలు కనిపించవు. అయినా డిండి ఎత్తిపోతల పథకం, పాలమూరు-రంగారెడ్డి డిండి లింకు పథకం ఎట్లా ఫోరం ప్రతిపాదనగా ముందుకు వస్తున్నదో, స్థూలంగానైనా ఏకాభిప్రాయ సాధనకు ఎవరు కృషి చేస్తున్నారో తెలియదు. కానీ జిల్లాకు చెందిన అధికార ప్రతిపక్ష శాసన సభ్యులను ఇతర నేతలను లోపాయకారిగా ప్రభుత్వం లోపలినుంచి కొందరు సంప్రదిస్తున్నట్టు తెలుస్తున్నది. ఇదీకాక ఉద్యమ కాలంలో తెలంగాణకు ఆంధ్రతో ఉండిన నీటి వైరుధ్యాన్ని అంత తీవ్రంగా విమర్శించి కె.ఎల్. రావు వైఖరిని ఆంధ్ర పక్షపాతిగా తేల్చిన తెలంగాణ ఇంజనీర్లు తాము మహబూబ్‌నగర్ విషయంలో గతాన్ని పునరావృతం చేయకూడదు కదా!. లోలోపల ఎవరు ప్రభావితం చేయగలరో కుట్రలు చేయగలరో పాలనా వ్యవస్థ వాళ్ళకోసమేనా..?

కనీసం ఈ ఇరవై నెలల కాలం మనసు పెట్టి అవసరమైన నిధులు కేటాయించి ఖర్చు పెట్టి, ఉంటే జిల్లాలో అమలులో ఉన్న నీటి పథకాలు పూర్తైవుండేవి. వర్షపాతానికి నోచుకోని మహబూబ్ నగర్ జిల్లాలో భూగర్భ నీటిలభ్యత రీత్యా గ్రే ఏరియాలుగా, సేమీడార్క్, డార్క్ ఏరియాలుగా ప్రకటించిన మండలాల భూముల స్వభావంలో మార్పు మొదలై ఉండేది. ఈ పని ఎందుకు చేయలేదో అడగటానికి ఎవరు దొరుకుతారు? ఎవరు జవాబు చెబుతారు? అధికార రాజకీయాల ప్రాపున తరించే వాళ్ళకి అడిగే అవసరం లేదు. ప్రజలపట్ల నిర్లక్ష్యంతో ప్రతిపక్షంలోకి మారిన వాళ్ళకి నైతిక ధృతి లేదు. తెగించి అడగటానికి ఎవరి సమస్యలు వాళ్ళకుండి ప్రజలకు నష్టం జరుగుతున్నది.

జిల్లాలో 19వ శతాబ్ది తుది దశాబ్దిలో మొదలై 20వ శతబ్దమంతా పెరుగుతూ వచ్చిన వలసలు 21వ శతాబ్దిలోనైనా ఆగుతాయా? అనేదానికి గత ఇరవైఏండ్లుగా నడిచిన తెలంగాణ ఉద్యమం నుండి ఏపాఠాలు తీసుకోకపోతే ప్రజలకు రాష్ట్రం ఏర్పడిన అనుభవం కలగదు. పాలన కాంగ్రెస్ భుజాల మీంచి, తెలుగుదేశం భుజాల మీంచి అంటే ఆయా ముఖ్యమంత్రుల భుజాల మీదినించి తెరాస భుజం మీదికి మారినట్టు తెలుస్తుంది తప్ప, కేవలం కొనసాగింపుగా అర్థమవుతుంది తప్ప కొత్తదనం ఏమీ ఉండదు. మహిళలు, దళితులు, ఆదివాసులు, వెనుకబడిన పేదలు, మైనారిటీల బతుకుల్లో మార్పు ఎండమావిలో నీటిలా మిగిలి పోతుంది. సంక్షేమ పథకాలు కొన్ని అవసరాలు తీరుస్తాయి. నిజమే కానీ, మౌలిక మార్పును సాధిస్తాయా? అసలు అందరికీ అందుతాయా? గౌరవం దొరుకుతుందా?

## నిర్వాసితులు ఏంకావాలి?..

నీళ్ళ గురించి మాట్లాడుకుంటే నిధుల గురించి మాట్లాడుకోవాలి. నికరజలాలు, మిగులు జలాలు పునఃపంపిణీ మీద అంచనాతో, వెనుకబాటుకు తొలిప్రాధాన్యతతో నిధులు వ్యయం చేయకపోతే వెనుకబడిన ప్రాంతాలకు తీవ్రమైన అన్యాయం జరుగుతుంది. అట్లాగే నీటి ప్రాజెక్టులు మాట్లాడుకుంటే నిర్వాసితులను మాట్లాడుకోవాలి. సంపన్నులను, కార్పొరేట్లను, బహుళజాతికంపెనీలను మొత్తంగా సామ్రాజ్యవాద శక్తులను మరింత సంపద్వంతం చేయడానికి మాత్రమే కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు అభివృద్ధి విధానాలు రచిస్తున్నాయి. అవి ప్రాజెక్టులు, రోడ్లు, పారిశ్రామిక కారిడార్లు, ఫార్మాసిటీలు, సెజ్‌లు, మహానగరాలు తదితర అనేక రూపాలలో ముందుకు వస్తున్నాయి. వీటికి రియల్ ఎస్టేట్ దందా కూడా తోడై సాగుభూముల విస్తీర్ణం దెబ్బతినిపోతుండగా నిర్వాసితత్వం, పర్యావరణ విధ్వంసం పెరిగిపోతున్నది.

మహబూబ్‌నగర్ జిల్లాలో స్వతంత్రానికి పూర్వపు చరిత్రలో ప్రజలు నిర్మించుకున్న 6 వేలకు పైగా లెక్కతేల్చిన చెరువులు, కుంటలవల్ల నిర్వాసితత్వం రాలేదు. ఏమేరకైనా ఉత్పత్తి శక్తులు బలపడ్డాయి. కష్ట జీవుల శ్రమ సంస్థానాలను, కాకతీయులను, నిజాములను బతికించింది. రైలు పట్టాల కాలంలో బలవంతంగా పనుల కోసం తరలించటంతో వలసలు మొదలైనాయి. భారీప్రాజెక్టుల నిర్మాణం కోసం ఈ జిల్లాయే వలసల జిల్లాగా పేరుపొందింది. దీనికి కొనసాగింపుగా డిండి ప్రాజెక్టుతో ప్రారంభించి శ్రీశైలం ప్రాజెక్టు, జూరాల ప్రాజెక్టు, కొనసాగుతున్న భీమ, నెట్టెంపాడు, కల్వకుర్తి, కోయిల్‌సాగర్ ఎత్తిపోతల పథకాల వల్ల, పోలేపల్లి సెజ్ వల్ల, విశాలమైన 44వ జాతీయ రహదారి నిర్మాణం వల్ల, నిర్మాణం చేపడుతున్న పాలమూరు- రంగారెడ్డి ఎత్తిపోతల పథకం వల్ల జిల్లాలో నిర్వాసితత్వం తీవ్రంకానుంది. కల్వకుర్తి పథకం రిజర్వాయర్లు, గట్టు ప్రాంతంలో సోలార్ ప్రాజెక్టు నిర్మాణం ఇలాంటి వన్నీ నిర్వాసిత సమస్యను పెంచనున్నాయి.

అయితే జిల్లా కనీస భవిష్యత్తు కోసం సాగునీటి పథకాలు అత్యవసరంగా చేపడుతూనే నిర్వాసితులకు న్యాయం చేసే అవకాశం లేదా? అభివృద్ధి కోసం సర్వం కోల్పోతున్న ప్రజలకు న్యాయం చేయకపోతే ఆ అభివృద్ధికి అర్థం లేదు. అభివృద్ధి పథకాలకు, భూ సంస్కరణలకు సంబంధం కల్పించటంద్వారా నిర్వాసితులు కోల్పోయే భూమికి భూమి ఇవ్వవచ్చు. ఆయా గ్రామాలలో భూమి లేకుండా ఊరిని నమ్ముకుని కష్టం మీద బతికే వారికీ భూమి ఇవ్వవచ్చు. ఇండ్లు, పనులు కల్పించి ఆందోళన నివారించవచ్చు. 'అభివృద్ధి' ప్రాజెక్టుల వల్ల ఏ భూములకు నీరందుతున్నదో వారికి కనీస భూమి వుంచే పద్ధతితో భూమి సేకరించి భూమి కోల్పోయిన వారికి ఇవ్వవచ్చు. అభివృద్ధి కోసం భూమి కొంటామనే పేరున గుంజుకున్నా, ఎక్కువ మొత్తంలో డబ్బులిచ్చినామని దబాయించినా,

నిర్వాసితులైనవాళ్ళు పూర్వపు జీవన పరిస్థితి కోల్పోతారు. చెదిరిపోతారు. అనుబంధాలు కూడా తెగిపోయి దుఃఖంతో మిగిలిపోతారు తప్ప సుఖంగా జీవించలేరు. అభివృద్ధి కోరినపుడు ఇలాంటి త్యాగాలకు సిద్ధపడాలని ప్రభుత్వాలు చెప్పదలుచుకుంటే అవి రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాలు కానేకావు. నిర్వాసితులకు న్యాయం చేయని అభివృద్ధి నిజమైన అభివృద్ధికాదు.

జిల్లాలో ఒక వంక 1981లో శ్రీశైలం ప్రాజెక్టులో నీరు నింపినప్పటి నుండి నిర్వాసితులై వ్యథతో ఉన్న 64 గ్రామాల యువకులు అనేక రూపాలలో, జిల్లా ప్రజలందరి మద్దతుతో అన్ని పార్టీల మద్దతుతో ఉద్యమిస్తుంటే ఉద్యమ పార్టీ ప్రభుత్వం, ఉద్యమ కాలంలో ఇచ్చిన హామీని పాటించకుండా ఆ ఉద్యమాన్ని నీరు కార్చింది. 180 రోజుల ఉద్యమ శిబిరం కూలిపోతే సంబరం చేసుకుంది. శ్రీశైలం నిర్వాసితులను పట్టించుకుంటే అన్ని పథకాల నిర్వాసితులు లేచి నిలుస్తారని ప్రభుత్వం భయపడింది. ఇంకోవైపు పాలమూరు-రంగారెడ్డి నిర్వాసితులకు ఇంటికి ఒక ఉద్యోగం ఇస్తామని, నల్లగొండకు వెళ్ళి ఇంటికి రెండు ఉద్యోగాలిస్తామని ముఖ్యమంత్రి స్వయంగా నమ్మబలికారు. శ్రీశైలం నిర్వాసితులకు జరిగిన మోసం నిర్వాసితులందరికీ అర్థమైంది. నిజానికి లక్షకు మించి ఉద్యోగాలు కల్పిస్తామని చెబుతున్న ప్రభుత్వానికి, అభివృద్ధి ప్రాజెక్టుల లాభాలలో నిర్వాసితులకు వాటాయే వుంటుందని చెప్పిన కేంద్ర ప్రభుత్వానికి నిర్వాసితుల గోడుపట్టటం లేదు. కనీసం 2013 నిర్వాసిత హక్కుల చట్టాన్ని కూడా ప్రభుత్వాలు పాటించటం లేదు.

దబాయింపు సెక్షన్‌తో అధికారులు తెగబడి భూములు గుంజుకుంటున్నారు. అధికార రాజకీయ నాయకులు దీన్ని మానిటర్ చేస్తు తమ గొప్పతనం చూసి ప్రజలు సంతోషంగా భూములు ఇచ్చేస్తున్నారని పత్రికలలో ప్రకటిస్తున్నారు. నిర్వాసితులపట్ల బాధ్యతను దులిపేసుకుంటున్నారు. క్రితం నుండి కొనసాగుతూ వచ్చిన చరిత్ర కొనసాగుతూనే ఉంది. నిర్వాసితులకు కల్పించే సౌకర్యాలలో, భూములకు ఇచ్చేరేటులో ప్రాజెక్టుకో విధానం, జిల్లాకో రేటు అనుసరిస్తున్నారు. ఇదేమిటి అంటే ఆ జిల్లా ఈ జిల్లా ఒకటేనా అంటున్నారు. ఏ జిల్లా అయినా మనుషులు మనుషులే కదా! ప్రాణాలు ప్రాణాలేకదా! జీవించే హక్కులో కూడా కొందరికి ఎక్కువ హక్కులు, కొందరికి తక్కువ హక్కులు ఉంటాయా? రాజ్యాంగబద్ధ పాలన అంటే ఇదేనా? బాధితులకు న్యాయం చేసే పద్ధతీ ఇదేనా? నేతలే నేరస్తులైతే వారిని నమ్ముకున్న ప్రజల స్థితీ గతీ ఏమిటి?..

## ప్రాజెక్టు కావల్సిందే..

నిజానికి పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకం రాష్ట్రం విడిపోయే చట్టంలో జాతీయ ప్రాజెక్టుగా ప్రకటింపబడాలని ఎంతో ప్రయత్నం చేశాం. పాలకుల వర్గ ప్రయోజనాల వల్ల ఇది ఫలించలేదు. ఆ తరువాత 23-03-2014 భగత్‌సింగ్ వర్ధంతి రోజున "తెలంగాణ రాష్ట్రంలో మహబూబ్‌నగర్ భవిష్యత్తు - నిర్దిష్ట ప్రతిపాదనలు 'పేరున ఒక రోజంతా సెమినార్ నిర్వహించినాము. వివిధ ప్రజా, ఉద్యోగ సంఘాలు, వృత్తి సంఘాలు జలవనరుల నిపుణులు చేసిన సూచనలను, క్రోడీకరించి 46 డిమాండ్లతో 4 పేజిల కరపత్రం 40 వేలు ముద్రించి 14 ఏప్రిల్ 2014న అంబేద్కర్ జయంతి రోజు విడుదల చేశాము. అన్ని నియోజక వర్గాలలో విస్తృతంగా పంపిణీ చేసి ఓట్ల కోసం వచ్చే నాయకులను నిలదీసి హామీలు పొందాలని ప్రజలను కోరాము. ఎన్నికల ప్రచార సభలలో అధికార కాంగ్రెస్, ప్రతిపక్ష బి. జె. పి చేసిన వాగ్దానాలు గాలిలో కలిసిపోయాయి.

ఉద్వేగపూరిత వాతవరణంలో ఎన్నికలు జరిగి తెలంగాణ ప్రభుత్వం ఏర్పడింది. తొలి మంత్రివర్గంలో జిల్లాకు అవకాశమే ఇవ్వలేదు. కనీసం స్థానమే దొరకనపుడు జిల్లా సమస్యలు చర్చకు రాగలవా అని ప్రజలు చర్చించుకున్నారు. బహుశా రాష్ట్ర మంత్రివర్గాల చరిత్రలో ఇలా జరగటం ఇదే మొదటిసారి కావచ్చు. అయినా ఇదంతా పాలకవర్గాల గొడవగా ప్రజలు వదిలేయలేదు. ఆ తరువాత అధ్యయన వేదిక పూనుకుని హైదరాబాదులో 01-02-2015న 'తెలంగాణ రాష్ట్రం - మహబూబ్‌నగర్ భవిష్యత్తు' అని ఒక రోజంతా పత్రికా సంపాదకులను, మేధావులను జలవనరుల నిపుణులను ఆహ్వానించి మరొక సెమినార్ నిర్వహించింది. దీంతో ప్రభుత్వంపై మరింత వత్తిడి పెరిగింది.

ఇదంతా పని చేసి పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకం 11 జూన్ 2015న శంకుస్థాపనకు వచ్చింది. కానీ, రాష్ట్ర ప్రభుత్వం నిర్మాణ స్థలం మార్చినందువల్ల ప్రాజెక్టు వ్యయం బాగా పెరిగిపోయే పరిస్థితి కలిగింది. తుది వివరాలతో డి. పి. ఆర్ చేయకుండానే డిండి లింకుపైనా, ఆ తరువాతి దశలపైనా కేంద్రీకరించారు. దీనివల్ల ప్రాజెక్టు పరిస్థితి మొత్తంగానే ఏమవుతుందనే ఆందోళనకు గురికావలసిన వస్తున్నది.

ప్రాజెక్టు పనులు ప్రారంభం కాకుండా అడ్డుకోవాలని కేంద్రానికి చంద్రబాబు లేఖ రాశాడు. ఈ దుర్మార్గాన్ని అడ్డుకోవాలని చంద్రబాబు వైఖరిపై తెరాస ఒక అఖిలపక్ష రౌండ్‌టేబుల్ జరిపింది. ఒక బందు జరిపింది. ప్రజలు మద్దతు ఇచ్చారు. ఇప్పుడు డిండి లింకును వ్యతిరేకిద్దామని నాగం జనార్ధన్‌రెడ్డి ఒక అఖిలపక్ష సమావేశం జరిపాడు. పార్టీలు, సంఘాలు పాల్గొన్నాయి. ఇంతలో మహబూబ్‌నగర్ జిల్లాకు జలవనరుల కల్పనను వ్యతిరేకించటంలో తాను దిట్టనేనని వై. ఎస్. ఆర్. కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రతిపక్ష నాయకుడు వై. ఎస్. జగన్మోహన్‌రెడ్డి తన పొలిటికల్ మైలేజీ కోసం పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్నే వ్యతిరేకిస్తూ గవర్నర్‌కు లేఖ రాశాడు. ఒకనాడు ఆయన తండ్రి కృష్ణానది నీళ్ళ పంపిణీ ముగిసి పోయిన ప్రశ్న అని తలబొప్పి కట్టించుకున్నాడు. ఆ తరువాత ఆయనే హామి ఇచ్చిన విషయం, వై. ఎస్. జగన్ స్వయంగా తన ఎన్నికల ప్రణాళికలో చేర్చుకుని తెలంగాణలో పోటి పడిన విషయం చాలా సౌకర్యవంతంగా మరిచిపోయి ఇష్టారాజ్యమనుకుని మాట్లాడుతున్నాడు. ఇది బరి తెగించిన దుర్మార్గం.

## ఇప్పటికి ముగింపు ..

పాలమూరు - రంగారెడ్డి పథకం సాధన ఉద్యమ క్రమంలో పాలమూరు అధ్యయన వేదిక జలవనరుల సాధనకు సంబంధించి జిల్లా ప్రజలలో నిర్దిష్టమైన ఆలోచనలను ప్రతిపాదించింది చర్చించింది. పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం జూరాల

నుండి నీరు తీసుకునే విధంగా చేపట్టి కె. పి. లక్ష్మీదేవి పల్లి దాకా నీరు తరలించి, తూర్పున శ్రీశైలం నీటి నుండి కల్వకుర్తి ఎత్తిపోతల పథకం ద్వారా మాడుగుల చివరి దాకా నీరు తెచ్చి ఈ రెండు పథకాలను కలిపితే కృష్ణానదికి దండవేసినట్టుగా ఉంటుంది. తాగునీరు-సాగునీరు అన్ని పల్లెలకు, తాండాలకు, చెంచుపెంటల దాకా అందించటానికి అవసరమైన చర్యలు చేపట్టి ప్రతి ఎకరా భూమికి ఒక పంటకైనా నమ్మకంగా నీరు ఇవ్వాలని అధ్యయన వేదిక డిమాండ్ చేస్తూ వచ్చింది. ఈ ప్రతిపాదన మీద ప్రభుత్వాలూ దృష్టి పెట్టలేదు. ఆ చిత్తశుద్ధి ప్రభుత్వాలకు లేదు.

- జిల్లా వ్యాప్తంగా పొలాలలో కురిసిన వాన నీటిని ఎక్కడి వారక్కడ ఆపుకునే నిర్మాణాత్మక చర్యలు తీసుకోవాలి.
- ప్రభుత్వం కేంద్రీకరించి అన్ని చెరువులు, కుంటలు బాగుచేసి లోతు పెంచి ఆ పూడిక పొలాలలో నింపాలి. యంత్రాలకు కాకుండా ప్రజలకు పని కల్పించాలి.
- నిర్మాణంలో ఉన్న అన్ని ప్రాజెక్టులకు ప్రత్యేక ప్రాధాన్యతతో నిధులు కేటాయించి, నిర్మాణం పూర్తి చేసి రైతాంగానికి మేలు చేయాలి.
- జిల్లాలో ఇప్పటికే నిర్మాణమై ఏటి ఒడ్డున 37 దాకా 100-150 ఎకరాలలోపు నీరు పారే చిన్న ఎత్తిపోతల పథకాలు విద్యుత్తు బిల్లుల బకాయి నెపంతో మూలన పడి ఉన్నాయి. ప్రభుత్వమే బిల్లులు చెల్లించి భూములకు నీరందించాలి.
- పాలమూరు - రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని వెంటనే పూర్తి చేయాలి.
- అమ్రాబాద్ ఎత్తిపోతల పథకం చేపట్టి నల్లమల అప్పర్ ప్లాట్ రైతాంగాన్ని ఆదుకోవాలి.
- ఆర్డీఎస్ నీరు గ్రావిటితో సాధించలేకపోతున్నందువల్ల, తుమిళ్ళ ఎత్తిపోతల చేపట్టాలి.
- నారాయణపేట, కొడంగల్ ఎత్తిపోతల పథకం. చేపట్టి పనులు పూర్తి చేయాలి.
- కాకరణవాణి ప్రాజెక్టును 50 వేల ఎకరాలు పారే స్థాయికి పెంచాలి.
- కాగ్నాతో దౌలతాబాద్ చెరువు నింపే చర్యలు చేపట్టాలి.
- నెట్టెంపాడు హై లెవల్ కాలువతో ఎడారిగా మార్చిన గట్టు మండల భూములకు నీరివ్వాలి.
- భూకబ్జాదారుల నుండి గుట్టలను కాపాడి, జలరక్షణ కోసం గుట్టలపై సహజమైన అడవుల పెంపకం చేపట్టాలి.
- కల్వకుర్తి ఎత్తిపోతలలో అచ్చంపేట నియోజకవర్గానికి తగ్గించిన ఆయకట్టును పెంచాలి.
- అభివృద్ధి పథకాల నిర్వాసితులకు ఉపాధి, భూమి, అన్ని వసతులతో గౌరవ ప్రదమైన జీవన అవకాశాలు కల్పించాలి.
- రాష్ట్ర ప్రభుత్వం స్థానికంగా జలవనరుల పంపిణీని అమలు చేయటంలో పారదర్శకంగా లేదు. కనుక అప్రమత్తంగా ఉండి మన మెడల మీద వేలాడుతున్న కత్తుల నుండి మనని మనం కాపాడుకోవాలి. ప్రాజెక్టుల సాధన ఉద్యమం ఇకముందు మన జిల్లాలో కొన్ని పథకాలు చేపట్టవద్దని, మరికొన్ని చేపట్టాలని, చేపట్టినవి సత్వరం పూర్తి చేయాలని మూడు విధాల పోరాటం చేయవలసిన పరిస్థితిని ప్రభుత్వమే కల్పించింది. మహబూబ్‌నగర్ రంగారెడ్డి జిల్లాల ప్రజలు ఈ పరిస్థితిని ఎదుర్కోవాలి.

తొలి తెలంగాణ ఉద్యమం కాలంలో జస్టిస్ బచావత్ ట్రిబ్యునల్ పని చేసింది. తీర్పు ప్రకటించింది. 2000 సంవత్సరంలో తీర్పు గడువు ముగిసిపోయింది. మలి ఉద్యమ కాలంలో జస్టిస్ బ్రిజేశ్‌కుమార్ ట్రిబ్యునల్ పనిచేస్తున్నది. తీర్పుకూడా ప్రకటించింది. అయితే ఇంతలో ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణ రాష్ట్రం ఏర్పడినందువల్ల ట్రిబ్యునల్ గడువు పొడిగింపబడింది. రాష్ట్ర ఆవిర్భావానికి ముందే చేపట్టిన సాగునీటి పథకాలన్నింటికీ నీటికై ట్రిబ్యునల్ ముందు గట్టిగా వాదించటంలో గత ప్రభుత్వాలు ఘోరంగా విఫలమైనాయి.

తెలంగాణ ప్రభుత్వం నిలకడైన వాదనలతో ఈ ప్రాజెక్టులన్నింటికి నీరు సాధించాలి. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల మధ్య అసమాన నీటి పంపిణీ నివారణకు కృష్ణానదీ జలాల పునఃపంపిణీ ఉద్యమం ముందుకు తెచ్చిన భౌగోళిక, సామాజిక, పర్యావరణ స్పృహతో కూడిన ప్రతిపాదనలు స్వీకరించి తెలంగాణ ప్రభుత్వం కృషి చేయాలి.

అలాగే ఇవే ప్రతిపాదనలతో రాష్ట్రంలోపల జిల్లాల మధ్య జలవనరుల పంపిణీ న్యాయంగా జరగటానికి జల విధానం రూపొందించాలని, ఇదివరలో జరిగిన అన్యాయం సవరించటానికి తొలి ప్రాధాన్యతతో నిధులు వ్యయం చేసే విధంగా ప్రభుత్వంపై ప్రజల వత్తిడి నిర్మించాలి. తెలంగాణ నీళ్ళు తెలంగాణలో న్యాయంతో సంబంధం లేకుండా వాడుకోవచ్చుననే వితండ వాదనలు ఓడించాలి.

సంపన్నులు నీరుకొనగలరు. భూమి లోలోతుల్లోకి దూరి భూగర్భజలం తోడుకోగలరు. ప్రభుతావలను తమ చెప్పు చేతల్లోకి తీసుకుని నదులనే తమ స్వాధీనం చేసుకోగలరు. నీటివ్యాపారంతో కోట్లకు పడగెత్తగలరు. నిజానికి జలవనరుల సమస్య మౌలికంగా సామాజికంగా ఆర్థికంగా వెనుకకు నెట్టబడిన సామాన్యుల సమస్య ఈ వాస్తవం గుర్తించి పేదలంతా నీటి కోసం మౌలిక వనరుల కోసం పోరాడాలి.

(అయిపోయింది)



# జె.ఎన్.యు.కి మద్దతుగా

యూట్యూబ్‌లోని వీడియోకు అక్షర రూపం : **బి. అనూరాధ**

**ఆజాదీ', ఆజాదీ అన్న నినాదాలు, తదనంతరం జె.ఎన్.యు.లో భక్తులకూ, విద్యార్థులకూ నెలకొన్న యుద్ధ వాతావరణం పాలకులనే కాదు, హిట్లర్‌ను కూడా ప్రభావితం చేసింది. చివరికి విసుగు చెంది ఆ విషయంపై తన నిర్ణయాన్ని మార్చుకొనేలా చేసింది!** (కావాలంటే మీరు చూడండి. సోషల్ మీడియాలో విపరీతంగా షేర్ అవుతున్న ఆ వీడియో విశేషాలు తెలుగు పాఠకుల కోసం. వాళ్ళు జర్మనీలో మాట్లాడుకుంటూ ఉంటారు. మన కోసం ఇంగ్లిషు సబ్ టైటిల్స్ వేశారు)

(దృశ్యం : హిట్లర్ జర్మనీలో హెడ్ క్వార్టర్స్‌లోని తన కార్యాలయంలో ముఖ్య సలహాదారులు, అనుచరగణంతో పరివేష్ఠితుడై, చింతాక్రాంతుడై తన ముఖ్య సలహాదారు చెప్తున్న విషయాన్ని గంభీరంగా వింటూ ఉంటాడు. వాళ్ళందరి ముఖాల్లోని భావాలూ చాలా గంభీరమైన విషయం గురించి చర్చిస్తున్నట్టుగా ఒకింత ఆందోళకరంగా ఉంటాయి. టేబుల్ మీద ఒక మ్యాపు పరిచి ఉంటుంది. దానిలో ఉన్న వాటిని హిట్లర్‌కి చూపుతూ ముఖ్య సలహాదారుడు పొజిషన్లు వివరిస్తూ ఉంటాడు).

1వ సలహాదారుడు : ప్రతి.దేశ ద్రోహికీ జె.ఎన్.యు. ఇప్పుడొక (పెట్టని) కోట. జీవితం పట్ల అసంతృప్తి ఉన్న వాళ్ళంతా ఆరావళి పర్వతాల్లో ఎర్రరంగు రాయితో. చెక్కిన ఈ సంస్థలోనే వృద్ధి చెందుతూ ఉంటారు. మన మిత్ర పక్షాల కూటమికి చెందిన భారతీయ వానరసేన వారిని చుట్టుముట్టింది. వాళ్ళ కరసేవకులు దుమారంలాగా ఆక్రమించడానికి ఉత్తర ద్వారం వద్ద ఎదురు చూస్తున్నారు.

హిట్లర్ : వాళ్ళని చుట్టుముట్టి పొగబెట్టినట్టు తరిమి కొట్టండి. ఇండియాని హిందూ రాష్ట్రంగా ప్రకటించండి.

*(దృశ్యం : అందరూ మౌనంగా ఒకరి మొఖాలు ఒకరు చూసుకుంటారు. అప్పుడు మెల్లగా సలహాదారుడు కొంచెం ధైర్యం చేసి..)*

1వ స : అదంత తేలిక కాదు ఫ్యూడర్ ! (హిట్లర్‌ని ఫ్యూడర్ అని సంబోధించేవారు)

2వ స : వాస్తవ పరిస్థితులను పరిశీలిస్తే, యుద్ధ స్థానాల్లో మన మిత్రపక్షాల పరిస్థితి, చాలా అవమానకరమైన ఓటమికి గురయ్యేటట్టుగా ఉంది ఫ్యూడర్!

*(దృశ్యం: నిర్ఘాంతపోయిన హిట్లర్ ఆపలేని కోపం వల్ల వణుకుతున్న చేతుల్తో తన కళ్ళద్దాలు మెల్లగా తీసి పట్టుకొని..)*

హిట్లర్ : ఆ.. ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., ఏ.బి.వి.పి.లకి శిక్షణ ఇచ్చిన వాళ్ళంతా ముందు ఈ గదిలోంచి బయటికి. పొండి!! *(గంభీరంగా ఆదేశిస్తాడు. ముగ్గురు తప్ప అక్కడున్న అనేక మంది గది బయటికి వెళ్ళి నిలుచుంటారు. అందులో స్త్రీ పురుషులిరువురూ ఉంటారు).*

హిట్లర్ : మనమిచ్చిన కఠోర శిక్షణ తరువాత కూడా వాళ్ళు విఫలం అయ్యారు. నేను.. స్వయంగా హెగ్డేవార్‌కూ, సావార్కర్‌కూ శిక్షణ ఇచ్చాను. అయినా విఫలమయ్యారు. నా ఓటమికి ప్రతీకారం తీర్చుకుంటానన్నారే! దేవుడా! "వీళ్ళు నిజంగా పనికిరాని చెత్త! ఇదంతా చాలా అవమానకరంగా ఉంది.

*(దృశ్యం : ఇంక కోపం ఆపుకోలేక అసహనంగా తిరుగాడుతూ గర్జించినట్టే మాట్లాడతాడు)*

హిట్లర్ : ముందీ విషయం చెప్పండి! వాళ్ళని సైద్ధాంతికంగా సమర్థించమని నాకూ, ముస్సోలినీకి పదే పదే సలహా ఇచ్చిందెవరు? ఎవరా చెప్పింది! వాళ్ళంత చదువూ గిదువూ లేని, గూండాగాళ్ళని కానీ, 'భారత్ మాతాకీ జై' అని అరవడం, వేరే వాళ్ళ ఆహారపు టలవాట్లలో తలదూర్చడం తప్ప ఇంకేం తెలీదని నాతో ఎవ్వరూ ఎందుకు చెప్పలేదు?

1. స. : ఫ్యూడర్..! కనీసం వాళ్ళ చదువు సంధ్యల గురించైనా వాకబు యిస్తే మంచిదని మేము ఖచ్చితంగా చెప్పాం!

హిట్లర్ : చదువా? వాళ్ళు వేదాలలోనూ, మనుస్మృతిలోనూ విశ్వాసముందని చెప్పారే?

1. స. : ఫ్యూడర్..! వేదాలు, మనుస్మృతి సంస్కృతంలో ఉన్నాయి.

హిట్లర్ : సంస్కృతమా? జె.ఎన్.యు. కరపత్రాల ద్వారా వాళ్ళు అదానీ భాష మాట్లాడుతారనే విషయం నేను గమనించలేక పోయాను. అయిపోయింది! అంతా అయిపోయింది!!

ఆ అమాయక దళిత 'బిడ్డ' మీద నుంచి దృష్టి మరల్చమని వాళ్ళకి నేను సలహా ఇవ్వకుండా ఉండాల్సింది. బాబ్రీ ఘటన, సరళీకరణల తర్వాత ఇక ఇండియా అందుబాటులోకొచ్చేసినట్టేనని ఆశతో ఉన్నాను నేను. ఈ చెత్త తలకాయలు మూర్ఖత్వం వల్ల నా కలలన్నీ కల్లలయ్యాయి.

ఆ జె.ఎన్.యు.తో తలపడొద్దని చెప్పాన్నేను. వాళ్ళు 'నీ మన్‌కీ బాత్ ని' ఛిద్రం చేసి పారేస్తారు. వాళ్ళసలు ఇందిరా గాంధీనే అడుగు పెట్టనివ్వలేదు. ఇంక స్వచ్ఛ భారత్ అక్కడేం పనిచేస్తుంది?

నేను చెప్పేదొక్కటే! వేదాల్లోకి తిరిగి పొమ్మని. ఆ సంఘాలకు పోయి చెప్పండి.

చూశారా? ప్రతిపక్షం మొత్తం ఎర్రగా ఐక్యం అవుతోంది. ఇదంతా.. ఆ.. స్టాలిన్ కుట్ర!!

*(గొంతు చించుకొని అరుస్తాడు)*

పాసిస్టుగా ఉండి, ఏం ప్రయోజనం?

ఏం అడిగారనీ ప్రజలు? కాస్త గౌరవప్రదమైన జీవితం, దేశ పౌరులం అని గర్వంగా చెప్పుకోగలిగేలాంటి దేశం!

మేక్ ఇన్ ఇండియా!! నాకు తెలీక అడుగుతానూ మీ సిద్ధాంతమే దిగుమతి చేసుకొన్నది! ఇంక అదెలా సాధ్యమా అని!

క్యాంపస్‌లో పెద్ద పెద్ద జెండాలెగురెస్తే ఏం జరుగుతుంది? వాళ్ళే దేశాన్ని బురదగా మార్చేస్తారని హింగ్లర్‌నాకు సలహా ఇచ్చాడు.

అయ్యో! కమలం బురదలోంచి పుడ్తుందని నాకు తెలీదే!

*(దృశ్యం : ఈ అరుపులకు గది బయట నిలబడ్డ వాళ్ళలో ఉన్న అమ్మాయిలలో ఒకామె ఏడవడం మొదలు పెడుతుంది)*

ఈ నాయకులంతా పోయి అక్కడ చెత్తకుండీల్లో కండోమ్‌ల కోసం గాలిస్తున్నారంటే ఆపనన్నా ఆపలేకపోతున్నానే!

*(దృశ్యం : ఏడుస్తున్న అమ్మాయిని మరొక అమ్మాయి ఓదారుస్తూ, "ఊరుకో.. ఈ విషయంలో వాళ్ళకి శిక్షణ ఇచ్చింది మన ఫ్యూడల్ కాదులే అంటుంది)*

హిట్లర్ : మళ్ళీ నన్ను ఇందులోకి లాగారు వీళ్ళు. ఇప్పుడిక నేను వదిలి పెట్టలేను. పైగా నా పేరుతో ముడిపెట్టాక ఇంక వదిలిపెట్టడమూ కష్టం!

ఏదైనా వేరే మార్గం ఆలోచించాలి! పాట్రిక్!! వెంటనే వాళ్ళ మీద దేశద్రోహం కేసులు ఎత్తేయమని చెప్పు. రాజకీయాలలోకి వచ్చే ముందు, ఈ యేడాది వాళ్ళందరినీ జె.ఎన్.యు.లో చేరి జాతీయవాదం మీద క్లాసులకి హాజరు కమ్మని చెప్తాను. దాంతో పాటు కొంచెం ఇంగ్లీషు కూడా నేర్చుకోమనాలి.

పోండి! వెంటనే ముందు నీరో ఎక్కడో ఉన్నాడో చూడండి!!

(ఈ వీడియోని చూడాలంటే యూట్యూబ్‌లో - హిట్లర్, రియాక్ట్స్ టు జె.ఎన్.యు.రో' అని వెతకాలి - బి. అనూరాధ)



*(51వ పేజీ తరువాత.. )*

ముఠాలు మానవ హక్కుల కార్యకర్తలను లక్ష్యం చేసుకొని నినాదాలు కూడా మొదలుపెట్టారు. "భారతమాతా కి జై", "దేశ వ్యతిరేకులు ఇండియా వదిలి వెళ్ళాలి" అంటున్నారు.

యువ న్యాయవాదులు వాళ్ళ ఉద్యోగాలు వదిలిపెట్టి పెద్ద ఎత్తున వచ్చే ఆదాయాన్ని పట్టించుకోకుండా ఒక గ్రూపుగా ఏర్పడి, ఆదివాసీ ఖైదీలకు న్యాయ సహాయం అందించేందుకు అటవీ ప్రాంతానికి వచ్చారు. వారిని హింసించి వారికి ఇల్లు ఇచ్చిన యజమానులను భయపెట్టి ఖాళీ చేయించారు. వారి పనిలో సుదీర్ఘ కాలంగా జోక్యం చేసుకొని స్థానిక బార్ అసోసియేషన్‌పై నిషేధం విధించింది. సాయుధ ముఠాలు వాళ్ళను లక్ష్యం చేసుకొని విజయవంతంగా వాళ్ళనా ప్రాంతం నుండి గెంటేసారు. ఆదివాసీలకు మద్దతు ఇచ్చిన షాలిని గెరా, ఇషా ఖండేల్‌వాల్ ఇంకా ఇతరులు నిస్సహాయంగా బిలాస్‌పూర్‌లో ఉండిపోయారు.

స్క్రోల్ ఇన్ వెబ్‌సైట్ కోసం పనిచేస్తున్న మాలినీ సుబ్రహ్మణ్యం నివాసంపై దాడి జరిగింది. ఆదివాసీ ప్రాంతాల్లో ఘర్షణలు నిర్వాసితులవుతున్న విషయాలపై ఆమె దృష్టి కేంద్రీకరించారు. ఆమె సహాయకురాలిని పోలీసులు బెదిరించి మాలిని నక్సలైటు అని నిరూపించే ప్రయత్నం చేసారు. ఆమె ఇంటి యజమానిపై ఒత్తిడి పెంచి ఇంటి నుంచి ఖాళీ చేయించారు. ఫిబ్రవరి 19వ తేదీన ఆమె ఇల్లు వదిలి వెళ్ళాల్సివచ్చింది. బేలా భాటియా అనే స్వతంత్ర పరిశోధకురాలు ఆదివాసీ ప్రాంతాల్లో మానవ హక్కుల ఉల్లంఘన గురించి డాక్యుమెంటరీ తీస్తుంటే ప్రభుత్వ సాయుధ ముఠాలు ఆమెను అక్కడి నుండి బెదిరించి పంపేసారు. ఇలా ఈ చిట్టాలో వారు చివరివాళ్ళు మాత్రం కారు. జర్నలిస్టులను, హక్కుల కార్యకర్తలను నిర్బంధించటం, వెళ్ళగొట్టటం చాలా కాలం క్రితమే ప్రారంభమైంది.

ఇటీవలే బస్తర్‌లోని కోడోనార్‌లో సోనిసోరి అనే ఆదివాసీ నాయకురాలిపై దాడి జరిగింది. ముగ్గురు వ్యక్తులు చుట్టుముట్టి ఆమెపై యాసిడ్ పోసారు. దాంతో ముఖంపై కాలిన గాయాలతో ఢిల్లీ లోని ఒక ఆసుపత్రిలో చికిత్స పొందుతోంది. ఇప్పటికీ ఆ గాయాలతో ఆమె విలవిల్లాడుతోంది.

ఈ సంఘటనకు కొన్ని గంటల క్రితమే ప్రధానమంత్రి ఛత్తీస్‌ఘడ్‌లో పర్యటించాడు. అక్కడి సభల్లో ఎన్. జి. ఓ. లు తమ ప్రభుత్వాన్ని అపఖ్యాతిపాలు చేసే ప్రయత్నం చేస్తున్నాయని ప్రకటన ఇచ్చాడు. బస్తర్ జిల్లా కలెక్టర్ మాట్లాడుతూ 'బస్తర్ నుంచి వచ్చే కథనాలు కేవలం కొంతమంది ప్రభుత్వ వ్యతిరేకుల ప్రచారం మాత్రమే' అన్నాడు. రేపు లేదా ఆ మరుసటి రోజు ఏదైనా ఫొటోలు, వీడియోలు బయటికొచ్చి అక్కడ జరుగుతున్న దుర్మార్గాలు బయటపడితే అవిక్కడ అబద్ధపు ప్రచారాలవుతాయి. మధ్య భారతదేశంలోని అటవీ ప్రాంతాల్లో వ్యవహారాలు చాలా అరుదుగా ప్రధాన వార్తా పత్రికల్లో పతాక శీర్షికలవుతూంటాయి. వార్తా ఛానళ్లు కూడా అంత ప్రాధాన్యత ఇవ్వవు. కనుక వీళ్ళు పెద్దగా ఆందోళన పడాల్సిన అవసరం లేదు.

బస్తర్‌లో భద్రతా దళాలకు అపరిమితమైన స్వేచ్ఛ ఉంది. ఆ స్వేచ్ఛతో ఏమైనా చేయగలరు. సాధారణ పౌరులు, యోధులు సంకెళ్ళలో మగ్గిపోతున్నారు. అవి తొలగించాలి. సాక్షులు లేకుండా చేయబోయే యుద్ధానికి రంగస్థలం సిద్ధమైంది. మరో మారణహోమం ప్రారంభం కాగలదు.



**అరుణతార చందాదారులకు విజ్ఞప్తి!**

ఏ కారణం చేతనైనా మీకు అరుణతార అందకపోతే పిన్‌కోడ్‌తో సహా మీ చిరునామాను మరోసారి **8500809250** మొబైల్ నంబర్‌కు మెసేజ్ పెట్టగలరు. గమనిక : ఈ నెంబర్ కేవలం మెసేజ్‌ల కొరకు మాత్రమే! - సం.

# మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం

ఫ్రాన్సిస్ వీన్

అనువాదం: ముక్తవరం పార్థసారథి

(7)

(గత సంచిక తరువాయి.. )

'అయితే, ఇక్కడే మరో సమస్య వచ్చిపడింది. దీన్ని పరిష్కరించటానికి సిద్ధంగా ఉన్నాడు మార్క్స్. కార్మికులు తాము సృష్టించిన సరుకులకూ తనకూ సంబంధం లేదని ఎందుకనుకుంటున్నారు? ఎందుకో అవి తమ జీవితాలకు యమపాశాలుగా మారుతున్నాయనుకుంటున్నారు? ఒక సరుకులోని విలువను సృష్టించేది కార్మికుడే అయినప్పుడు ఎందుకా విలువ పూర్తిగా తనకు చెందకుండా పోతున్నది? అభివృద్ధి చెందని ఆర్థిక వ్యవస్థలో ఇలా జరగదు అంటున్నాడు మార్క్స్" భూమీ, సంపదా అతని నుండి లాక్కోబడకుండా ఉంటే, కార్మికుడు సృష్టించినదంతా అతనికే చెందుతుంది. తొలి రోజుల్లో ఇలాగే ఉండేది." అని రాశాడు ఆదంస్మిత్ The Wealth of Nations లాగా ఆ దశలో అతనికి యజమాని ఎవరూ లేడు. తను సృష్టించిన సంపదను పంచుకోవటానికి మరో మనిషీ లేడు. ఒక వడ్రంగి, తను తయారు చేసిన టేబుల్‌ను అమ్మి గోధుమలు కొనుగోలు చేస్తే దాన్ని C-M-C గా అర్థం చేసుకుంటాం. (C-Commodity-M-Money) వస్తువు డబ్బుగా మారి తిరిగి వస్తువుగా మారింది. కాని పెట్టుబడిదారీ వ్యవస్థలో సరుకుల చలామణీ మరో రకంగా ఉంటుంది. దాన్ని మన్ను M-C-M గా అర్థం చేసుకోవచ్చు. సరుకులను కొనుగోలు కోసమే డబ్బు ఉపయోగిస్తాడు పెట్టుబడిదారు. కార్మికుని శ్రమశక్తి, ముడి పదార్థాలు, యంత్రాలు, అన్నీ కలిసి సృష్టించిన సరుకును మరింత డబ్బు సంపాదించే ఉద్దేశంతో అమ్మేస్తాడు.

ఈ చలామణీని మనం రెండు విధాలుగా విభజించవచ్చు. C-M (అమ్మకం), M. C. (కొనుగోలు). అయితే ఈ లావాదేవీలు జరిగిన పద్ధతిలో తేడా ఉంది. మొదటి పద్ధతిలో సరుకుల అమ్మకం సరుకుల కొనుగోలు కోసమే జరిగింది. రెండవ పద్ధతిలో డబ్బు పెంచుకోవడం కోసమే సరుకును ఉపయోగించారు.

"C-M-C చలామణీలో డబ్బు చివరికి సరుకుగా మారుతుంది - 'సరుకు' అంటే ఉపయోగపడే వస్తువు. ఈ క్రమంలో డబ్బు ఖర్చయిపోయింది. కాని M-C-M లో సరుకులను చవకగా కొని అధిక ధరకు అమ్మడం కోసమే డబ్బును వినియోగిస్తున్నారు. అంటే ఈ లావాదేవీలో డబ్బు ఖర్చయిపోలేదు సరికదా తిరిగి, పెరిగి అతడి వద్దకే చేరింది.

ఖర్చుపెట్టిన డబ్బు మాత్రమే తిరిగి వస్తే దీని గురించి ఇంత మాట్లాడుకోవలసిన అవసరమే లేదు. కాని, అంతకన్నా ఎక్కువ డబ్బులు తిరిగి వస్తున్నవి, దీన్నే అదనపు విలువ అన్నాడు మార్క్స్. మొదటి M కన్న రెండవ M ఎక్కువగా ఉంటుంది. పెట్టుబడి అంటే ఇదే. కొత్త సరుకుల కోసం తన దగ్గర ఉన్న సరుకులమ్మటం అత్యంత సాధారణ చలామణీ. దీనివల్ల అతడి అవసరాలు తీరుతున్నాయి. కాని పెట్టుబడిగా పెట్టే డబ్బులో, అది పెరగటమే లక్ష్యం. ఇందులో కొనుగోలుదారు అవసరాలు తీరే ప్రసక్తే లేదు.

డబ్బు పెట్టుబడిగా మారటానికి మూలం అదనపు విలువ మాత్రమే. అయితే ఈ అదనపు విలువ ఎక్కణ్ణించి వచ్చింది? ఎవరు సృష్టించారు దీన్ని? ఈ మిస్టరీని ఒక ఔత్సాహిక డబ్బు మూటలగాడి (Money bags) దృష్టికోణం నుండి అధ్యయనం చేశారు మార్క్స్. M-C లోనూ, C-M లోనూ సమానమైన విలువల మార్పిడియే జరుగుతున్నది. సరుకులను వాటిని అసలు ధరకే కొనుగోలు చేస్తే మనీబాగ్స్ గాడికి లాభం వచ్చే అవకాశమే లేదు. నిజానికి ధర కాస్త పెంచి అమ్మినా ఇదే సూత్రం వర్తిస్తుందంటాడు మార్క్స్.

"ఉదాహరణకు, ఒక అమ్మకం దారు 100 విలువల సరుకును 110కి అమ్మాడనుకోండి. అతడికి పది లాభం వచ్చినట్టే. అది అదనపు విలువ. కాని అమ్మకం పూర్తి చేసిన వెంటనే అతడు కొనుగోలుదారుగా మారుతాడు. మరో అమ్మకం దారు వచ్చి, ఇతడికి తన సరుకులమ్మి తనూ లాభం పొందుతాడు. అంటే మన మనీబాగ్స్ మొదట వచ్చిన లాభం, తరువాత కొనుగోలులో పోగొట్టుకున్నాడు. అమ్మకందార్లందరూ తమ సరుకుల్ని పదిశాతం ఎక్కువకే అమ్ముకుంటే ఎవరూ లాభపడరూ, నష్టపోరు. పది శాతం పెంచినా, పెంచకపోయినా తేడా లేదు."

అయితే, అన్ని సందర్భాలూ ఇలాగే ఉండవు. కొన్నిసార్లు నయవంచనతో లేదా మాయమాటలు చెప్పి ఎక్కువ ధరకు అమ్మి, తక్కువ ధరకు కొనీ ఎవరు ఎవర్నైనా మోసం చేయవచ్చు. కాని వాణిజ్య వ్యవస్థ గురించి మాట్లాడుకుంటున్నప్పుడు మనం ఈ లావాదేవీల అంతస్సూత్రం గురించి తెలుసుకోవాలి. అదనపు విలువ అంటే ఏమిటో అర్థం చేసుకుంటే తప్ప మన చర్చ ముందుక్కదలదు. శ్రమశక్తి మాత్రమే అధనపు విలువను సృష్టిస్తున్నది. ఈ శ్రమశక్తి తరతరాలుగా బంగారు గుడ్లు పెడుతున్న బాతు."

మార్క్స్ ప్రకారం శ్రమశక్తి కూడా ఒక సరుకే. అయితే ఇతర సరుకుల్లాగే దీని విలువా నిర్ణయించబడుతుంది - శ్రమశక్తిని ఉత్పత్తి చెయ్యటానికి అవసరమైన శ్రమ సమయం మీద ఇది ఆధారపడి ఉంటుంది. (కార్మికులు కొన్న డిమాండ్‌ను బట్టే ఉంటుంది సరుకుల డిమాండ్ అన్నాడు ఆడాం స్మిత్)

రక్తమాంసాలున్న మనుషుల్ని సరుకులతో పోల్చడం కొంతమందికి నచ్చకపోవచ్చు. కాని మార్క్స్ సరిగ్గా ఆ విషయం గురించే ప్రస్తావిస్తున్నారు. మనీబాగ్స్ దృష్టిలో కార్మికులు, సరుకుల కన్న ఏ విధంగానూ ఎక్కువ కాదు. మరి మన మనీబాగ్స్, కార్మికులు అనబడే ఈ సరుకులను ఏ విధంగా విలువ గడతాడు?

"శ్రమశక్తికి యజమాని అయిన కార్మికుడు, ఈ రోజు చేసినట్టే రేపూ పని చెయ్యగలగాలి. అతడి ఆరోగ్యం, పనిచెయ్యగలిగిన సత్తువ అలాగే కొనసాగాలి. అంటే, శారీర దారుఢ్యానికి అవసరమైన ప్రతిఫలం అతడికి ముట్టాలి. దేశ కాలాలను బట్టి అతడు ఆహారం, దుస్తులు, అవసరాలు, గృహ వసతి మారుతుంటాయి. కాని ఈ అవసరాలు కూడా చారిత్రక పరిస్థితులను బట్టే నిర్ణయించ బడతాయి. అంటే శ్రమశక్తికి చారిత్రక, నైతిక కోణం కూడా ఉంది. ఒక దేశంలో, ఒక ప్రాంతంలో, ఒక కాలంలో సగటు కూలీ ఎంత అన్నదాన్ని బట్టే మిగతా అన్ని సరుకుల విలువల్నీ అర్థం చేసుకుంటాం.

కార్మికుడి జీవితం శాశ్వతం కాదు. అందువల్ల, అతడి స్థానాన్ని పూరించే తరువాతి మనుషులను అంటే అతడి సంతానాన్ని కూడా దృష్టిలో పెట్టుకొని కూలీని నిర్ణయించాలి. మార్కెట్లలో కార్మికుల సరఫరా నిరంతరాయంగా కొనసాగాలంటే ఈ జాగ్రత్తలు తీసుకోక తప్పదు. బహుశా, అతిస్వల్ప పరిమాణంలో, వాళ్ళ విద్యకు, శిక్షణకు కూడా ఇందులో వెసులుబాటు ఉండొచ్చు.

మార్క్స్ అధ్యయనం ప్రకారం, కార్మికుడు పొందే కూలీ అతడి ఆరు గంటల శ్రమకు ప్రతిఫలం కావచ్చు. కాని మనీబాగ్స్, కార్మికుణ్ణి ఆరు గంటల తర్వాత వదిలేస్తాడా? (అతడు తన పోషణ కోసం పనిచేయ్యాల్సింది ఆరు గంటలు మాత్రమే) సందేహమెందుకు? ఎట్టి పరిస్థితుల్లోనూ వదలడు. కానీ ఆ (ఆరుగంటల) కూలీ సంపాదించటానికి అతడే అందులో అయిదారు గంటలు పనిచేయక తప్పదు. కార్మికుడు అదనంగా పని చేస్తున్న ఈ అయిదారు గంటల 'అదనపు శ్రమ' ఫలితమే పెట్టుబడిదారు (మనీబాగ్స్) ఆర్జించే లాభం. "కార్మికుడికి ప్రతిఫలం చెల్లించకుండా ఉపయోగించుకున్న శ్రమ వల్లనే అదనపు విలువ ఉత్పత్తి అవుతున్నది" అంటాడు మార్క్స్. "ఒక దురాక్రమణదారు, ప్రజల్ని దోచుకుని, ఆ డబ్బుతోనే వాళ్ల సరుకులు కొనుగోలు చేసినట్టుగా" కాకపోతే, ఆ రోజుల్లో దోపిడీ బహిరంగంగా జరిగేది. ఇప్పుడు కార్మికులను మభ్యపెట్టి కొనసాగుతున్నది.

ఈ విషయం పసిగట్టిన పెట్టుబడిదారు (మనీబాగ్స్) సహజంగానే బంగారుబాతు మరిన్ని గుడ్లు పెట్టాలని కోరుకుంటాడు. దీనికి అనుసరించవలసిన పద్ధతి ఒక్కటే. కార్మికులతో మరిన్ని గంటలు అదనంగా పని చేయించడం. కేవలం గణాంకాలకు పరిమితమైనట్టుగా కనిపించే ఈ అదనపు శ్రమ సూత్రం వెనుక ఉన్న మానవ విషాదాన్ని దాస్ కాపిటల్ 10వ అధ్యాయంలో The Working Day లో అత్యద్భుతంగా, హృదయ విదారకంగా వివరించాడు మార్క్స్.

1850 నాటి ఫాక్టరీల చట్టం వారంలో చెయ్యాల్సిన పనిగంటల్ని అరవైకి కుదించింది. (అంటే ఆరు గంటలు మాత్రమే నిజమైన శ్రమ. బ్రేక్‌ఫాస్ట్‌కు అర గంట, లంచ్‌కు గంట అదనంగా ఉంటాయి. దీని అర్థం సోమవారం నుండి శుక్రవారం దాకా మొత్తం పన్నెండు గంటల షిఫ్టులు, శనివారం ఎనిమిది గంటల పని) ఈ చట్టం. ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్లు అనబడే చిన్నపాటి సైన్యాన్ని కూడా సృష్టించింది. రెండేళ్లకోసారి వీళ్లిచ్చే రిపోర్టునే పదవ అధ్యాయానికి ముడిసరుకుగా, ముఖ్య సమాచారంగా ఉపయోగించుకున్నాడు మార్క్స్. "అదనపు శ్రమ కోసం పెట్టుబడిదారు ఆకలి బకాసురునికి మించింది" అంటాడు. కార్మికునికి చెందవలసిన భోజన విరామ సమయాన్నీ, ఇతర విశ్రాంతినీ కొద్దికొద్దిగా తగ్గించి తన లాభాలు పెంచుకున్నాడు పెట్టుబడిదారు. ప్రతిరోజు భోజన విరామ సమయాన్ని పది నిమిషాలు తగ్గించటం ద్వారా, ఏడాదికి వెయ్యి పౌండ్లు లాభం వచ్చిందని ఒక ఫ్యాక్టరీ యజమాని వికటాట్టహాసం చేశాడట. "తొమ్మి పదేళ్ళ పిల్లల్ని, అర్ధరాత్రి రెండు, మూడు, నాలుగు గంటలకు నిద్రలేపి తెల్లవారి పది, పదకొండు, పన్నెండు దాక పని చేయిస్తారు. ఆ పరిస్థితిలో వాళ్ల జీవచ్ఛావాల కన్న ఎక్కువేమీ కాదు" అని నాటింగామ్‌లోని లేసు పరిశ్రమ గురించి రిపోర్టు చేసింది డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక.

ఇది చదువుతుంటే, 1845లో ఫ్రీడ్రిష్ ఎంగెల్స్ రాసిన Conditions of The Working days in England గుర్తుకొస్తుంది. తన పరిశీలన, పత్రికా కథనాలు, పార్లమెంటరీ కమిషన్లు, పార్లమెంటు చర్చలు ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ల రిపోర్టుల ఆధారంగా రాసిన పుస్తకమది. "నా ప్రత్యర్థుల వాంగ్మూలాల్ని నేను సంతోషంగా అంగీకరిస్తాను" అంటాడు ఎంగెల్స్. బ్రిటిష్ అధిక వర్గాలు, తమకు వ్యతిరేకంగా ఇంత సమాచారం ప్రచురించుకున్నాయి. గవర్నమెంటు బ్లూబుల్స్ (ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ల రిపోర్టులు) ఎకానమిస్ట్ పత్రికలో వచ్చిన వ్యాసాలను దాస్ కాపిటల్‌లో విరివిగా ఉపయోగించుకున్నాడు మార్క్స్.

దాస్ కాపిటల్‌లో అన్నిటికన్నా పెద్ద అధ్యాయం "వర్కింగ్ డే". ఇది ఒక హారర్ కథల సమాహారం. ఇందులో మార్క్స్ కథనం కూడా తదనుగుణంగానే ఉంటుంది. "పెట్టుబడి అంటే మృతశ్రమ. ఇది వాంపైర్ (డ్రాక్యులా) లాగ బతికున్న శ్రామికుల రక్తం పీల్చి బలుస్తున్నవి. ఈ రక్త పిపాసి బతికుండాలంటే కార్మికులను (నెత్తురు పీల్చి) పిప్పిచేయక తప్పదు" అంటాడు మార్క్స్. అలా రక్తసిక్తమైన డెబ్బై పేజీల వర్ణన తర్వాత, "ఈ వాంపైర్ వాళ్లను వదలదు గాక వదలదు" అని హెచ్చరిస్తాడు. "ఈ నెత్తురు తాగి బలుస్తున్న ఈ రాక్షసి నుండి రక్షించుకోవటానికి ఒకే ఒక మార్గముంది. కార్మికులు సమైక్యమై ఒక వర్గంగా ఏర్పడాలి. తమను తాము ఈ బకాసురునికి ఆహారం కాకుండా ప్రభుత్వాలు ఒక చట్టం చేసే దిశగా ఉద్యమించాలి. తాము తమ కుటుంబమంతా బానిసత్వంలోకి నెట్టబడి, అకాల మృత్యువు వాత బడకుండా ఉండాలంటే ఇలా చెయ్యక తప్పదు". కాని చట్టం చేసినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదని మార్క్సిస్టు తెలుసు. ఉత్పత్తినీ, అదనపు విలువనూ పెంచుకోవటానికి పెట్టుబడిదార్లకు సవాలక్ష ఇతర మార్గాలన్నాయి. శ్రమశక్తి అంత విలువైనదైనప్పుడు, యజమానులు కార్మికుల జీతాలు పెంచరెందుకు? డిమాండ్స్ పెరిగినప్పుడు పెంచితే పెంచుతారు కూడా. కాని కార్మికుల జీతాలు పెంచవలసి వచ్చినప్పుడల్లా, యాంత్రీకరణ వైపు మొగ్గు చూపుతారు. యజమానులు కార్మికులు చవకగా దొరికినప్పుడు యంత్రాల మీద తగలెయ్యటం ఎందుకు అనుకున్న వాళ్లకు, ఇప్పుడు అదే లాభసాటి పెట్టుబడిగా కనిపిస్తుంది. ముఖ్యంగా, ఏమి చేసీ, పని గంటల్నిక పెంచలేమనుకున్నప్పుడు ఉత్పత్తి పెరగాలంటే యంత్రాలు తప్ప మార్గాంతరం లేదనుకుంటారు.

"సరుకుల ధరలు తగ్గించాలంటే ఉత్పత్తి పెంచక తప్పదు. పెట్టుబడిదారుకు అది కార్మికుల వల్ల జరుగుతుందా, యంత్రాల వల్ల జరుగుతుందా అన్నది ముఖ్యం కాదు? అది పెట్టుబడి యొక్క సహజ సిద్ధ లక్షణం. కాని సరుకుల ధరలు తగ్గటం ద్వారా కార్మికుడి విలువ కూడా తగ్గుతుంది" అంటాడు మార్క్స్.

సైద్ధాంతికంగా యంత్రాలవల్ల కార్మికుల పని సులువవుతుంది. శ్రమ తగ్గుతుంది. కాని పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థలో యంత్రీకరణ ప్రభావం అనివార్యంగా కార్మికుల పొట్టకొట్టేదిగానే ఉంటుంది. పెట్టుబడిదారుడు మాత్రమే దీనివల్ల లాభపడతాడు. ("పెట్టుబడిలోని ఇండస్ట్రియల్ మెషినరీ గురించిన అధ్యాయం జాన్ స్టువార్ట్ మిల్ రాసిన ప్రిన్సిపల్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీలోని" ఇప్పటి వరకు యంత్రీకరణలో జరిగిన ఆవిష్కరణలన్నీ కార్మికుని శ్రమను కించిత్తయినా తగ్గించారా అన్నది సందేహాస్పదమే అన్న వాక్యంతో ప్రారంభమవుతుంది. )

మానవ శ్రమ కన్న ఎన్నో రెట్లు ఎక్కువ ఉత్పత్తి శక్తి కలిగిన యంత్రం, కార్మికుణ్ణి పెట్టుబడి మీద మరింతగా ఆధారపడేట్టు చేస్తుంది. యంత్ర సామర్థ్యంతో పోల్చితే అతడి సామర్థ్యం చాలా తక్కువ. అందువల్ల, కార్మికులంతా ఏకమై ప్రతిఘటిద్దామనుకున్నా, యంత్రాలకున్న అపారమైన శక్తిసామర్థ్యాల ముందు వీళ్ళు నిస్సహాయులే. దాస్ కాపిటల్‌లో అనేక సార్లు అభివర్ణించినట్టుగా, ఇది హారర్ స్టోరీ కన్న తక్కువేమీ కాదు. తొలిదశ యంత్రాలు కార్మికుల కన్న కొద్ది రెట్లు ఎక్కువ ఉత్పత్తి మాత్రమే చేశాయి. కాని అనేక వందల వేల రెట్లు పెరిగిన ఆధునిక యంత్రాల ముందు కార్మికుడు పిపీలికంగా మారిపోతున్నాడు - యంత్రం అంటే సహస్ర బాహువుల బ్రహ్మారాక్షసి. శారీరక శ్రమ ఎక్కువగా అవసరం లేని యంత్రాల వద్ద పనిచేయటానికి పసిపిల్లలు (తమ లేత చేతులతో) మరింత అనువుగా ఉంటారు. కార్మికునికీ, పెట్టుబడిదారుకు మధ్య ఉన్న సంబంధాన్ని పూర్తిగా మార్చి వేసిన విప్లవీకరించిన అంశమిదే.

"సరకుల మారకం గురించి మాట్లాడకుంటూ మనం, కార్మికుడూ, పెట్టుబడిదారూ స్వచ్ఛందంగా ఒకరితో ఒకరు సంబంధాలేర్పరుచుకుంటారనుకున్నాం. (ఒకరి వద్ద డబ్బూ, ఉత్పత్తి సాధనాలు ఉంటాయి. మరొకరి వద్ద శ్రమశక్తి ఉంటుంది) కాని పెట్టుబడిదారు లోకం తెలియని పసిమొగ్గల్ని చిదిపేస్తున్నాడు."

"బాల కార్మికుల కోసం పత్రికల్లో ప్రచురింపబడిన వ్యాపార ప్రకటనలు, అమెరికన్ పత్రికలలో నీగ్రో బానిసల కోసం వచ్చిన ప్రకటనలను తలపిస్తున్నాయి" అంటాడు మార్క్స్. దీనికి తార్కాణంగా, 2వ బ్రిటిష్ ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ రిపోర్టును ఉదహరిస్తారు.

"వాంటెడ్ 12 నుండి 20 మంది చిన్నపిల్లలు. పదమూడేళ్ల కన్న చిన్నవాళ్లనిపించకూడదు, కూలీ వారానికి 4 షిల్లింగులు".

ఈ "పదమూడేళ్ల కన్నా తక్కువ ఉన్నట్టు కనిపించకూడదు" అనటమెందుకంటే, ఫ్యాక్టరీ చట్టం ప్రకారం, అంతకన్నా తక్కువ వయసున్న పిల్లలు రోజుకు ఆరు గంటలు మాత్రమే పనిచేయాలి. ఈ చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత (1850-60 మధ్య) ఫ్యాక్టరీలలో పదమూడేళ్ల కన్నా తక్కువ వయసున్న పిల్లల సంఖ్య, గణనీయంగా తగ్గింది. దీనికి కారణం, ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్లే స్వయంగా అంగీకరించినట్టుగా పెట్టుబడిదారులు దోచుకోవటానికి అనువుగా, పిల్లల వయస్సును; వాళ్ళు రాయమన్నంత రాసి సర్టిఫై చేశారు డాక్టర్లు. ఆదాయం పెరుగుతుందనే దురాశతో పిల్లల తల్లిదండ్రులు కూడా ఈ అమానుష చర్యల్ని సమర్థించారు.

సాంకేతిక అభివృద్ధి ఎప్పుడూ పెట్టుబడిదారులకు లాభమే తెచ్చిపెడుతుంది. రోజుకు పదహారు గంటల చొప్పున ఏడున్నర సంవత్సరాలు పని చేసిన యంత్రం, రోజుకు ఎనిమిది గంటలచొప్పున పదిహేను సంవత్సరాలు పని చేసిన యంత్రమంత ఉత్పత్తి చేస్తుంది. ఈ పద్ధతిలో అదనపు విలువ పెరగక పోయినప్పటికీ, లాభం రెట్టింపవుతుంది. అందువల్ల యంత్రాలను వీలైనంత ఎక్కువ కాలం పని చేయించటానికే మొగ్గు చూపుతారు పెట్టుబడిదార్లు. అంటే, యంత్రాల వద్ద పని చేసే నిపుణులైన కార్మికుల పని గంటలూ పెరుగుతాయి. కాని, యంత్రీకరణ వల్ల ఉద్యోగాలకు పోటీ పెరుగుతుంది. కార్మికులు ప్రతిఘటించలేరు. "ఈపరిణామాలన్నిటీ ఫలితంగా నిరుద్యోగుల "పారిశ్రామిక రిజర్వ్ సైన్యం" ఏర్పడుతుంది" అంటాడు మార్క్స్. పారిశ్రామిక పెట్టుబడి దారీ విధానం సృష్టించిందే ఈ కార్మికుల అదనపు జనాభా. ఎప్పుడూ దోచుకోబడటానికి సిద్ధంగా ఉంటుంది ఈ మానవ సమూహం. పెట్టుబడి సంచయానికి (Accumulation) కీలకంగా ఉంటారు నిరుద్యోగులు. విపణి విస్తరించినప్పుడు - ఉదాహరణకు రైల్వేలు - ఇతర రంగాలలోని ఉత్పత్తి దెబ్బ తినకుండా, అన్ని రకాల పనులూ చెయ్యటానికి సిద్ధంగా ఉంటారు వీళ్లు. సగటు ఉత్పత్తి, అధిక ఉత్పత్తి, సంక్షోభం, స్తబ్దత (stagnation) అనబడే చక్రభ్రమణంలో చిక్కుకున్న ఆధునిక పారిశ్రామిక విధానాన్ని సజీవంగా ఉంచుతున్నది ఈ రిజర్వ్ సైన్యం. వీళ్లే కూలీ వేతన స్థాయినీ నిర్దేశిస్తారు.

"స్తబ్దత, లేదా సగటు ఆర్థిక వృద్ధి ఉన్న కాలంలో కార్మికులు తమ డిమాండ్లు పెంచకుండా అడ్డుపడుతుంది రిజర్వ్ ఆర్మీ. అలాగే, వృద్ధి రేటు పెరిగినప్పుడు దానికి వాళ్లే కారణమని చెప్పుకోవటానికీ అడ్డు పడుతుంది. మొత్తం మీద అన్ని పరిస్థితుల్లోనూ, కార్మికుల డిమాండ్, సప్లైలను ప్రభావితం చేస్తుంది రిజర్వ్ ఆర్మీ."

మార్క్స్‌కు డిమాండ్, సప్లై ప్రక్రియ అంత సూత్రబద్ధంగా అమలవుతుందనే భ్రమలు ఏమాత్రం లేవు. పెట్టుబడి అవసరం పెరిగిన నిష్పత్తిలో లేబర్‌కున్న డిమాండ్ పెరగదు. ఇవి రెండూ స్వతంత్రంగా మార్కెట్‌ను ప్రభావితం చేసే అంశాలు కావు. ఏది జరిగినా పెట్టుబడిదారులకు అనుకూలంగానే వారి కనుసన్నల్లోనే జరుగుతుంది. "యంత్రాల వల్ల కార్మికులకు స్వేచ్ఛ లభిస్తుంది" అన్న గత ఆర్థిక శాస్త్రజ్ఞులను ఎద్దేవా చేస్తాడు" అవును వాళ్లకు స్వేచ్ఛ లభిస్తుంది - ఉద్యోగాలు పోగొట్టుకోవడం ద్వారా" పెట్టుబడిదార్లకు వాళ్లు ఆటబొమ్మలు. ఒకవేళ ఉద్యోగాలు దొరికినా, తిరిగి ఎప్పుడు 'రిజర్వ్ ఆర్మీ'లో చేరతామోనన్న భయం వెంటాడుతూనే ఉంటుంది. దోపిడీ చేయబడటానికి మరింత అనువుగా మారతారు వాళ్లు, "అంటే కార్మికులు ఉత్పత్తిని పెంచడం ద్వారా రిజర్వ్ ఆర్మీలో చేరే అవకాశాలనూ పెంచుకుంటారు" అంటాడు. సంపద పెరిగిన కొద్దీ దారిద్ర్యమూ పెరుగుతుంది. "పెట్టుబడిదారీ సంచయాన్ని నిర్దేశిస్తున్న ప్రధాన సూత్రమిదే".

(ఇంకా ఉంది)



# బ్రాహ్మణీయ హిందూత్వానికి, 'దేశభక్తి' ఉన్మాదానికి వ్యతిరేకంగా రోహిత్ వేములను స్మరించుకుందాం

సాయంత్రం 5:30 నిముషాలకు, 15-03-16, మంగళవారం, సుందరయ్య విజ్ఞాన కేంద్రం మినీహాల్

రోహిత్ వేముల బలవన్మరణంలో అనేక సంకేతాలు ఉన్నాయి. వాటిని ప్రపంచమంతా విశ్లేషించుకుంటున్నది. అది మనమున్న వాస్తవ స్థితిని సూచిస్తున్నది. ఈ దుర్మార్గమైన వ్యవస్థ ఎలా నడుస్తున్నదో, మనుషులనెలా వెంటాడుతున్నదో పలు కోణాల్లో చర్చించాల్సిన ఆలోచనా సందర్భాన్ని ఒక అద్భుత మానవుడి స్వీయ హననం ముందుకు తీసుకొని వచ్చింది. ఇది ఎంత విషాదకరం, ఎంత దు:ఖకరం.

భారత శిక్షాస్మృతిలో ఉరి శిక్ష ఉండకూడదనే ప్రజాస్వామిక వైఖరి తీసుకున్న రోహిత్ ఇలా ఉరేసుకొని దూరమైపోవడం యాదృచ్ఛికం కాదు. పూర్తిగా సామాజికం. అనేక వైరుధ్యాల ఫలితం. మనుషులను వెంటాడటం, పట్టుకొని చంపివేయడం, ఆత్మహత్య చేసుకోక తప్పని నిస్సహాయ స్థితిని కల్పించడం ఈ అమానవీయ వ్యవస్థ లక్షణం. స్వేచ్ఛ, భావ సంఘర్షణ, ఆత్మగౌరవం, కుల నిర్మూలన, సమానత్వం, దోపిడీ లేకపోవడం మొదలైనవాటికోసం పరితపించేవాళ్లకు ఇది అతి పెద్ద సవాల్. మానవజాతి దీన్ని ఎదుర్కొంటూనే పురోగమిస్తోంది. మార్గమధ్యంలో ఎన్ని బలిదానాలు? ఎన్ని విషాదాలు? రోహిత్‌లా ఎన్ని స్వీయ నిష్క్రమణలు?

రోహిత్ తన మరణవాంగ్మూలం రాశాక, ఉరితాడుపై తుది శ్వాస విడిచే వేళ వీటన్నిటి గురించి ఏం ఆలోచించాడోగాని మనకు దుఃఖభరితమైన, బాధ్యతాయుతమైన పనులు ఎన్నో అప్పగించి వెళ్లాడు. నిన్నటి దాకా మన ఆలోచనా ప్రపంచంలో, ఆచరణ రూపాల్లో పెనవేసుకొని ఉన్న సంక్లిష్టతను సహితం ఒక్క ఊపు ఊపేసి వెళ్లిపోయాడు. అందుకే 'రోహిత్' అనే మాటే ఒక ఆలోచనా సందర్భంగా దేశాన్ని కుదిపేసింది. ఆ మాటకొస్తే కొంత వరకు ప్రపంచాన్ని కూడా.

యూనివర్శిటీల పనితీరు, హిందూత్వం, కులం, రాజ్యం.. మొదలైన వాటిపై గతంలో కూడా చర్చ జరిగినా ఇప్పుడు సరికొత్త కంఠ స్వరంతో మాట్లాడుకుంటున్నాం. ఇది కేవలం హైదరాబాదు విశ్వవిద్యాలయంలోని ఘటనే కాదు, మొత్తంగా మన వ్యవస్థకు సంబంధించింది. హిందూత్వ ఇక్కడ కులాన్ని తీసుకొని వస్తే, ఢిల్లీ జెఎన్‌యూలో జాతీయతను వెంటేసుకొని వచ్చింది. ఇక్కడ రోహిత్ దళిత్ కాదు అనే వాదన ద్వారా నిందితులను కాపాడటానికి కుట్ర పన్నితే, అక్కడి విద్యార్థులు జాతీయత లేని దేశద్రోహులనే వాదన తీసుకొని వచ్చింది. అక్కడా ఇక్కడా ముస్లిం గురించి ఆలోచించడం, ఉరి శిక్షలను వ్యతిరేకించడం సంఘ్ పరివార్‌కు ఆగ్రహం తెప్పించింది. జెఎన్‌యూలో నేరుగా అది కాశ్మీర్ స్వయంప్రతిపత్తి ఆకాంక్షలపై ద్వేషం వెళ్లగక్కింది. దీంతో సంఘ్ పరివార్ చెబుతున్న జాతీయ వాదం, దేశభక్తి కేంద్ర స్థానంలోకి వచ్చి చర్చనీయాంశాలవుతున్నాయి.

అంబేద్కర్ స్టూడెంట్ అసోసియేషన్ విద్యార్థులను కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి బహిష్కరించడంతో సమస్య జటిలమై అనేక రూపాల్లో విస్తరిస్తూ పోయింది. అందుకే ఆ బహిష్కరణ ఎంత మాత్రం సాంకేతిక విషయం కాదు. అగ్రకుల బ్రాహ్మణీయ భావజాలం కలిగిన శక్తుల చర్య. రోహిత్ ఆత్మహత్య ఈ సంక్లిష్ట దృశ్యంలో భాగం. హిందూత్వకు కులంతో, జాతీయతతో ఉన్న సంబంధంవల్లే ఈ సంక్లిష్టమైన పరిణామాలు జరుగుతున్నాయి. అంతిమ సారంలో ఇది బ్రాహ్మణీయ కుల, మత, వర్గతత్వం. అందుకే ఈ మొత్తంలో సంఘపరివార్ ఆలోచనలకు అనుగుణంగా రాజ్యం ఎలా నడుచుకుంటున్నదో చూస్తున్నాం. కన్హయ్య కుమార్, ఉమర్ ఖలీద్, అనిర్బన్ భట్టాచార్య, ప్రొ.గిలానీలపై రాజద్రోహం కేసు పెట్టింది. భావాలు దేశభద్రతకు ప్రమాదకరమని అణిచివేయడమే ఫాసిజం.

రోహిత్ స్మృతిలో ఇవన్నీ మాట్లాడుకునేందుకే ఈ సభ. అందరూ తప్పక రండి.

సభాధ్యక్షత :
**గీతాంజలి**, విరసం

వక్తలు :
**విజయ్ పెద్దపూడి**
(విశ్వవిద్యాలయం బహిష్కరించిన ఐదుగురు విద్యార్థుల్లో ఒకరు)
అంబేద్కర్ విద్యార్థి సంఘం నాయకులు, హైదరాబాదు విశ్వవిద్యాలయం
**గజవెల్లి ఈశ్వర్**, జె.ఎ.సి. ఫర్ సోషల్ జస్టిస్ సభ్యులు,
దళిత విద్యార్థి సంఘం అధ్యక్షులు, హైదరాబాదు విశ్వవిద్యాలయం
**డా. శ్రీపతి రాముడు**, అధ్యక్షులు, సెంటర్ ఫర్ సోషల్ ఎక్స్‌క్లూజన్ అండ్ ఇంక్లూసివ్ పాలసీ, హైదరాబాదు విశ్వవిద్యాలయం
**డా. సౌమ్య దేచమ్మ**, ఆచార్యులు, సెంటర్ ఫర్ కంపారిటివ్ లిటరేచర్, హైదరాబాదు విశ్వవిద్యాలయం
**డి. ఉదయ్ భాను**, విరసం
**డా. సి.కాశీం**, విరసం
**వరవరరావు**, విరసం

**విప్లవ రచయితల సంఘం (విరసం)**

# భగత్‌సింగ్ స్ఫూర్తిని కొనసాగిద్దాం సామ్రాజ్యవాదాన్ని మతోన్మాదాన్ని వ్యతిరేకిద్దాం

అంతరాలుండని, అసమానతులుండని సామ్యవాదమే నిజమైన ప్రత్యామ్నాయం సాధించుకుందాం
కవి సభ జయప్రదం చేయండి

**తేది 27-3-2016 ఆదివారం సమయం: ఉ. 10.00 గంటలకు, స్థలం : తెలంగాణ ఎన్‌జీఓల భవనం, మహబూబ్‌నగర్.**

ప్రియమైన ప్రజలారా! సాహితీమిత్రులారా !

కుల, మత, సాంస్కృతిక, రాజకీయార్థిక పీడనకు, పెనుదోపిడీకి గురవుతున్న పీడిత ప్రజలందరికీ సర్దార్ భగత్‌సింగ్ జీవితం, వ్యక్తిత్వం గొప్ప ఆదర్శం. యువతరం, విద్యార్థిలోకం భగత్‌సింగ్ ఆదర్శాలను, కలలను, ఆచరణను అవగాహన చేసుకోవటం ఆచరణలో ముందుకు తీసుకుపోవటం వర్తమాన భారతదేశపు తక్షణ అవసరం.

23 మార్చ్ సర్దార్ భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్‌ల అమరత్వ దినం. బ్రిటిష్ వలస పాలకులు ఉరికంబం మీద నిలపినపుడు ఉరిని ముద్దాడి విప్లవాన్ని నినదించారు. ఇంక్విలాబ్ నినాదానికి ప్రాణం పోసారు. రాంప్రసాద్ బిస్మిల్, అష్ఫఖుల్లాఖాన్ తదితరుల వారసత్వాన్ని ఎత్తిపట్టారు. సర్దార్ భగత్‌సింగ్ 28.02.1907న ఈనాటి ఫైస్లాబాద్ జిల్లాలో బంగా గ్రామంలో ఆనాటి పంజాబ్‌లో జన్మించాడు. 1931లో ఉరి తీయబడేనాటికి అతని వయస్సు ఇరవై మూడున్నర సంవత్సరాలు. ఆనాడు భారతదేశాన్ని పట్టి పీడిస్తున్న అన్ని ప్రధాన సమస్యలపై సరైన ఆచరణీయమైన వైఖరులను తన రచనల ద్వారా ప్రకటించాడు. కుక్కను ముద్దాడే మనుషులు మనిషినెందుకు ముట్టుకోరని, ఇది దుర్మార్గమని తీవ్రంగా స్పందించాడు. మతం వ్యక్తిగత విశ్వాసం, మత రాజకీయాలలో ఉన్మాదమే తప్ప సామాజిక సమస్యలకు పరిష్కారం వెతకలేమన్నాడు. అసమానతలు, పీడన వివక్షలేని ప్రజాస్వామ్యాన్ని సామ్యవాద సమాజంలోనే అనుభవించగలమని అందుకు విద్యార్థులు, యువతరం పాటుపడాలని రాసాడు. ఆచరించాడు. భగత్‌సింగ్ అమరత్వానికి ఎనభై అయిదేండ్లు.

అసమ సమాజంలో శాంతి అనే నినాదపు డొల్లతనాన్ని గాంధీ రచనలకు సమాధానంగా రాసిన తన రచనలలో నిరూపించాడు. దేశం కోసం వీరోచితంగా ప్రాణాలర్పించిన భగత్‌సింగ్ సామ్రాజ్యవాద దోపిడీని అడుగడుగునా ప్రతిఘటించాడు. సామ్రాజ్యవాదాన్ని అంతం చేయటం, అంతరాలు, అసమానతలు లేని చైతన్యవంతమైన సమాజాన్ని నిర్మించటమే నిజమైన దేశభక్తి అని ప్రకటించాడు. అసమానతలు లేని సమాజం ప్రభుత్వాల సంక్షేమ పథకాలతోనో, దోపిడీ సంపన్న వర్గాల దయాధర్మాలతోనో ఏర్పడదని విద్యార్థులు, యువతరం, కార్మికులు ముందునిలిచి రైతాంగంతో కలిసి ఈ లక్ష్యం సాధించాలని, రాజీపడరాదని హెచ్చరించాడు.

సర్దార్ భగత్‌సింగ్ వంటి వీరయోధుల రక్తతర్పణాలతో ఆదివాసీ రైతాంగ పోరాటాలతో దేశం మీద బ్రిటిష్ ప్రత్యక్షపాలన ముగిసిపోయింది. అధికారం చేతిలోకి తీసుకున్న పాలకులు ఏ విధంగాను భగత్‌సింగ్ స్ఫూర్తిని కాదుకదా, జాతీయోద్యమ కనీస ఆదర్శాలను కూడా ఆచరణలో పెట్టలేకపోయారు. పైగా దేశాన్ని సామ్రాజ్యవాద బందీగా, దోపిడీ కేంద్రంగా మార్చారు. దేశంలో అన్ని రాజకీయ పార్టీలకు సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలే ఆదర్శం. ఇవి సామ్రాజ్యవాదానికి, సంపన్నవర్గానికి దేశాన్ని దోచిపెట్టే విధానాలు, సామ్రాజ్యవాదం అంటే పెట్టుబడి అత్యున్నత దశ. అంటే ప్రపంచ శ్రామిక ప్రజల మీద అమలయ్యే దోపిడీ అత్యున్నత దశ. అందకే దేశంలో బడుగుల వాడలు, తరతరాల వెలివాడలు బలివాడలవుతున్నాయి. భారత పాలకవర్గాలు దేశాన్ని కార్పోరేట్లకు అప్పగించటానికి మతాన్ని అధికార రాజకీయాల కోసం విశృంఖలంగా ఉపయోగించుకుంటున్నాయి. నమ్మకాలతో, మూఢనమ్మకాలతో ముంచెత్తుతు మౌలికమైన సమస్యల నించి దారి మళ్ళిస్తున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రజల్ని ప్రత్యేకించి శ్రామికుల్ని ఎంతగా విభజించే పన్నుగడలు ముందుకు తెచ్చినా భగత్‌సింగ్ తన లక్ష్యం నించి, ఆదర్శాల నించి వైదొలగలేదు. ఆ సంకల్పం, ఆ లక్ష్యశుద్ధి ఈనాడు మనకు స్ఫూర్తి కావాలి.

భగత్‌సింగ్ రచనలను, ఆదర్శాలను పాలకులు పాఠ్యాంశాలుగా ప్రవేశపెట్టలేకపోయారు. రహస్య జీవితం గడుపుతూ అనేక పేర్లతో అతను ఆనాడు వెలువరించిన రచనలను ప్రజలకు అందుబాటులోకి తేలేకపోయారు. ఇది భగత్‌సింగ్ విషయంలో మాత్రమే కాదు, జ్యోతిభాపూలే, అంబేద్కర్ వంటి వారందరి విషయంలోను ప్రభుత్వాలు పాటించిన విధానం. సామాజిక, ప్రజాస్వామిక, సామ్యవాద దృక్పథం కలిగిన వ్యక్తులు, సంస్థలు పూనుకున్న ఫలితంగా కొద్దిమంది మాత్రమే ఆ రచనలను, ఆ స్ఫూర్తిని అందుకోగలుగుతున్నారు.

పాలకులు ప్రజలకు, ప్రకృతికి మొత్తంగా దేశానికి హాని చేసే, నష్టం కలిగించే విధానాలను పనిగట్టుకుని అమలు చేస్తున్నారు. ఫలితంగా దేశం అనేకానేక సంక్లిష్టమైన సమస్యల విషవలయంలో గిరికీలు కొడుతున్నది. విశ్వవిద్యాలయాలు దేశం ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలను ముందుకు తెస్తున్నాయి. గడిచిన మూడు దశాబ్దాలుగా అమలవుతున్న తీవ్ర ప్రైవేటీకరణ విద్య కొనగల వారికి, కొనలేని వారికి మధ్య పెద్ద విభజన తీసుకు వచ్చింది. నిరుపేదలు ప్రభుత్వ విద్యాసంస్థలలో చేరుతుండగా వారిలో కొందరే విశ్వవిద్యాలయాల స్థాయికి చేరుతున్నారు. కొనగలిగిన వారి పిల్లలు వృత్తి విద్యా కోర్సులలోకి పోతున్నారు. పరిశోధనలు చేసి సైంటిస్టులు, సామాజిక శాస్త్రవేత్తలు కావాలనుకునే రోహిత్ వంటి విద్యార్థులు ఆర్థిక అసమానతలకే కాక కుల అవమానాలకు గురవుతున్నారు. ఆత్మహత్యలకు నెట్టబడుతున్నారు. తెగబడి పోరాడుతూ మౌలికమైన సమస్యలను ఎజెండా చేస్తున్న విద్యార్థులు, అధ్యాపకులు రాజద్రోహం వంటి నేరాలు ఆరోపింపబడుతూ జైళ్ళలోకి నెట్టబడుతున్నారు. హైదరాబాదు నించి, ఢిల్లీనించి అలహాబాద్ దాకా మనం చూస్తూనే

ఉన్నాం.

విషాదం ఏమిటంటే ఆనాడు జాతీయవాదాన్ని, దేశభక్తిని రవీంద్రనాథ్ ఠాగూర్ చర్చించిన స్థాయిలోనైన విద్యార్థులు చర్చించలేని పరిస్థితి కల్పించి విద్య అర్థాన్ని, విశ్వవిద్యాలయాల లక్ష్యాన్ని పాలకులు దెబ్బతీస్తున్నారు. అంతేకాక ప్రైవేటు, విదేశీ విశ్వవిద్యాలయాల కోసం ప్రభుత్వాలు పనిగట్టుకొని స్వదేశీ విద్యాసంస్థలకు అవసరమైన నిధులు కేటాయించకుండా, వసతులు కల్పించకుండా, అధ్యాపకులను నియమించకుండా, పరిశోధనలను ప్రోత్సహించకుండా సమస్యలకు గురి చేస్తున్నాయి. ఏ చిన్న సామాజిక సమస్యకు పరిష్కారం చూపలేని ఉద్వేగాలను, మత విద్వేషాలను రెచ్చగొడుతున్నాయి.

ఇంకోవైపు నరేంద్ర దభోల్కర్, గోవింద్ పన్సారే, కల్బుర్గి వంటి హేతువాద ఉద్యమకారులను, రచయితలను, సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాను వ్యతిరేకించిన బిస్మార్క్ వంటి ఉద్యమకారులను, ఆదివాసుల పోరాటాలకు బాసటగా నిలుస్తున్న వారిని అంతం చేస్తున్నారు. సోనిసోరి వంటి ప్రజాస్వామిక వాదుల మీద నిత్య నిర్బంధం అమలవుతున్నది. ఈ దేశపు జైళ్ళు ప్రజాస్వామిక వాదులతో నిండుతున్నాయి. పాలకులు భగత్‌సింగ్ స్ఫూర్తికి ప్రతికూల దిశలో దేశాన్ని నడుపుతున్నారు. దీనిని కన్హయ్యకుమార్, ఉమర్‌ఖలీద్, అనిర్బన్, రిచాసింగ్ వంటి విద్యార్థులు ప్రశ్నిస్తున్నారు. ఈ పరిస్థితులలో కవులు, కళాకారులు, మేధావులు ఈ దేశపు మౌలిక సమస్యలను చర్చనీయాంశం చేస్తున్న, పోరాడుతున్న విద్యార్థులకు, విద్యార్థి ఉద్యమాలకు బాసటగా నిలవాలని కోరుతున్నాము.

అమరుడు సర్దార్ భగత్‌సింగ్ ఆశయాల స్ఫూర్తిని కొనసాగించాలని కోరుతూ 27 మార్చ్ ఆదివారం ఉదయం పదిగంటలకు కవి సభ; అలాగే ఏప్రిల్ 14న అంబేద్కర్ ఆశయాల స్ఫూర్తిని చర్చించటానికి అతని జయంతి రోజు సెమినార్ జరపాలని పాలమూరు అధ్యయన వేదిక నిర్ణయించింది. ఈ రెండు కార్యక్రమాలను జయప్రదం చేయాలని కోరుతున్నాము.

ముందుగా తేది 27-3-2016 ఆదివారం "సామ్రాజ్యవాదాన్ని, మతోన్మాదాన్ని వ్యతిరేకిద్దాం అంతరాలు లేని సమాజాన్ని, నిజమైన ప్రజాస్వామ్యాన్ని, సామ్యవాదాన్ని సాధించుకుందాం" అనే లక్ష్యంతో నిర్వహిస్తున్న కవిసభలో కవులు, కళాకారులు తమ స్వీయ కవితాగానం చేయాలని కోరుతున్నాము.

ఉద్యమాభినందనలతో..

మీ

**పాలమూరు అధ్యయన వేదిక**

**మహబూబ్‌నగర్ జిల్లా**

వివరాలకు: 9985203376, 9848484727, 9490909792



***పత్రికా ప్రకటన***

యూనివర్సిటీయా.. నాజీ క్యాంపా?

హెచ్.సి.యూలో బి.జె.పి., ఎ.బి.వి.పి దౌర్జన్యాలను ఖండిస్తున్నాం. హైదారాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఫాసిజం రాజ్యామేలుతోంది. రోహిత్ ఆత్మహత్యకు కారకుడైన వైస్ ఛాన్సలర్ అప్పారావు మీద కేసు నమోదై ఉన్నా ఆయన్ని ఉద్దేశపూర్వకంగా విద్యార్థులను రెచ్చగొట్టే ధోరణిలోనే రెండు నెలల అనంతరం క్యాంపస్‌కు రప్పించారు. పరిస్థితిని మరింత దిగజార్చడానికి పాలక పక్ష విద్యార్థి సంఘం ఎ.బి.వి.పి. ఆయనకు రక్షణగా ప్రైవేటు సైన్యం వలె వెళ్ళి హింసకు దిగి మిగతా కార్యాచరణ అంతా పోలీసుల చేతుల్లో పెట్టింది. ఒక పద్ధతిగా, కుట్రపూరితంగా హెచ్.సి.యూ.లో రెండు మూడు రోజుల పరిణామాలు జరిగాయి. పోలీసులు విద్యార్థులను కక్షపూరితంగా కొట్టి భయభ్రాంతులకు గురిచేయడం, అరెస్టులు చేసి ఆచూకీ కూడా చెప్పకపోవడం, ప్రొఫెసర్లనూ వదలకుండా కొట్టుకుంటూ తీసుకుపోవడం, అక్రమ కేసులు బనాయించడం ఇవన్నీ హెచ్.సి.యూను సంఘ పరివార్ చేతుల్లో పెట్టి, విద్యార్థి రాజకీయాలను మొత్తంగా అణచివేసే ప్రయత్నంలో భాగంగా కనపడుతున్నది. రోహిత్, అతని సహచరులను సాంఘిక బహిష్కారణ చేసి చివరికి రోహిత్ ఆత్మహత్యకు కారకుడైన వి.సి. నిన్నటి నుండి హెచ్.సి.యూ విద్యార్థులతో పగ తీర్చుకుంటున్న విధంగా ప్రవర్తిస్తున్నాడు. మెస్ మూసేసి విద్యార్థులకు తిండి కూడా లేకుండా చేశాడు. క్యాంపస్‌లో ఇంటర్నెట్ కట్ చేశాడు. బైటి ప్రపంచంతో సంబంధం తెంచేసి, మీడియాను కూడా రానివ్వకుండా విద్యార్థులపై ప్రతాపం చూపుతున్నాడు. ఇదంతా సంఘపరివార్ కనుసన్నలలో జరుగుతున్నది.

ఈ మధ్యాహ్నం పోలీసులు విద్యార్థులపై మరోసారి విరుచుకుపడి విరసం సభ్యుడు, యూనివర్సిటీ విద్యార్థి ఉదయ్ భానును మిగిలిన వారి నుండి వేరు చేసి తీవ్రంగా కొట్టడంతో అతని పరిస్థితి ఆందోళనకరంగా ఉంది. విద్యార్థి ఉద్యమాలతోనే రాష్ట్రం సాధించిన తెలంగాణలో, ఆ ఉద్యమ నెత్తుటి ధారపోతలతోనే గద్దెనెక్కిన చంద్రశేఖర రావు ప్రభుత్వం జరుగుతున్న వాటి పట్ల, పోలీసు హింసాకాండతో సహా ఆమోదంతో ఉండటం సిగ్గుచేటు.

తక్షణం వి.సి.అప్పారావును పదవి నుండి తొలగించి, అరెస్టు చేసి శిక్షించాలి. ఎ.బి.వి.పి. పక్షం వహించి న్యాయం కోసం పోరాడుతున్న విద్యార్థులపై హింసను ప్రయోగించిన పోలీసు అధికారులపై విచారణ జరిపించాలి.

సంఘపరివార్ ఫాసిస్టు రాజకీయాలపై ప్రజాస్వామిక శక్తులు ఐక్యంగా ఉద్యమించాలి. విశ్వవిద్యాలయాలు విశాల భావాలకు వేదికగా ఉండాలి. భావ సంఘర్షణ, ఉన్నత భావాల వికాసం, ప్రజాస్వామిక స్వేచ్ఛ కోసం విద్యార్థుల న్యాయమైన పోరాటానికి రచయితల సంఘంగా విరసం సంఘీభావం తెలుపుతున్నది.

**- పి.వరలక్ష్మి** (విరసం కార్యదర్శి),

**వరవరరావు** (విరసం సీనియర్ సభ్యులు)

# -: స్వీకారం :-

| | | |
|---|---|---|
| నక్షత్ర ధూళి<br>కవులు, మిత్రులు, విద్యార్థులు<br>వెల : రు. 70/-<br>పేజీలు : 108 | స్వాప్నికుడి మరణం<br>విశిధ<br>ప్రచురణ : లెస్ మిసరబుల్స్<br>వెల : రు. 50/-<br>పేజీలు : 159 | వెలివాడే తొలిపొద్దై...<br>రోహిత్ వేముల స్మృతిలో రచనలు<br>ప్రచురణ : విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 70/-<br>పేజీలు : 136 |
| పద్మ<br>అరుణతార కథలు<br>(1988)<br>సంకలనం - 10<br>ప్రచురణ : చరిత<br>వెల : రు. 30/-<br>పేజీలు : 96 | విప్లవంలో మాతృత్వం<br>అరుణతార కథలు<br>(1988)<br>సంకలనం - 11<br>ప్రచురణ : చరిత<br>వెల : రు. 30/-<br>పేజీలు : 96 | కె.వి.ఆర్.<br>డిటెన్యూ డైరీ<br>ప్రచురణ : కె.వి.ఆర్. శారదాంబ స్మారక కమిటీ<br>వెల : రు. 170/-<br>పేజీలు : 340 |
| 25 ఏళ్ళ మహిళామార్గం సంపాదకీయాలు<br>మన గమ్యం<br>ప్రచురణ : మహిళామార్గం ప్రచురణలు<br>వెల : రు. 150/-<br>పేజీలు : 343 | నది రేపటి గీతం<br>కవితా సంకలనం<br>రేడియం<br>ప్రచురణ : పాలమూరు అధ్యయన వేదిక<br>వెల : రు. 80/-<br>పేజీలు : 100 | విప్లవ స్వాప్నికుడు<br>కామ్రేడ్ రవూఫ్<br>సంస్మరణ రచనలు<br>ప్రచురణ : కామ్రేడ్ ఎస్.ఎ.రవూఫ్ సంస్మరణ కమిటీ<br>వెల : రు. 50/-<br>పేజీలు : 96 |
| తెలంగాణ ప్రజల సాయుధ పోరాటం<br>కా. డి.వి. రచనలు - 5<br>కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు<br>ప్రచురణ : పోరునేల ప్రచురణలు<br>వెల : రు. 300/-<br>పేజీలు : 646 | భారత జనతా ప్రజాతంత్ర విప్లవం<br>కార్యక్రమం - ఒక వివరణ<br>కా. డి.వి. రచనలు - 6<br>కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు<br>ప్రచురణ : పోరునేల ప్రచురణలు<br>వెల : రు. 150/-<br>పేజీలు : 420 | భారత జనతా ప్రజాతంత్ర విప్లవం<br>మౌలిక డాక్యుమెంట్లు<br>కా. డి.వి. రచనలు - 7<br>కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు<br>ప్రచురణ : పోరునేల ప్రచురణలు<br>వెల : రు. 150/-<br>పేజీలు : 391 |

**అరుణతార చదవండి! చదివించండి! చందాదారులు కండి!**

**విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;**

**రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;**

**ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-**

**email : arunatara1977@gmail. com**



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KLVA101M186** |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | **08 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | bhanu |
| స్కాన్ చేసినది | niveditha |
| పరీక్ష చేసినది | sireesha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| సంస్థితి | [illegible] |